# ప్రసిద్ధ గ్రంథాలయాలు

వెలగా వెంకటప్పయ్య

గ్రంథాలయ సేవా కేంద్రం
గుంటూరు - 522002

# PRASIDDHA GRANTHALAYALU
( History of Famous Libraries )

By
VELAGA VENKATAPPAIAH

*Editor*
P S G KUMAR

May 1976

Granthalaya Seva Kendram (RCKELIC), Guntur

Price Rs 8

*VIKAS PRESS*
*GUNTUR*

# ఈ రచన

తెలుగునాట గల గ్రంథాలయ కార్యకర్తలు భారత దేశంలోని ప్రసిద్ధ గ్రంథాలయాల తీరుతెన్నులు కొంతవర కైనా తెలుసుకోవడంవలన తమ గ్రంథాలయాలను అభివృద్ధి చేసుకోడానికి క్రొత్త ఆలోచనలు వస్తాయనే నమ్మకంతో చాలకాలం క్రితం యీ ప్రయత్నం తలపెట్టాను. కొంత సమాచారం గూడ సేకరించాను. అదృష్టవశాత్తూ 1968, 1969 సంవత్సరాలలో తెలుగు అకాడమీ వారికి ఒక "గ్రంథ సూచీ" తయారుచేసే సంకల్పంతో ఒకటి, రెండు మినహా భారత దేశంలోని ప్రసిద్ధ గ్రంథాలయాలన్నిటిని స్వయంగా చూచి వాటి అభివృద్ధిని తెలుసుకొనే అవకాశం కలిగింది. ఇందుకు ఎంతగానో తోడ్పడ్డారు డాక్టరు పి ఎస్ ఆర్ అప్పారావు గారు. పిదప యీ వ్యాసాలలో మూటిని మినహా మిగతా వాటిని "తెలుగు విద్యార్థి" మాసపత్రికలో వరుసగా ప్రచు రించి ప్రోత్సహించారు మిత్రులు కొల్లూరు కోటేశ్వరరావు గారు. వెంకటగిరి సంస్థాన గ్రంథాలయాన్ని గురించి ప్రత్యేక రచన చేయాలని సంకల్పించాను. కాని యింతకు ముందే దానిపై చక్కని వ్యాసం ప్రచురించిన డాక్టరు కె పురు షోత్తంగారి (నెల్లూరు) వ్యాసం పునర్ముద్రించడం యోగ్యమని భావించాను. అందుకు అనుమతించారు డాక్టరు పురుషోత్తం గారు. ఈ విషయంలో డాక్టరు సి రామచంద్రరావుగారి సహాయం ఎంతో ఉంది.

ఆంధ్రజ్యోతిలో ప్రచురింపబడిన ఒక సంపాదకీయాన్ని, ఒక విలేఖరి రిపోర్టును పునర్ముద్రించుకోడానికి అనుమతించారు సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావుగారు.

ఉద్యోగరీత్యా గల అనేక వ్యాపకాలలో బొత్తిగా సమయం దొరకక పుస్తకాల ప్రచురణ ఆగిపోయిన తరుణంలో గుంటూరు జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మన్ యన్నం వెంకట నర్సిరెడ్డిగారు దీన్ని పుస్తక రూపంలోకి తీసుకురావడానికి ఎంతో ప్రోత్సహించారు. సాహితీ బంధువులు లంకా సూర్య నారాయణగారు, గొల్లపూడి ప్రకాశరావుగారు ఎంతో శ్రమించి దీనికి చక్కని ఆకృతి కల్పించారు.

ఇలా ఎందరి సహకారంతోనో జాతీయస్థాయిలోగల గ్రంథాలయాలు, ప్రాచ్య గ్రంథాలయాలు, పౌర గ్రంథాలయాల వివరాలతో యీ రచన "ప్రసిద్ధ గ్రంథాలయాలు" రూపొందింది. వీరందరకూ హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ రచన చదివాక కార్యకర్తలలో ఒక్క కొత్త ఆలోచన వచ్చినా ధన్యుణ్ణి. సెలవు.

వెలగా వెంకటప్పయ్య

జిల్లా కేంద్ర గ్రంథాలయం

గుంటూరు

# విషయ సూచిక

# జాతీయ గ్రంథాలయం

# 1

పంగొమ్మిదో శతాబ్ది ప్రారంభం నాటికి విదేశాలలో పుస్తకాల ముద్రణ ముమ్మరంగా సాగుతూ ఉంది. మన దేశంలో అప్పటికి గ్రంథ ప్రచురణ చెదురుమదురుగా ఉంది. విదేశీ పాలకులతో బాటు ఆనాటికి సంపన్నమైన కుటుంబాలకు చెందిన కొద్దిమంది మాత్రం చదువుసాములు నేర్చుకో గలిగారు. మధ్యతరగతి కుటుంబాలలో ఆ రోజులలో విద్యా సముపార్జనయం దాసక్తి కలగటం ప్రారంభించింది. ఆ సమయంలో ఇంగ్లీషువారు, ఉన్నత తరగతి ఉద్యోగులు తమ ప్రయోజనం కోసం మద్రాస్, బొంబాయి, కలకత్తా మొదలైన నగరాలలో గ్రంథాలయాలు స్థాపించారు. ఈ గ్రంథాలయాలలో ప్రవేశం అందరికీ లేదు. ఆ పెద్దల ప్రాపకం సంపాదించిన ప్రబుద్ధులకే గ్రంథాలయాలను ఉపయోగించే అవకాశముంది.

ఈ పరిస్థితిని గమనించి 1836లో విశ్వకవి రవీంద్రనాథ ఠాగూర్ తాతగారైన యువరాజు ద్వారక్‌నాథ్ ఠాగూర్ స్థితిమంతుడు గనుక, తన స్వంత డబ్బుతో కలకత్తా పౌర గ్రంథాలయం స్థాపించారు. ఈ గ్రంథాలయం వ్యవహారరీత్యా ఒక వ్యక్తి స్వంతమైనప్పటికీ యిది పూర్తిగా పౌర గ్రంథాలయమే. దీనిని పౌరులందరూ ఉచితంగా ఉపయోగించుకోడా

నికి వీలుంది. ఆ తొలి రోజులలో బెంగాలీ నవలా జనకుడు ప్యారీచంద్ మిత్రగారు దీనికి తొలి గ్రంథపాలకుడు కావడం యీ గ్రంథాలయం పలువురి మన్ననలు పొందడా నికి అవకాశం కలిగించింది.

తర్వాత రోజులలో ద్వారక్‌నాథ్ ఠాగూర్‌గారికి ఈ గ్రంథాలయం మీద శ్రద్ధతగిలింది. దీనిని కొంతమంది ట్రస్టీ లకు అప్పగించారు. అప్పటికి అనేక ఉదాత్తమైన గ్రంథాలను యీ గ్రంథాలయానికి సంపాదించినప్పటికి దీని స్థాయి కొంత తగ్గి, నడకలో కుంటుపడింది. ఈ సమయంలో అప్పుడు భారత దేశానికి వైస్రాయిగా ఉంటున్న అసాధారణ ప్రజ్ఞావంతుడు లార్డ్ కర్జన్ దృష్టి దీనిపై పడింది!

విద్యయందాసక్తి, సంప్రదాయాలందు గౌరవంగల ఆంగ్లేయులు మనదేశం వచ్చినప్పటినుండీ వీలున్నపుడెల్లా ఉత్తమ గ్రందాలను సేకరిస్తూ ఆయా పరిపాలన శాఖలలో భద్రపరుస్తూ వచ్చారు. 1891లో లార్డ్ కర్జన్ యీ శాఖలలోని గ్రంథాలన్నిటినీ సమీకరించి ఇంపీరియల్ లైబ్రరీ పేరున ఒక గ్రంథాలయాన్ని అన్ని హంగులతో స్థాపించారు. అప్పట్లో ప్రభుత్వోద్యోగులు మాత్రం దీన్ని ఉపయోగించు కొనేవారు. ఆ సమయంలో కర్జన్ ప్రయివేటు యాజమాన్యం నుండి కలకత్తా పౌర గ్రంథాలయాన్ని అమాంతంగా కొనివేసి దానిని ఇంపీరియల్ గ్రంథాలయంతో విలీనం చేశాడు. 1930 జనవరి 30వ తేదీ నుండి దీనిని పూర్తిగా పౌర గ్రంథాల యంగా మార్చి వేశాడు. భారత గ్రంథాలయ చరిత్రలో అది

అపూర్వమైన దినం. గ్రంథాలయసేవ ప్రభుత్వం అందించ వలసిన బాధ్యతను గుర్తించిన చరిత్రాత్మకమైన ఆ రోజును ఎవరూ మరువరాదు. ఆ విధంగా యీ గ్రంథాలయం పూర్తిగా ప్రభుత్వం యాజమాన్యంలోకి వచ్చింది. జాతీయ గ్రంథాలయ నిర్మాణానికి అంకురార్పణ జరిగింది. కర్జన్ యీ గ్రంథాలయాభివృద్ధి యందు విశేష శ్రద్ధ కనబరచాడు. ఇంగ్లండులోని బ్రిటీషు మ్యూజియంలో సహాయ గ్రంథ పాల కుడుగా ఉంటున్న జాన్ మాక్ ఫర్లేన్‌ను గ్రంథపాలకుడుగా నియమించాడు. మాక్ ఫర్లేను గ్రంథాలయ నిర్వహణయందు విశేషానుభవం కలిగినవాడు కావటంచేత యీ గ్రంథాల యాన్ని ఎన్నోవిధాల అభివృద్ధి చేశాడు. లార్డ్ కర్జన్ ఊహించినట్లు యీ గ్రంథాలయాన్ని ఒక పరిపూర్ణమైన రెఫరెన్స్ గ్రంథాలయంగా, విద్యార్థులకు, ఉపాధ్యాయులకు అధ్యయన నిలయంగా, పరిశోధకులకు ఒక కోశాగారంగా దీనిని మలచటానికి ప్రయత్నం జరిగింది. ఈ గ్రంథాలయం ప్రారంభించిన దినాలలో యిందు 10,000 గ్రంథాలు మాత్రం ఉండేవి. వీటి సంఖ్యలో తక్కువైనా విలువ అపారమైనది.

మాక్ ఫర్లేన్ తర్వాత కూడా యీ గ్రంథాలయానికి అసాధారణ పాండితీ ప్రకర్ష గలవారు గ్రంథపాలకులుగా వచ్చారు. ఆ తర్వాత వచ్చిన శ్రీ హరినాథ్ డే అనేక యూరోపు, ఆసియా భాషలలో ప్రజ్ఞావంతుడు వారు రెండేళ్ళు మాత్రం ఆ పదవిలో ఉన్నారు. పిదప కవిత్వమందు పరిచయం, పరిపాలన యందు అనుభవం గల ఛాప్మన్ గ్రంథపాలకుడుగా నియ

మించబడ్డాడు. ఛాప్మన్ కాలంలో గ్రంథాలయసూచీ తయారుచేయబడినది. ఆ కాలంలో భారతదేశంలో ప్రచురింపబడిన ఉత్తమ గ్రంథాలన్నీ సేకరించబడటమేగాక, బెంగాల్‌లో ప్రచురింపబడిన ప్రతి పుస్తకము సేకరించి భద్రపరచబడింది. ప్రభుత్వం దీని పాలనను భారతదేశంలో వివిధ ప్రాంతములకు చెందిన విద్యావేత్తలకు అప్పగించింది.

ఆ తర్వాత ఖాన్ బహాదూర్ కె యమ్ అసదుల్లా గ్రంథపాలకుడుగా నియమించబడి 1947 వరకు ఆ పదవిలో వున్నారు. వీరి కాలంలోకూడ యీ గ్రంథాలయం చెప్పుకోన దగినంత అభివృద్ధి చెందింది. మెకాలే ప్రవేశపెట్టిన ఆంగ్ల విద్యావిధానాన్ని అనుసరించి బ్రిటన్‌లో ప్రచురించబడిన వేలాది గ్రంథాలు యిందు చేరాయి. ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ చట్టాన్ని (1867) అనుసరించి వచ్చిన గ్రంథాలన్నీ లండన్ లోని బ్రిటీషు మ్యూజియంకు చేర్చబడ్డాయి గాని వానిని యింపీరియల్ గ్రంథాలయానికి పూర్తిగా దక్కనీయలేదు. అందుచేత చాలభాగం భారతీయ ప్రచురణలు యిందు చేరలేదు. అయినప్పటికీ యీ విధంగా 1947 సం నాటికి యిందులో మొతం 35,000 గ్రంథాలు చేరాయి.

### జాతీయ గ్రంథాలయం

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక యీ గ్రంథాలయ నిర్వాహణలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. దీనిని జాతీయ గ్రంథాలయంగా ప్రభుత్వం మార్చింది. అప్పుడు కేంద్రంలో విద్యామంత్రిగావున్న మౌలానా అబుల్ కలామ్

ఆజాద్ యీ జాతీయ గ్రంథాలయానికి ప్రారంభోత్సవం చేశారు. లెప్టినెంటు గవర్నర్లకూ, వైస్రాయీలకు ఆనాడు నివాస భవనంగా వున్న బ్రహ్మాండమైన సుందరోద్యానవనాలతో నిండుకొనియున్న సువిశాల బెల్వెడెర్ ప్రాసాదంలోకి యీ గ్రంథాలయం మార్చబడింది. వీటన్నిటికంటె మించి గ్రంథాలయ నిర్వహణకు ప్రాణభూతమైన గ్రంథపాలకుడుగా అసాధారణ శక్తిసంపత్తి, కార్యదీక్ష, దక్షత ముప్పిరిగొన్న బి యస్ కేశవన్ గారిని నియమించబడటం మరొక ముఖ్య విశేషం. దీని అభివృద్ధిపై ప్రభుత్వం విశేషశ్రద్ధ కనబరచింది. కేశవన్‌గారు 1962 వరకు అచట పనిజేశారు.

గ్రంథ సంపద

భారతీయ సాహిత్యమంతా యీ గ్రంథాలయంలో భద్రపరచ బడాలనే కోరిక జాతీయ గ్రంథాలయంగా మారింది. కోట్లాది రూపాయల ఖర్చుతో లక్షలాది ఉత్తమ గ్రంథాలు భారతీయ సంస్కృతిని, సంప్రదాయాన్ని ప్రతిబింబించు గ్రంథాలు సంపాదించబడినాయి. వీటికి తోడుగా ఆధునిక విజ్ఞానశాస్త్రం, సాంకేతిక విషయాలపై విదేశీ గ్రంథాలు అనేకం సేకరించబడ్డాయి. ప్రామాణికమైన, అధికారయుతమైన సమాచార గ్రంథాలు, ఆచూకీ గ్రంథాలు పెక్కు ప్రోగు చేయ బడ్డాయి.

మిత్రరాజ్య సమితి, దాని అనుబంధశాఖలు, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా మొదలైన దేశాల ప్రభుత్వ ప్రచురణలు ఉచితంగా వచ్చే అవకాశం కలుగజేయబడింది.

ఇవిగాక భారత ప్రభుత్వ ప్రచురణలకు మారుగా దేశవిదేశాల సంస్థలనుండి ప్రచురణలను యిచ్చిపుచ్చుకోనడం వలన అనేక అధికారిక గ్రంథాలు యీ గ్రంథాలయానికి వచ్చాయి.

వీటన్నిటినిమించి జాతీయ గ్రంథాలయాన్ని పలువురు వ్యక్తులు తమ స్వంత గ్రంథాలయాలను ఎట్టి ఫలాపేక్షలేక అప్పగించారు. బుహార్ జమీందారు అరబిక్, ఉర్దూ, పర్షియన్ మొదలైన భాషలలో సంపాదించిన అపూర్వమైన ముద్రితా ముద్రిత గ్రంథాలు దీనికి దానం చేశారు. 1949లో అశుతోష్ ముఖర్జీ వారసులు 75,000 పుస్తకాలను యీ గ్రంథాలయానికిచ్చారు. సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు సర్ జోదునాథ్ సర్కార్, డాక్టర్ యస్ యన్ సేన్, ఆచార్య వైయాపురి పిళ్ళై మొదలయినవారి అపూర్వ గ్రంథాలు యీ గ్రంథాలయానికి దానంగా సంపాదించబడి ప్రత్యేక అలంకారాలయ్యాయి. ఈ విధంగా యీ గ్రంథాలయ సంపద అపారంగా పెరిగింది. ఈ నాటికి మొత్తం యిందు 13 లక్షల వరకు గ్రంథాలున్నవి. ఇందు 2 లక్షల వరకు భారతీయ భాషలపై గ్రంథాలున్నవి. దానంగా, బదులుగా సంపాదించిన గంథాలు లక్షా, 80 వేలవరకు ఉన్నాయంటే యీ సంపద విలువను మనం ఊహించవచ్చు.

## గ్రంథాలయ సేవ

ఈ గ్రంథాలయం నేడు తూర్పు దేశాలలోకి పెద్దదిగా ప్రసిద్ధమైనదిగా భావించబడుతున్నది. పౌరులందరు దీనిని ఉచితంగా ఉపయోగించడానికి అవకాశం వున్నది. ఏడాదిలో 362

రోజులు పనిచేస్తున్నది. గ్రంథాలు అచటే చదువుకొనడానికి, అరువుగా తీసుకొని వెళ్ళడానికి వీలున్నది. పండితులు, పరిశోధకులు ప్రత్యేకంగా కూర్చొని చదువుకోవడానికి అవకాశాలున్నవి. ఒకప్పుడు తెల్లవారికి విందులు వినోదాలకు వుపయోగించబడిన బ్రహ్మాండమయిన హాలు ఈనాడు పఠన మందిరంగా వుపయోగ పడుతోంది. సుమారు 11,000 పత్రికలు తెప్పించబడుతున్నవి. సగటున రోజుకు వెయ్యిమందికి పైగా గ్రంథాలయానికి రాగా, 11 వందలు పుస్తకాలను అచట చదువుతున్నారు. పుస్తకాలు అరువుగా తీసుకువెళ్ళే సభ్యుల సంఖ్య 15,830 వరకూ వుంది. కేవలం వ్యక్తులకేగాక దేశంలో గుర్తించబడిన ఏ గ్రంథాలయానికైనా పుస్తకాలను సహకార విధానం మీద అరువుగా యిస్తున్నారు.

1960 నుండి యీ గ్రంథాలయంలో బాలల విభాగాన్ని గూడ ప్రారంభించారు. వివిధ భారతీయ భాషలలో గల దాదాపు 14 వేల పుస్తకాలు యిప్పటికి సేకరించబడ్డాయి. బాలలను యీ విభాగం విశేషంగా ఆకర్షిస్తున్నది.

## మైక్రోఫిల్ములు

ఈ గ్రంథాలయంలో అపురూపమైన వ్రాతప్రతులు 3,00,000 ఉన్నవి. ప్రపంచ విజ్ఞాన సంస్థ సహకారంతో వీటన్నిటినీ మైక్రోఫిల్ము తీసే కార్యక్రమం యిటీవల చేపట్టబడింది. వీటిలో ఒక్కొక్క వ్రాత ప్రతికి రెండేసి ఫిల్ము ప్రతులు తీసి వేరు వేరు గ్రంథాలయాలలో ఉంచుతారు. కొన్నిటిని నామమాత్రపు ధరకు సంస్థలకు, గ్రంథాలయాలకు విక్రయించు

తారు. ఇందువలన తరతరాలుగా వ్రాతప్రతులలో నిక్షిప్తమై యున్న విజ్ఞాన భాండాన్ని వెలికితీయడానికి పరిశోధకులకు చక్కని అవకాశం ఏర్పడుతుంది.

## గ్రంథాలయ సూచీ ప్రచురణ

గ్రంథాలయంలో గల పుస్తకసంచయాన్ని సాధికారంగా పరిచయం చేసేందుకు యీ గ్రంథాలయం ఆధునిక విధానంలో (కేటలాగ్స్) ప్రచురణ కార్యక్రమం తలపెట్టింది. ఈ సూచీల సాయంతో ప్రపంచంలో ఎచ్చటివారైనా జాతీయ గ్రంథాలయాలలో గల గ్రంథసంపదను తెలుసుకోడానికి, అవసరమైతే వాటికి నకళ్ళు సంపాదించుకోడానికి అవకాశముంది. ఇప్పటివరకు యీ గ్రంథాలయం యీ దిగువ ప్రచురణలను వెలుగులోకి తెచ్చింది.

1 యురపియన్ భాషల గ్రంథకర్త సూచీలు 10 సంపుటాలు 1941–1964.

2 బెంగాలీ గ్రంథకర్త సూచీలు 4 సంపుటాలు 1941–1963.

3 సంస్కృత, పాళీ, ప్రాకృత భాషల సూచీలు 2 సంపుటాలు 1951–1956.

4 అశుతోష్ సంకలనాల సూచీ 2 సంపుటాలు 1958–1963.

5 బుహార్ గ్రంథాలయ పర్షియన్, అరబిక్ వ్రాతప్రతుల సూచీలు 1921–1923.

6 భారతీయ మానవశాస్త్రం, వృత్తిశాస్త్రంపై గ్రంథ సూచీలు 1960–1961.

ఇంకా అనేక విషయాలపై ప్రయోజనాత్మక సాహిత్యాన్ని, సాధారణ ప్రచురణ కర్తలు చేయలేని పనిని యీ సంస్థ విజయవంతంగా చేసింది.

*గ్రంథ సూచీ ప్రచురణ*

జాతి జీవనాన్ని ప్రతిబింబించేవి జాతీయ గ్రంథాలయం, జాతీయ గ్రంథ సూచి (నేషనల్ బిబ్లియోగ్రఫి) అని పెద్దలు చెబుతారు. అయితే మనకు జాతీయ గ్రంథ సూచి ఏర్పడటానికి కొంత ఆలస్యం జరిగింది. 1954లో డెలివరీ ఆఫ్ బుక్స్ అండ్ న్యూస్‌పేపర్సు యాక్టు రూపొందించబడ్డాక యీ పనికి నాంది జరిగింది. భారతప్రభుత్వానికి చెందిన యీ చట్టం వలన భారతదేశంలో అచ్చయిన ప్రతి పుస్తకం తాలూకు ఒక ప్రతిని యీ గ్రంథాలయానికి ఉచితంగా పంపవలసి ఉంది. ఈ విధంగా పంపబడిన పుస్తకాలన్నిటినీ యిందుకోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడిన సెంట్రల్ రెఫరెన్స్ లైబ్రరీలో భద్రపరుస్తారు. ఈ విధంగా భద్రపరిచిన వాటినుంచి జాతీయ గ్రంథసూచి తయారు చేస్తారు.

జాతీయ గ్రంథసూచి 1957 అక్టోబరు నుంచి మూడు మాసాల కొకసారి ప్రచురణ ప్రారంభమై 1964 నుంచి ప్రతి మాసం ప్రచురింపబడుతుంది. పిదప సంవత్సరాంతానికి వార్షిక సంచికలుగా రూపొందించబడుతున్నాయి. 1958 నుంచి 1973 వరకు యిప్పటికి 16 వార్షిక సంపుటాలు వెలువడ్డాయి. దీనితోబాటు 1958-62 ఐదు సంవత్సరాలకు ఒక సమీకృత సూచీ వెలువడింది.

ఈ సంపుటాల వెల అధికంగా ఉండటంచేత అన్ని గ్రంథాలయాలు వీటిని సంపాదించడం సులభమైన పనిగాదు. అందుచేత రాష్ట్ర ప్రభుత్వాలు ఆయా భాషలకు సంబంధించిన విభాగాల ప్రచురణను తలపెట్టినవి. ఈ పథకం క్రింద ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం జాతీయ గ్రంథ సూచి తెలుగు విభాగ ప్రచురణను స్వీకరించి 1958 నుంచి 1963 వరకు పూర్తి చేసింది. చివరి సంపుటం 1975లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో విడుదలైంది. మొత్తం మీద జాతీయ స్థాయిలో, రాష్ట్రస్థాయిలో ఎంతో వ్యవప్రయాసలతో జరిగే యీ ప్రచురణ కార్యక్రమం ఎంతో ఆలస్యం కావడంచేత ఆశించిన ప్రయోజనం కలగడంలేదు. జాతీయ జీవనంలో యీ సూచీలు ఒక ప్రభావాన్ని సంపాదించడం లేదు. ఈ విషయాలపై ప్రభుత్వం సత్వరచర్యలు తీసుకోవలసి ఉంది.

మరికొన్ని .... ....

కేంద్ర సాహిత్య అకాడమీ 1901–53 వరకు ప్రచురింపబడిన సాహిత్యానికి సూచీ తయారుచేయ సంకల్పించినపుడు జాతీయ గ్రంథాలయం యీ పథకానికి ఎంతగానో తోడ్పడింది.

—

# కన్నెమరా పౌరగ్రంథాలయం 2

భారత గ్రంథాలయోద్యమ చరిత్రలో అవిభక్త మద్రాసు రాష్ట్రానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. అందు ముఖ్యంగా కన్నెమరా పౌరగ్రంథాలయానికి ప్రత్యేక చరిత్ర ఉంది. దీని చరిత్ర ఒకనాటిది కాదు. నూరు సంవత్సరాల వ్యాప్తి కలది. ఎగ్మూరులోని మద్రాస్ మ్యూజియంలో ఒక చిన్న విభాగంగా ప్రారంభమైన యీ గ్రంథాలయం నేడు అనేక తీరులుగా అభివృద్ధి చెందింది. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంగా, దక్షిణాది రాష్ట్రాలకు జాతీయ గ్రంథాలయంగా, ప్రపంచ విజ్ఞాన పరిషత్తు (యునెస్కో)కు సమాచార కేంద్రంగా పనిజేస్తూంది. జాతి, మత, కుల వివక్షతలేక, భాషాపరిమితులు లేక ఎల్లరకు గ్రంథాలయ సేవ అందజేస్తూ దక్షిణ భారతంలో మణిమకుటంలా ప్రకాశిస్తోంది. అందుచేత ఆ గ్రంథాలయ పుట్టుపూర్వోత్తరాలు, పురోగతి తెలుసుకోవడం అవసరం.

*సంప్రదాయ పరిరక్షణ*

ఆంగ్లేయులకు భారతదేశాన్ని ఆక్రమించడంలో ఏ స్వార్థపరత్వం ఉన్నప్పటికీ యీ దేశంలోని సంప్రదాయాలను నిలబెట్టడంలోనూ, చదువుసాములను అభివృద్ధి చేయడం లోనూ వారికి అభిలాష ఉండేది. మరొకవైపున విదేశీ ప్రభావాన్ని మనపై రుద్దటంలో గూడ వారి అభిమతమై ఉండేది.

దక్షిణాది రాష్ట్రాలలోగల అపూర్వ వస్తుసంచయాన్ని సేకరించి విదేశీ ప్రభుత్వం 18వ శతాబ్ది తొలి భాగంలో మద్రాసు మ్యూజియాన్ని స్థాపించింది. అమరావతిలోని అపూర్వమైన శిల్పాలనేకం యీ చిత్రవస్తుప్రదర్శనశాలలో ముచ్చటగా తీర్చిదిద్దబడినాయి. ఈ సంస్థకు 1859–1872 సం॥లలో కెప్టెన్ జెస్సి మిచెల్ ప్రధాన అధికారిగా ఉండేవారు. మిచెల్ మంచి ఉత్సాహవంతుడేగాక, విద్యావంతుడు, సంస్కారి కూడా. మ్యూజియాన్ని అనేక విధాల అభివృద్ధి చేయదలచి, దానికి అనుబంధంగా ఒక రెఫరెన్స్ గ్రంథాలయం అవసరమని భావించారు.

ఈ విషయాన్ని వివరిస్తూ 1860లో మిచెల్ మద్రాస్ ప్రభుత్వానికి యీ విధంగా వ్రాశారు. "భారతదేశంలో విద్య బాగా అభివృద్ధి చెందుతోంది. యువకులనేకమంది విద్యావంతులౌతున్నారు. వారందరికీ యీ గ్రంథాలయం ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది. పౌరుల ఉపయోగం కోసం ఏటేటా వెచ్చించే కొన్ని వందల రూపాయలు ప్రభుత్వానికి ఎంతో గౌరవప్రతిపత్తులను సమకూర్చి పెడుతుంది." మిచెల్ ప్రతిపాదనలను ప్రభుత్వం పరిశీలించి గ్రంథాలయాన్ని స్థాపించడానికి అనుమతించారు. ఆ విధంగా గ్రంథాలయం స్థాపించబడింది. మిచెల్ అనేక విషయాలపై సమాచార గ్రంథాలను సేకరించారు. 1862లో యీ గ్రంథాలయం పౌరులకోసం తెరువబడింది. ఈ గ్రంథాలయంలో ప్రవేశం మాత్రం ఉచితం. అయితే కొన్ని నియమాలను అనుసరించి కొలదిమందికి

మాత్రం అవకాశం వుండేది. అప్పట్లో పుస్తకాలను అరువుగా ఇండ్లకు యిచ్చే పద్ధతి లేదు. గ్రంథాలను అచట చదువుకో వలసిందే.

## గ్రంథాలయ భవనం

మిచెల్ తర్వాత డాక్టర్ జార్జి బిడీ (1872-1885) మ్యూజియం అధికారిగా నియమితులయ్యారు. డాక్టర్ బిడీకు కూడా గ్రంథాలయమందు అభిమానం కలిగి దానికి ప్రత్యేక మయిన భవనాన్ని 1875లో నిర్మించారు. మద్రాస్ గవర్నర్ డ్యూక్ ఆఫ్ బకింగ్‌హామ్ దీనికి 1876 మార్చి 16వ తేదీన ప్రవేశమహోత్సవం జరిపారు. ఈ భవనానికి చక్కని ఉపన్యాస మందిరం అనుబంధంగా అమర్చబడివుంది. భవనం చక్కగా అలంకరించబడింది. గోడలకు పురావస్తు సంబంధమైన పటాలు అమర్చబడ్డాయి. ఆ భవనంలో గ్రంథాలయం రెండుసంవత్స రాలపాటున్నది. కళలు, సాహిత్యం విజ్ఞానశాస్త్రాలపై వేలాది ప్రామాణిక గ్రంథాలు చేర్చబడ్డాయి. చదువరుల సంఖ్యగూడ క్రమేణ హెచ్చింది. అందుచేత గ్రంథాలయ భవనం చాలీ చాలని స్థితిలో పడింది.

## నూతన భవనం

డాక్టరు బిడే అనంతరం మ్యూజియానికి డాక్టరు ఎడ్గార్ థర్సటన్ (1885-1908) అధికారిగా వచ్చారు. డాక్టర్ థర్సటన్ గ్రంథాలయాభివృద్ధి విషయంలో విశేషమైన శ్రద్ధ తీసుకొని, గ్రంథాలయ భవన నిర్మాణ విషయంలో ప్రభుత్వ

అనుమతి తీసికొన్నారు. దీనికి 1890 మార్చి 22 తేదీన శంకు స్థాపన చేస్తూ మద్రాస్ గవర్నర్ లార్డ్ కన్నెమరా యిలా అన్నారు.

"మద్రాస్ నగరంలో ఉచిత పౌరగ్రంథాలయాన్ని స్థాపించాలనే ఆలోచన నాకు, నా సహచరులకు చాలాకాలం నుంచీ ఉంది. ఈ నగరంలో విద్యావంతులకోసం మంచి గ్రంథాలయం అవసరమని యిదివరకే గుర్తించాము. అలాంటి గ్రంథాలయం విద్యార్థులకు, మిగతా భారతీయులకు వరప్రసాదంలాగ ఉంటుందని నా ఆశయం.... తగిన ఆర్థిక వసతులులేక అనేక మంది విద్యార్థులు పాఠ్యగ్రంథాలుగూడ కొనలేని స్థితిలో, మంచి డిగ్రీలు పొందలేని పరిస్థితిలో ఉన్నారని యిటీవలే విన్నాను. ఈ గ్రంథాలయం సాహిత్యం, విజ్ఞానశాస్త్ర విషయాలలో ఉత్తమ గ్రంథాలను సమీకరించి ఆ కొరతలను తీర్చుతుందని ఆశిస్తాను. దీనితోబాటు పిల్లలు, వృద్ధులు, స్త్రీలు వారి వారి అభిరుచులకు, ఆశయాలకు తగినట్లుగా సాహిత్య సౌరభాలను ఆస్వాదించడానికి వీలుగా ఉంటుందని నా నమ్మకం."

ఇంతటి సదాశయంతో శంకుస్థాపన చేయదలచిన భవనపు నమూనాను మద్రాసు ప్రభుత్వానికి వాస్తు శాస్త్ర సలహాదారుడుగా నున్న హెచ్. ఇర్విన్ దీనిని ఆంగ్లో-ఇటాలియన్ పద్ధతిలో రూపొందించారు. సువిశాలమైన ఈ భవన నిర్మాణానికి ఆరు సంవత్సరాల కాలం పట్టింది. ఆ రోజుల్లోనే ఆరు లక్షల రూపాయలదాకా వ్యయమైంది. దీర్ఘవృత్తాకారం

(సెమి సర్క్యులర్) గల యీ భవనం గ్రంథాలయానికి అను వైన రీతిలో నిర్మించబడింది. విశాలమైన పెద్ద హాలు, దానికి యిరువైపుల బీరువాలు, అందంగా మలచబడిన సీలింగ్ చక్కగా తొలచబడి, అందంగా తయారు చేయబడ్డాయి. స్తంభాలు, కిటికీలు, బీరువాలు ఎంతో పనితనంతో, అందాలు చిందేటట్లు నిర్మించబడ్డాయి. భవనపు అంతర్భాగంలోని హస్తకళా నైపుణ్యం భారతీయ ప్రతిభకు హారాయలు పలుకుతూ ఉంటుంది. నేలకు ఉపయోగించబడిన పాలరాయి కృష్ణా జిల్లా నుండి బకింగ్‌హామ్ కాలువగుండా పడవలలో తెప్పించబడింది. ఈ విధంగా యీ గ్రంథాలయం సుందర మందిరంగా వీనుల విందుగా రూపొందించబడింది.

*ప్రారంభోత్సవం*

ఈ నూతన భవనంలోని మ్యూజియపు గ్రంథాలయం తరలించబడి 1898 ఏప్రిల్ 14వ తేదీన పౌరులకోసం తెరువబడింది. అయితే సాంప్రదాయసిద్ధమైన ఉత్సవం 1896 డిశంబరు 5వ తేదీన జరిగినప్పుడు, నాటి సభలో మద్రాస్ గవర్నర్ సర్ అర్థర్ ఎలిబాంక్ హావలాక్ ప్రసంగిస్తూ మ్యూజియపు గ్రంథాలయానికి యీ భవనంలో కొద్దిపాటి స్థలం సరిపోతుందనీ, మిగతా స్థలాన్ని సాహిత్య ప్రచారం, విజ్ఞానాభివృద్ధి ఆశయాలుగల సంస్థలు ఉపయోగించుకొనవచ్చని ప్రకటించారు. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని మద్రాస్ లిటరరీ సొసయిటీ గ్రంథాలయాన్ని నుంగంబాకం, కాలేజిరోడ్ లోని ప్రస్తుత భవనానికి 1905లో తరలించే వరకు మ్యూజియపు

గ్రంథాలయంలోనే ఉంది. ఆ తర్వాత సొసైటీ గ్రంథాలయం ఖాళీచేసిన భాగంలో మద్రాస్ విశ్వవిద్యాలయ గ్రంథాలయం ఏర్పరచబడి చేపాక్‌లో యూనివర్సిటీ నూతన భవనాలు నిర్మించే వరకు అనగా 1928 వరకు అచటే ఉంది. ఈ విధంగా మ్యూజియం గ్రంథాలయం తన గ్రంథ సంచయం పెరిగేలోగా యితర గ్రంథాలయాలకు ఆశ్రయం యిచ్చింది.

### పేర్లలో మార్పులు

ఇంతకు ముందే వివరించినట్లు యీ గ్రంథాలయం 1860లో మద్రాస్ మ్యూజియపు గ్రంథాలయంగా ప్రారంభించబడింది. ఆ తర్వాత మద్రాస్ గవర్నరుగా పనిజేసిన లార్డ్ కన్నెమరా సేవలను గుర్తించేందుకు ఆ గ్రంథాలయం 1894-95 కాలంలో కన్నెమరా ఉచిత గ్రంథాలయంగా పిలువబడింది. పిదప 1896 నుంచీ కన్నెమరా పేర గ్రంథాలయంగా మార్చబడింది. ఇదే పేరు నేటికీ అమలులో ఉంది.

### గ్రంథ పాలకులు

ఈ గ్రంథాలయం ప్రారంభించినప్పటినుంచీ మ్యూజియం అధికారి, ఉద్యోగరీత్యా (ఎక్స్ అఫీషియో) యీ గ్రంథాలయానికి ప్రధాన గ్రంథపాలకుడుగా ఉండే ఆనవాయితీ ఉన్నది. డాక్టర్ థర్స్టన్ అనంతరం, డాక్టర్ టి ఆర్ హెన్డర్సన్, డాక్టర్ యఫ్ హెచ్ గ్రావ్లె మొదలైన వారు మ్యూజియం అధికారులుగా వచ్చారు. డాక్టర్ గ్రావ్లె కాలంలో గ్రంథాలయం అనేక విధాల వృద్ధయింది. గ్రంథాలయ శాస్త్రంలో ప్రత్యేక శిక్షణ పొందిన ఆర్ జనార్దనం నాయుడు

గారు 1929లో గ్రంథ పాలకుడుగా నియమించబడ్డారు. జనార్దనం నాయుడుగారు మద్రాస్ ప్రభుత్వంచే నియమించబడిన తొలి పూర్తికాలపు గ్రంథపాలకుడు. జనార్దనం నాయుడు గారు యీ గ్రంథాలయాన్ని సాంకేతికంగా బాగా అభివృద్ధి చేశారు. 1934 సం॥లో గ్రంథాలయ శాస్త్రంలో ఉన్నత విద్యాభ్యాసం నిమిత్తం ఇంగ్లండ్ వెళ్ళి, మరుపటి సం॥లో తిరిగివచ్చి యీ గ్రంథాలయాభివృద్ధి విషయంలో మొనలేని కృషిచేశారు.

మ్యూజియం నుండి గ్రంథాలయాన్ని వేరుచేసినట్లయితే దానిని మరింత ప్రగతి పథంలోకి తీసుకొనిపోవడానికి వీలుంటుందని తొలిసారిగా డాక్టరు గ్రాన్లై భావించారు. ఈ విషయంలో ప్రభుత్వ అంగీకారం తీసుకొని 1939లో యీ రెంటినీ వేరుచేసి, తాను 1940లో పదవినుంచి విరమించి, విశ్రాంతి తీసుకొన్నారు.

క్రమాభివృద్ధి

ఈ గ్రంథాలయం ప్రారంభించిన నాటినుండి అధికార, అనధికార ప్రముఖులనుండి దీనికి ఇతోధికమైన ప్రోత్సాహం ఊహించిన ప్రమాణాలలో లభిస్తూనే ఉంది. మిషెల్ అధికారిగా ఉన్న రోజులలో యీ గ్రంథాలయాన్ని తక్కువ డబ్బుతో హెచ్చు పుస్తకాలు కొనేందుకు వీలుగా అనేక పాతపుస్తకాలన్నీ యిందు చేర్చారు. 1894–95లో మద్రాస్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఉత్తర్వు ప్రకారం సచివాలయంలోని అనేక గ్రంథాలు యిచటికి తరలించబడ్డాయి. ఆ తర్వాత

యోజీట ప్రత్యేక నిధులు కేటాయించబడి అనేక విషయాల పైన, ముఖ్యంగా దక్షిణాది భాషలలో ఉత్తమ గ్రంథాలు సేకరించబడ్డాయి.

*గ్రంథాలయ చట్టం*

మద్రాస్ పౌరగ్రంథాలయముల చట్టం 1948లో శాసన సభలో ఆమోదించబడి 1959 నుంచీ అమలులోకి వచ్చింది. ఈ చట్టంప్రకారం విద్యాశాఖ డైరెక్టరు ఉద్యోగరీత్యా గ్రంథాలయ శాఖకుకూడ డైరెక్టరుగా ఉంటారు. రాష్ట్రంలోని జిల్లాలన్నిటిలో స్థానిక గ్రంథాలయ సంస్థలేర్పడి వాటి ద్వారా గ్రంథాలయసేవ జరుగుతూ ఉంటుంది. కన్నెమరా పౌర గ్రంథాలయం రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంగా ప్రకటింపబడింది. పుస్తకాల రిజిస్ట్రేషన్ చట్టం ప్రకారం రాష్ట్రంలో అచ్చయిన ప్రతి పుస్తకం తాలూకు నాలుగు ప్రతులు ఉచితంగా యీ గ్రంథాలయానికి వచ్చే అవకాశం కల్పించబడింది.

జనార్దనం నాయుడుగారు 1948 సం॥లో ఇంగ్లండ్‌లో జరిగిన అంతర్జాతీయ గ్రంథాలయ సంఘాల సమాఖ్య మహాసభకు హాజరయి, కొన్ని గ్రంథాలయాలను సందర్శించి వచ్చిన పిదప పౌరగ్రంథాలయశాఖకు స్పెషల్ ఆఫీసరుగా నియమింపబడ్డారు. వారే కన్నెమరా పౌరగ్రంథాలయానికి గ్రంథపాలకుడుగాకూడ పనిజేసారు. 1939 నుంచీ సరాసరి మద్రాస్ ప్రభుత్వం ఆధ్వర్యంలోని యీ గ్రంథాలయం 1959 నుంచీ పౌరగ్రంథాలయశాఖడైరెక్టరు ఆధీనంలోకి వచ్చింది. జనార్దనం నాయుడుగారు కొంతకాలంపాటు స్పెషల్ ఆఫీసరు

గానూ, గ్రంథాలయ పాలకుడుగాను పనిజేసి పదవీ విరమణ చేశాక ఆస్థానంలో కె గోవిందమీనన్‌గారు నియమితు లయ్యారు. అయితే మీనన్‌గారిని కేవలం గ్రంథపాలకుడుగా ఉంచి స్పెషల్ ఆఫీసరు పదవిలో యల్ బుల్లయ్యగారిని (ఆం. ప్ర. విద్యాశాఖ మాజీ డైరెక్టరు) నియమించారు. వారి అనంతరం ఆ పదవిని కె రాఘవరెడ్డిగారు (ఆం. ప్ర. పౌర గ్రంథాలయశాఖ మాజీ డైరెక్టరు) స్వీకరించారు. ఈ మార్పు లన్నీ జరుగుతున్న కాలంలో లక్షలాది ధనవ్యయంతోనూ, ఉచితంగానూ వేలాది అపూర్వ గ్రంథాలు సంతరించబడ్డాయి. ముగ్గురు సిబ్బందితో ప్రారంభమైన యీ సంస్థలో సిబ్బంది 30 మందికి పెంచబడ్డారు.

పుస్తకాల చట్టం

ఇంతలో 1954లో భారతప్రభుత్వంవారి పౌరగ్రంథా లయాలకు పుస్తకాలనుపంపు చట్టాన్ని తయారు చేసింది. ఈ చట్టం ప్రకారం భారతదేశంలో అచ్చయిన ప్రతి పుస్తకాన్ని, ఆ ప్రచురణకర్త ఉచితంగా కన్నెమరా పౌరగ్రంథాలయంతో సహా 3 గ్రంథాలయాలకు పంపవలసి యుంటుందని శాసించింది. ఈ విధంగా ఏటేటా వేలాది పుస్తకాలు సునాయాసంగా యీ గ్రంథాలయానికి రాసాగినవి. పైగా దీనిని జాతీయ ప్రతిపత్తి గల పౌరగ్రంథాలయంగా నిర్ణయించడంతో దీని స్థాయి మరింత యినుమడించింది.

యునెస్కో సహకారం

1955లో కన్నెమరా పౌరగ్రంథాలయం ప్రపంచ విజ్ఞాన పరిషత్తు (యునెస్కో) వారి గ్రంథాలయ సహాయ

పథకం క్రింద తీసుకోబడింది. అందువలన ఐక్యరాజ్య సమితి (యు యన్ ఓ) ప్రచురణలు, దాని అనుబంధ సంస్థల ప్రచురణలు ఉచితంగా లభిస్తాయి. అంతేగాక యీ గ్రంథాలయం 1965 సెప్టెంబరు 15 నుండి యునెస్కో సమాచార కేంద్రంగా కూడ పనిచేస్తుంది. ఈ తీరుగా యీ గ్రంథాలయానికి దేశీయ విదేశీయ సంస్థల సహకారం నిరవధికంగా లభించింది.

రావుబహదూర్ ఆర్కాట్ ధనకోటి ముదలియార్ కళలపై గ్రంథాలు కొనడానికి విక్టోరియా మెమోరియల్‌కు రు 20,000 విరాళం యివ్వగా, ఆ డబ్బుతో కొన్న పుస్తకాలన్నీ యీ గ్రంథాలయంలోనే భద్రపరచబడ్డాయి. ఇంకా అనేక విధాల యీ గ్రంథాలయానికి పుస్తకాలు వేలసంఖ్యలో వచ్చిపడ్డాయి.

స్థల విస్తరణ

ఈ తీరుగా అనేకరకాలుగా పెరుగుతున్న గ్రంథ సంపదను భద్రపరచే నిమిత్తం గ్రంథాలయములో కొన్ని మార్పులను జేయవలసివచ్చినది. చక్కబీరువాలకు బదులు హెచ్చు పుస్తకాలు నిలువజేయగల ఉక్కు బీరువాలు ముప్పయివేల రూపాయిల ఖర్చుతో అమర్చబడినాయి. హెచ్చు మంది చదువరులు ఉపయోగించుకోడానికి వీలుగా లక్ష, 30 వేల ఖర్చులో టేకుచక్కతో మంచెలాగ ఒక అంతస్థు లోన నిర్మించబడింది. స్థలం కలిసి రావడానికి ఉత్తరభాగాన్ని ఆక్రమించిన కారన్ వాలిస్ విగ్రహాన్ని ఫోర్ట్ మ్యూజియానికి తరలించి, ఆస్థానంలో దేవీప్రసాద్ రాయ్ చౌదరి నిర్మించిన గాంధీజీ ప్రతి

మను అలంకరించాయి. ఈ మార్పులన్నీ 1950లో జనార్దనం నాయుడుగారి సూచనలమేరకు జరిగాయి.

*వర్గీకరణ*

దురదృష్టవశాత్తు యీ గ్రంథాలయానికి నాటినుండి ఇటీవలివరకు ఒక శాస్త్రీయమైన వర్గీకరణ విధానం అంటూ లేదు. కొంత కాలంపాటు పుస్తకాలన్నీ గ్రంథకర్తలవారీగా అమర్చబడేవి. 1928 తర్వాత విజ్ఞానమంతా యీ దిగువ 33 విషయాలుగా విభజింపబడింది. సాధారణ గ్రంథాలు, సాధారణ విజ్ఞానం, గణితశాస్త్రం, నక్షత్రశాస్త్రం, వాతావరణ శాస్త్రం, పరిపాలన నిర్మాణశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం, ఖనిజశాస్త్రం, భూగర్భశాస్త్రం, ప్రకృతి శాస్త్రం, వృక్షశాస్త్రం, వ్యవసాయం, జంతుశాస్త్రం, వైద్యం, మందుల తయారీ, పురాతత్వశాస్త్రం, సామాజిక శాస్త్రం, రాజనీతి శాస్త్రం, చట్టాలు, విద్య, సాహిత్యం, చరిత్ర, భూగోళం, వినోదాలు, లలితకళలు, సాంకేతిక విజ్ఞానం, చిత్రవస్తుప్రదర్శన శాస్త్రం, గ్రంథాలయ శాస్త్రం, గ్రంథశాస్త్రం, జీవిత చరిత్రలు, అర్థశాస్త్రం, ఈ విషయాల ప్రకారం వర్గీకరింపబడేవి. ఇటీవలే గ్రంథపాలకులు కన్నె తెరచి ద్విబిందు వర్గీకరణ విధానాన్ని అనుసరించే పుస్తకాలను వర్గీకరిస్తున్నారు.

*సూచీకరణ*

ఎన్ని ఉత్తమ గ్రంథాలు సేకరించినా, ఎంతటి మంచి భవనం ఉన్నా, వర్గీకరణ సూచీకరణ విధానాలలో యీ గ్రంథాలయం కొంత వెనుకబడి ఉంది. గ్రంథకర్తల ప్రకారం

బీరువాలలో పుస్తకాలను అమర్చినపుడు, సూచీనిగూడా అదే విధంగా తయారుచేసి తొలిసారిగా మొదటి సంపుటాన్ని 1908లో ముద్రించారు. 1912 మార్చికి దీనికి 4 అనుబంధాలు వచ్చాయి. మరల 1931లో రెండు సంపుటాలలో పూర్తి సూచీ ముద్రించబడింది. దీని వెల రూపాయి మాత్రమే. దీనికి 1935లో మొదటి అనుబంధం ప్రచురింపబడింది. ఇదే విధంగా 1935లో పత్రికల సూచీకూడా తయారయింది. దీని వెల ఎనిమిది అణాలు (యాభై పైసలు) మాత్రమే. సహజంగా ముద్రణలో ఉండే యిబ్బందులచేతగాని, పుస్తకాల రాకడ హెచ్చు కావడం చేతగాని ఆ తర్వాత సూచీలను ముద్రించే అవకాశం కలుగలేదు. ఇంతకుముందు వివరించిన 33 విషయాల ప్రకారం పుస్తకాలను వర్గీకరించిన పిదప, అప్పటికి కార్డుసూచీ అవసరాన్ని గమనించి వర్గీకృత పద్ధతిలో కార్డుసూచీని తయారు చేశారు. ఇదే సూచి యిప్పటికీ ఉపయోగంలో ఉంది.

*గ్రంథాలయ సేవ*

ఈ గ్రంథాలయంలో నేడు రెండు లక్షల పుస్తకాలున్నవి. నాలుగు వందలకు పైగా పత్రికలు, దినపత్రికలు తెప్పించబడుచున్నవి. రోజుకు ఆరువందలకుపైగా చదువరులు వస్తున్నారు. ఈ గ్రంథాలయం ప్రధానంగా ఆచూకి సేవ నిమిత్తం ప్రారంభించబడింది. అందుచేత చాలాకాలం వరకు యిందులోని గ్రంథాలు అరువుగా యిండ్లకు యివ్వడంలేదు. 1931లో తొలిసారిగా అరువిచ్చే విధానం ప్రారంభించబడి తగినంతమంది సిబ్బంది, ప్రోత్సాహం లేకపోవడం వలన ఆ

మరుసటి సంవత్సరమే ఆ విధానానికి స్వస్తి చెప్పబడింది. మరల 1962 జూన్ 16వ తేదీన అరువిచ్చు విధానం ప్రారంభించబడి నేటికి కొనసాగుతుంది. నేడు పుస్తకాలను అరువుగా యిండ్లకు తీసుకొనివెళ్ళే సభ్యులు 700 పై చిలుకున్నారు. రోజుకు 500 గ్రంథాలదాకా అరువివ్వబడుతున్నాయి. ప్రతి రోజు గ్రంథాలయం ఉదయం గం 8-00 నుండి సాయంత్రం గం 5-30 వరకు పనిజేస్తుంది. శుక్రవారాలు, మరి తొమ్మిది సెలవు దినాలు తప్ప గ్రంథాలయం సం లో 304 రోజులు తెరచిఉంటుంది. గ్రంథాలయోద్యమమందు అభిలాష, గ్రంథాలయ శాస్త్రమందు విశేష పరిచయం, ఉత్సాహం గల వితిలై నాయగంగారు ఇటీవలి వరకు గ్రంథపాలకులుగా ఉన్నారు వారు గ్రంథాలయాభివృద్ధి నిమిత్తం ప్రభుత్వాలకి అనేక సూచనలు చేశారు. వాటన్నిటినీ ప్రభుత్వం సానుభూతితో పరిశీలించి అమలుపరచడానికి అనుమతించినపుడు మరింత హెచ్చుగా ప్రజానీకానికి గ్రంథాలయసేవ చేయడానికి వీలుంటుందనడంలో ఆశ్చర్యం లేదు.

*గ్రంథాలయ శిక్షణాలయం*

ఇంతకాలంగా గ్రంథాలయశాస్త్రి శిక్షణ ఇంగ్లీషు భాషలో విశ్వవిద్యాలయ పరంగా ఉంటూ వచ్చింది. సాధారణ విద్యాస్థాయి గలిగి చిన్నచిన్న గ్రంథాలయాలలో పని జేసే కార్యకర్తలకు మాతృభాషలో బోధించిన మరింత ప్రయోజనకరంగా ఉంటుందని భావించి యిందుకోసం తిలై నాయగంగారు విశేషమైన కృషిచేసి, కన్నెమరా గ్రంథాలయ పరంగా తమిళంలో బోధనాభాషగా గ్రంథాలయశాస్త్రింలో

సర్టిఫికెట్ కోర్సులో శిక్షణ యిచ్చే నిమిత్తం గ్రంథాలయ శిక్షణాలయాన్ని ప్రత్యేకంగా స్థాపించారు. 1966 నుండి ఏటేటా నూరుమంది కార్యకర్తలు యిందు శిక్షణ పొందుతున్నారు.

రాష్ట్రీయ గ్రంథసూచి

సాధారణ కార్యక్రమంతోబాటు యీ గ్రంథాలయం తరఫున 1964 జులై నుంచి మద్రాస్ రాష్ట్రీయ గ్రంథసూచి తయారవుతూ ఉంది. దీనితోబాటు తమిళ బాలసాహిత్య సూచి 1963 నుంచి ప్రచురింపబడుతున్నవి. అందుచేత రాష్ట్రం లోని యితర గ్రంథాలయాలకు సూచీకరణ, వర్గీకరణ, పుస్తకాల ఎన్నిక, ఆచూకీ సేవలలో యీ సూచలు ఎంతో ఉపయోగించగల వనడంలో సందేహం లేదు.

గత నూరు సంవత్సరాల కాలంలో యీ గ్రంథాలయం అనేక పరిణామాలనుపొంది నేడు ఒక పరిణతికి వచ్చింది. అపూర్వమైన గ్రంథ సంపద, అపారమైన ప్రభుత్వాదరణ, ప్రజల అండదండలు దీనికున్నవి. అందుచేతనే ఈ గ్రంథాలయం దక్షిణ భారతంలో గ్రంథాలయాలలో తలమానికంగా విరాజిల్లుతోంది.

ఏమైనప్పటికీ ఈ గ్రంథాలయంకోసం వెచ్చించిన ప్రతి పైసాలో కొంతభాగం ఆంధ్రుల వాటాఉండనీ, అది మనకు దక్కాలనీ ఆంధ్రరాష్ట్రం ఏర్పడిననాటినుండి 'వావిలాల గోపాలకృష్ణయ్య ప్రభృతులు ఆందోళన చేస్తూనే ఉన్నారు. కాని న్యాయమైన వారి కోరిక స్వతంత్రభారతంలో అరణ్యరోదనగానే నిలిచిపోయింది!

# బొంబాయి కేంద్ర గ్రంథాలయం
# 3

జాతీయస్థాయిలో భారత ప్రభుత్వంచేత గుర్తించబడిన మూడవ గ్రంథాలయం బొంబాయిలోని ఏషియాటిక్ సొసైటీ ఆధ్వర్యంలోని కేంద్ర గ్రంథాలయం. దాదాపు నూటడెబ్బయి సంవత్సరాలనుంచి యీ గ్రంథాలయం పఠనకు, పరిశోధనకు నిలయంగా ఎల్లరకు ఉపయోగపడుతుంది. అపూర్వమైన గ్రంథ సంపద, అపురూపమైన పత్రికా సంపుటాలు, వ్రాతప్రతులు యీ గ్రంథాలయానికి ఎనలేని సంపదలు. కనుకనే యింతకు ముందు వివరించిన రెండు ప్రసిద్ధ గ్రంథాలయాలకు తగ్గని చరిత్ర యీ గ్రంథాలయానికి లేక పోలేదు.

గత శతాబ్ద ప్రారంభంలో బొంబాయి, మద్రాస్, కలకత్తా మొదలైన మహానగరాలలోని పెద్ద ఉద్యోగులు ప్రధానంగా ఆంగ్లేయులు చదువుసాములందు వారికి అభిరుచి ఎక్కువగా ఉండటంచేత తమ సమయం సద్వినియోగం చేయడం కోసం, విజ్ఞానాన్ని అభివృద్ధి పరచడం కోసం కొన్ని సంస్థలను స్థాపించారు. వాటిని యితోధికంగా ప్రోత్సహించారు. అలాటి సంస్థలో బొంబాయిలోని కేంద్రగ్రంథాలయం ఎన్నదగింది.

బొంబాయి మహానగరంలోని కొందరు బ్రిటీషువారు 1804 సం నవంబరు 26 తేదీన సమావేశమై "భారతదేశానికి సంబంధించిన విజ్ఞానాన్ని పెంపొందించే ఉద్దేశంతో బొంబాయి

లిటరరీ సొసైటీ అనే పేరుతో ఒక సంస్థను ప్రారంభించారు. ప్రారంభంలోనే 17 మంది ఆంగ్లేయులు చరిత్ర పరిశోధన యందూ, సంస్కృతి పరిరక్షణయందు అపారమైన అభిరుచి, ఆదరంగల దిగ్దంతులు. అందుచేత యీ సొసైటీ చిత్రవస్తు ప్రదర్శనశాల (మ్యూజియం), వేధశాల (అబ్జర్వేటరీ), గ్రంథాలయం మొదలైన మూడు విభాగాలను ఎంతో సమర్థతతో నిర్వహించి అందరి ప్రశంసలను అందుకొన్నారు. అందుకు ప్రధానంగా తొలిసారిగా అధ్యక్షులైన సర్ జేమ్సు మెకిన్ తోష్, కార్యదర్శి విలియం ఎర్స్కిన్ ముఖ్యకారకులు. ఆ తర్వాత యీ సంస్థకు అధిపతులైన పెద్దలందరు అశేష శేముషీ ధురంధరులు కావడంతో యీ సంఘం యింతగా వన్నె కెక్కినది.

## గ్రంధాలయం

సొసైటీ ప్రారంభించిన నాటినుంచే ఆంగ్లేయ ఉద్యోగులనుంచి పుస్తకాలు సేకరించి గ్రంథాలయంగా ఏర్పరచారు. సభ్యత్వ రుసుంతో ఇంగ్లండ్ నుంచి క్రొత్త పుస్తకాలను తెప్పించారు. మరికొన్ని పత్రికలకు చందాలు చెల్లించారు. సొసైటీ నాలుగవ సమావేశం 1805లో జరిగింది. అందు 1789 సం లోనే స్థాపించబడిన బొంబాయిలోని మెడికల్ లిటరరీ గ్రంథాలయాన్ని రు 6575 లకు కొనుగోలు చేయడానికి నిశ్చయించారు.

ఆ పని కార్యరూపంలోకి వచ్చాక సొసైటీ గ్రంథాలయానికి ఒక నిండుతనం వచ్చింది. గ్రంథాలన్నిటినీ ఒక

క్రమంలో ఏర్పాటు చేశాక 1812 సం లో పుస్తకాలను అరువుగా యివ్వడం ప్రారంభించారు. ఇందును కొన్ని నిబంధనలు ఏర్పరచారు. సభ్యులెవరైనా పుస్తకాలను ఉచితంగా చదువుకోవచ్చు, ధరావత్తు లేదు. ఐతే ఒకసారి పుస్తకాన్ని సరిగా తిరిగి యివ్వకపోతే వందరూపాయలు ధరావత్తు చెల్లించవలసి ఉంటుంది. ఆ ధరావతు ఆ ఉద్యోగికి యూరపు వెళ్లేటప్పుడు మాత్రమే వాపస్ చేయబడుతుంది. ఈ నిబంధన కొందరికి బాధకలిగించినా పుస్తకాల భద్రతకు తోడ్పడింది.

భ వ న ం

తొలి అధ్యక్షులుగా ఉన్న మెకిన్‌తోష్ గ్రంథాలయ భవనం విషయంలో బాగా కృషిచేశారు. ప్రభుత్వం నుంచి విరాళంగాను, లాటరీల ద్వారాను, చందాల రూపంలోను దాదాపు ఆరులక్షలకు పైగా ధనం ఆ రోజులలో సంపాదించి పౌరుల ఉపయోగం కోసం టౌన్‌హాల్ భవనానికి పునాదులు వేశాడు. మెకిన్ తోష్ రిటైరయ్యాక కొంతకాలానికి ఆ బ్రహ్మాండమైనభవనం, రాజప్రాసాదాలను మరపించే అపూర్వమైన కట్టడంగా తయారైంది. ఆ తర్వాత అందుకొన్ని గదులను గ్రంథాలయ విభాగానికి కేటాయించారు. అదే భవనం నాటినుంచి నేటివరకు యీ గ్రంథాలయానికిస్థావరంగాఉంది.

పేరులో మార్పు

ఇంగ్లండు నుంచి కొత్తగా వచ్చిన సర్ జాన్ మాల్కమ్ యీ సొసైటీలో ప్రసంగిస్తూ ప్రపంచ ప్రఖ్యాతమైన రాయల్ ఏషియాటిక్ సొసైటీకి శాఖగా అనుబంధించ

మని సూచించారు. ఈ సొసైటీ ప్రధానకార్యస్థానం గ్రేట్ బ్రిటన్‌లో ఉంది. 1827లో చేయబడిన యీ సూచనను అందరూ అంగీకరించారు. అప్పటినుంచి బొంబాయి లిటరరీ సొసైటీ, గ్రేట్ బ్రిటన్ రాయల్ ఏషియాటిక్ సొసైటీకి బొంబాయి శాఖగా మార్పు చెందినది. ఇందువలన యీ సొసైటీకి నైతికంగా మంచి బలం చేకూరడమే గాక, దీని తరఫున జరిగే పరిశోధనకు, యితర కార్యక్రమాలకు మంచి గుర్తింపు వచ్చింది.

*గ్రంథాల ప్రదానం*

పై హంగులన్నీ ఏర్పడ్డాక యీ గ్రంథాలయానికి మంచి ఆదరం లభించింది. దేశీయ, విదేశీయ ఉద్యోగులు దీనిని బాగా ప్రోత్సహించారు. ఈ గ్రంథాలయానికి తొలిసారిగా బొంబాయికి గవర్నర్‌గా పనిచేసిన గౌరవనీయులైన మౌంట్ స్టువర్ట్ అపూర్వ గ్రంథసంకలనాన్ని ప్రదానం చేశాడు. ఈ సంకలనంలో 14వ శతాబ్దినాటిదని చెప్పబడుతోన్న డాంటే రచన డివైన్ కామిడీ మౌలిక వ్రాతప్రతి ఉండటం ఒక విశేషం. దీని ఖరీదు ఇప్పుడు ఇటలీలో అయితే పదివేలపౌన్లు (షుమారు రెండులక్షల రూపాయలు) ఉంటుందట! 1934లో బొర్రాడేల్ అనే ఆంగ్లేయుడు మరికొన్ని వ్రాతప్రతులను ప్రదానం చేశాడు. పిదప భగవాన్‌లాల్ ఇన్ద్రజీ, డాక్టరు భౌదాజీ, శంకర్ పి పండిట్ మొదలైన దేశీయులు సేకరించిన అపూర్వమైన వ్రాత ప్రతులు యీ గ్రంథాలయానికి యివ్వబడినవి. డాక్టరు మాల్కంసన్, డాక్టర్ జె జె మోడి,

ప్రేమ్‌చంద్ రాయ్ చంద్, సర్ దొరాబ్ తాతా, జి కె నారాయణ్, యస్ వి భండార్కర్ మొదలైన వారి విరాళాల వలన లక్ష గ్రంథాలవరకు కొనబడినవి. మొత్తం మీద ఏవిధంగానైతేమి 1940 నాటికి యీ గ్రంథాలయంలో 2 లక్షల వరకు అపూర్వమైన గ్రంథాలు సేకరించబడ్డాయి.

*ఇతర గ్రంథాల విలీనం*

రాయల్ ఏషి యాటిక్ సొసైటీగా మార్చబడిన పిదప మరికొంత అదృష్టం కలసివచ్చింది. ఈ దిగువ సంస్థలతాలూకు అపురూపమైన 3000 గ్రంథాలు సొసైటీ గ్రంథాలయంలో చేరాయి. ఈ సంస్థలన్నీ రాయల్ ఏషియాటిక్ సొసైటీలో విలీనం చేయబడ్డాయి.

| | | |
|---|---|---|
| అగ్రిహార్టికల్చరర్ సొసైటీ | స్థాపన | 1830 |
| జియోగ్రాఫికల్ సొసైటీ | ,, | 1831 |
| మెడికల్ ఫిజికల్ సొసైటీ | ,, | 1865 |
| లిటరరీ అండ్ సైంటిఫిక్ సొసైటీ | ,, | 1848 |

ఈ సంస్థల తాలూకు గ్రంథాలన్నీ కలసిపోయి సొసైటీ గ్రంథసంపదకు తుష్టిని పుష్టిని యిచ్చాయి.

*వర్గీకరణ - సూచీకరణ*

తొలిదశలో యీ గ్రంథాలయానికి పుస్తకాలను ప్రోగుచేయడమందే ఆసక్తి చూపారుగాని వాటిని వర్గీకరించి సూచీకరించే విషయం పట్టించుకోలేదు. పైగా పుస్తకాలసంఖ్య

తక్కువగా ఉండటం వలన ఈ అవసరం అంతగా కన్పించ లేదు. ఐతే 1844 నాటికి పుస్తకాలసంఖ్య 19000 లకు పెరిగింది! అప్పటికి సూచీకరణ అవసరం ఎంతో కనబడింది. కాని ఆ నాటికి సూచీకరణ నిబంధనలు, వర్గీకరణ విధానాలు లేవు. అందుచేత పాలకవర్గంలోని సభ్యులే యీ అమరికలో కొన్ని నియమాలు ఏర్పరచి సూచీకరణ, వర్గీకరణ కార్యక్రమాన్ని పూర్తి చేశారు. గ్రంథాలయ సూచీని ముద్రించారు. ఏటేటా దీనికి అనుబంధాలు వేస్తూ వచ్చారు. 1923లో గ్రంథాలన్ని దశాంశ వర్గీకరణ విధానంలో వర్గీకరించబడి మరింత క్రమ బద్ధంగా అమర్చబడ్డాయి. ఆతర్వాత 1926–30 మధ్యకాలంలో ఆచార్య హెచ్ డి వేలంకార్ గారి సహకారంతో వివరణా త్మక గ్రంథాలయసూచీని నాలుగు సంపుటాలలో ముద్రించారు. అందువలన ముఖ్యంగా పరిశోధకులకు మరింత ప్రయోజనం సమకూరింది.

## ఫైజీకమిటీ

రాష్ట్రవ్యాప్తంగా గ్రంథాలయ సేవను అందించే నిమిత్తం బొంబాయి ప్రభుత్వం 1939–40లో ఏ ఏ ఏ ఫైజీగారి అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించింది. భారత గ్రంథాలయ చరిత్రలో యీ కమిటీకి ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. పరిస్థితులన్నిటినీ, సాకల్యంగా పరిశీలించాక యీ కమిటీ రాష్ట్రంలో ఒక కేంద్రగ్రంథాలయం, 3 ప్రాంతీయ గ్రంథాలయాలు, 15 జిల్లా గ్రంథాలయాలు (అప్పటి జిల్లాలను అనుసరించి) 467 తాలూకా గ్రంథాలయాలు, 100 పట్టణ

గ్రంథాలయాలు, సుమారు 20 వేలు గ్రామగ్రంథాలయాలు కావాలని సూచించింది. ఈ పని 6 దశల ప్రకారం జరగాలని భావించారు. ఈ సిఫారసులకు ప్రభుత్వం ఆమోదించాక ఏషియాటిక్ సొసైటీ గ్రంథాలయాన్ని కేంద్రగ్రంథాలయంగా గుర్తించడానికి అనుమతిని కోరింది. సొసైటీ వ్యక్తిత్వానికి, ప్రతిష్టకు ఏమాత్రం భంగం లేనంతవరకు యీ 'ఆఫర్'కు ఆమోదం తెలిపింది. తత్ఫలితంగా 1947 జూన్ 26వ తేదీన బొంబాయి ప్రభుత్వ ముఖ్యమంత్రి బి జి ఖేర్ గారు కేంద్ర గ్రంథాలయంగా దీనిని ప్రారంభం చేశారు. ఆనాటినుంచి దీనిని మరింత హెచ్చుగా అభివృద్ధి చేయటానికి అవకాశంకలిగింది.

### కాపీరైట్ గ్రంథాలు

ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ చట్టం (1867) క్రింద వచ్చిన గ్రంథాలన్నిటినీ ప్రభుత్వం భద్రపరచవలసియుంది. ఈ కార్య క్రమాన్ని బొంబాయి ప్రభుత్వం కేంద్రగ్రంథాలయానికి అప్ప గించింది. అంతేగాక యీ చట్టం క్రింద ప్రభుత్వానికి 1945–1967 వరకు చేరిన గుజరాతీ, కన్నడ, మరాఠీ భాషల లోని 30,000 పుస్తకాలను యీ గ్రంథాలయానికి అప్పగిం చింది. ఈ విభాగానికి ఏటా 6, 7 వేలకు తగ్గకుండా పుస్తకాలు వస్తున్నాయి. మొత్తంమీద యీ విభాగంలో యిప్పటికి లక్ష, 30 వేలు పుస్తకాలవరకు ఉన్నాయి. చదువరులకు ఉప యోగపడుతున్నాయి.

### పుస్తకాల చట్టం

డెలివరీ ఆఫ్ బుక్స్ అండ్ న్యూస్ పేపర్సు చట్టాన్ని (1954) అనుసరించి యీ కేంద్ర గ్రంథాలయం జాతీయ

స్థాయిలోగల గ్రంథాలయంగా గుర్తించబడింది. అందువలన దేశంలో అచ్చయిన ప్రతి పుస్తకాన్ని ప్రచురణకర్తలు యీ గ్రంథాలయానికి ఉచితంగా పంపవలసియుంది. ఈ చట్టం వలన యీ విభాగంలో యిప్పటికి లక్షా పాతికవేలు పుస్తకాలు వచ్చాయి. అయితే పుస్తకాల రాకడకు తగినట్లు యిచ్చట సిబ్బంది లేకపోవడం వలన, వాటన్నిటినీ నమోదు చేసేందుకు గాని, క్రమబద్ధమైన పద్ధతిలో అమరిక చేసేందుకుగాని అవకాశం కలుగలేదు.

### యునెస్కో కేంద్రం

ఈ గ్రంథాలయం 1965–66 నుంచి ప్రపంచ విజ్ఞాన పరిషత్తు (యునెస్కో) వారి సమాచార కేంద్రంగా గూడ గుర్తించబడింది. ఇందువలన యునెస్కో ప్రచురించు పుస్తకాలు, పత్రికలు, ఫిల్ములు, నివేదికలు మొదలైనవన్నీ యిందు ప్రత్యేకంగా ఉంచబడతాయి. అంతేగాక ప్రపంచ విజ్ఞానపరిషత్తుకు సంబంధించిన సదస్సులు, సభలు; మానవ హక్కుల దినోత్సవాలు మొదలైనవి యిందు జరుగుతున్నాయి. ఇటీవల యీ కేంద్రం ప్రజల మన్ననలను బాగా అందుకొన్నది.

### భవన విస్తరణ

అనేక రకాల కార్యక్రమాలతో ఎప్పుడో నూట యాభై సంవత్సరాలనాడు నిర్మించిన భవనం ఏ మాత్రం చాలటంలేదు. నిరంతరం వస్తున్న పుస్తకాలు కుప్పలు తెప్పలుగా పడిపోతున్నవి. అందుచేత యిటీవల అధ్యక్షులుగా పని

జేసిన జస్టిస్ యం సి చాగ్లా, ప్రస్తుత అధ్యక్షులు డాక్టర్ ఎస్ ఎస్ గజేంద్రగడ్కర్ యీ విషయంలో మరింత శ్రద్ధ వహించారు. మహారాష్ట్ర ప్రభుత్వం, బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్, సర్దార్ పటేల్ స్మారక సమితి తలొక పది లక్షలు, ప్రజలనుండి సేకరించిన 30 లక్షలు, వెరసి 60 లక్షల రూపాయలతో బ్రహ్మాండమైన భవన నిర్మాణానికి పథకం తయారుచేశారు. ఈ భవనంలో సర్దారుపటేల్ స్మారక మందిరం ఏర్పాటు చేయబడుతుంది. పథకం తయారీలో కొన్ని దొసగులు రావడం వలన దాదాపు అయిదారు సంవత్సరాలుగా యీ భవన నిర్మాణం ఆగిపోయింది. ఇటీవల అవన్నీ సర్దుబాటు జరిగి నిర్మాణానికి శంకుస్థాపన జరుగుతుందని తెలుస్తోంది.

### గ్రంథాలయ సేవ

లక్షల సంఖ్యలో పుస్తకాలు గలిగి, చాలిచాలని భవనం వలన తగినంతగా సేవ చేయడానికి వీలులేకపోయిందని యిటీవల కార్యదర్శి నివేదిక వలన తెలుస్తుంది. అయినప్పటికి రోజుకు సుమారు 1100 మంది చదువరులు వస్తున్నారు. 850 పుస్తకాలు అరువుగా యివ్వబడుతున్నవి. పరిశోధన చేసుకోడానికి, ప్రతులు తీసుకోడానికి అవకాశాలు కల్పించబడుతున్నవి. ముఖ్యంగా యిందు గల సమాచార విభాగం మరింత ఉపయోగంగా ఉంది.

మామూలు కార్యక్రమాలతోబాటు యీ గ్రంథాలయం అనేక విస్తరణ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

దాదాపు ప్రతి మాసంలోనూ సభలు, పుస్తక ప్రదర్శనలు, చలనచిత్ర ప్రదర్శనలు చర్చలు - ఎంతో విజయవంతంగా నిర్వహిస్తోంది.

ఈ తీరుగా యీ గ్రంథాలయం అనేక విధాల విజ్ఞాన వ్యాప్తికి నిరంతరం కృషిచేస్తూ ఉంది.

—

# ఇండియా ఆఫీస్ గ్రంథాలయం

# 4

భారతదేశానికి సంబంధించిన ఉత్తమగ్రంథ సంచయం గల గ్రంథాలయాలలో లండన్‌లోని యిండియా ఆఫీస్ గ్రంథాలయం ప్రసిద్ధమైనది. భారతీయ విషయాలమీద యిన్ని ఉత్తమగ్రంథాలు భారతావనిలో సైతం ఏ ఒక్క గ్రంథాలయంలోనూ లేవంటే ఆశ్చర్యం లేదు. దీనిలో భద్రపరచబడ్డ అపూర్వ వాఙ్మయ సంపదనుబట్టి, దీని యాజమాన్యం భారతదేశం, పాకిస్థాన్, బ్రిటన్ దేశాలకు సంబంధించింది గాబట్టి సులభంగా పరిష్కరించడానికి వీలులేని సమస్యగా తయారైంది.

ఉద్యోగరీత్యా భారతదేశానికి వచ్చిన ఆర్మే, మెకంజీ, బూహ్లార్, కోల్‌బ్రూక్, బర్నెల్ మొదలైన సాహిత్యపరులు యీ దేశంలో చిరకాలంగా ఉపయోగిస్తున్న బెరడు, భూర్జ పత్రాలు, రాగిరేకులు, తాటాకులు, చేతికాగితములు మొదలైన వానిని సేకరించి లండన్‌లోగల తమ అధిపతులకు కానుకలుగా పంపుతుండేవారు. ఈ విధంగా పంపిన పఠన సామగ్రి యిండియా గ్రంథాలయ స్థాపనకు నాంది అయినది.

ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లు 1798లో యిలా వ్రాశారు. "ముఖ్యంగా బెంగాల్‌లోని ఉద్యోగులు తరచుగా ప్రాచ్యలిఖితగ్రంథాలు సేకరించి వానిని యీ దేశానికి పంపు

తున్న విషయం గమనించాము. ఇండియాలో యిప్పటికి వివిధ వ్యక్తుల వద్దవున్న లిఖితప్రతులు చేతులు మారుతూ శిథిలమై పోవచ్చు. ఈ పని భారతదేశానికేగాక యూరప్‌కు గూడ ఎంతో నష్టం. వీని భద్రతకోసం యీ దేశం ఒక పరిరక్షణాల యాన్ని (పబ్లిక్ రిపాసిటరీ) ఏర్పాటుచేయాలని నిశ్చయిం చాము."

## ప్రాచ్య గ్రంథాలయం

ఈ నిర్ణయం 1801లో ప్రాచ్యగ్రంథాలయం (ఓరియం టల్ లైబ్రరీ) పేరున కార్యరూపం దాల్చింది. దీనికి గ్రంథ పాలకుడుగా భారతదేశానికి సన్నిహిత మిత్రుడు, సంస్కృత పండితుడు సర్ ఛార్లెస్ విల్కిన్స్‌ను నియమించారు. ఇదే సమ యంలో చరిత్రకారుడు రాబర్ట్స్ తనవద్దగల ఈస్టిండియా వ్యవహారాలకు సంబంధించిన మేలురకం తోలుతో చేయబడ్డ 231 బైండు పుస్తకాలు, 8 కట్టల ఉత్తరాలు, 6 హిందూ ఇత్తడి విగ్రహాలు, 17 దేశపటాలు, ప్లానుల చుట్టలు, యింకా అనేకం యీ సంస్థకు స్వాధీనం చేశారు. వీటికి తోడుగా ఇండి యాలో అనేక ప్రాంతాలలో అధికారరీత్యా పర్యటించిన కల నల్ కాలిన్ మెకంజీ తయారుచేసిన చారిత్రక పత్రాలు, సేక రించిన వ్రాత ప్రతులు, నాణేలు, ప్రతిమలు, యీ గ్రంథాల యానికి చేర్చబడ్డాయి. ఈ సంకలనాలతో యీ గ్రంథాలయా నికి ఒక రూపమేర్పడింది. కంపెని డైరెక్టర్లలో యీ సంస్థ మొడ ఆశాభావం ఏర్పడింది.

### క్రమాభివృద్ధి

అప్పట్నుంచీ యీ గ్రంథాలయం క్రమేపీ పెరుగుతూ వచ్చింది. హెన్రీథామస్ కోల్‌బ్రూక్ ఈస్టిండియా కంపెనీలో ఉన్నతాధికారి. సంస్కృత సాహిత్యంపై వారికి ఆసక్తి మెండు. 1819 వరకు భారతదేశంలో వారు పనిచేసిన కాలంలో అనేక శ్రమలకోర్చి సేకరించిన 2749 సంస్కృత గ్రంథాలను యీ గ్రంథాలయానికి దత్తంచేశారు. 1853లో ఆదిల్‌షా గ్రంథాలయం పూర్తిగా, బలవంతంగా లండన్ చేర్చబడింది. రాయల్‌సొసైటీ చీనా, జపాన్, మంచూ మొదలైన భాషలలో గ్రంథాలను, పారశీ, జెండు, పహ్లావీ, మలేబర్మీస్, పాలీ, సయామీస్ భాషలలో వ్రాతప్రతులను యీ గ్రంథాలయానికి బహూకరించింది.

### గ్రంథాలయ సూచీ

అనేక రీతుల అమూల్యమైన గ్రంథసంచయం యీ గ్రంథాలయానికి చేర్చబడుతున్నప్పటికీ దీనిలో సాంకేతికమైన అభివృద్ధి 1835 తర్వాతగానీ జరగలేదు. అప్పటి వరకు వర్గీకరణగాని, సూచీకరణగాని లేదు. అయితే కాగితాలు చినిగి పోయి, మురికిపట్టిన ఒక సూచీకలదని పీటర్ గోర్డన్ అనే ఒక యాత్రికుడు వ్రాశాడు. హోరే హేమాన్ విల్సన్ 1836లో గ్రంథపాలకునిగా నియమింపబడిన పిదప దీని నిర్వహణలో చాలమార్పులు వచ్చాయి. విల్సన్ పుస్తకాలను, నాణేలను వర్గీకరించి వానికొక సూచీ తయారుచేసి ముద్రించాడు. ఆ తర్వాత యీ సూచీ పలుమార్లు ముద్రణ జరిగింది.

*ఇండియా ఆఫీస్ గ్రంథాలయం*

ఇంతలో పరిపాలనా వ్యవహారాలలో పెద్ద మార్పు జరిగింది. ఈస్టిండియా కంపెనీ రద్దయింది. 1858 నుంచి భారత దేశ పరిపాలనా బాధ్యత పూర్తిగా క్రౌనుకు బదిలీ చేయబడింది. ఇందునిమిత్తం లండన్‌లో ఇండియా ఆఫీస్ ఏర్పడింది. సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా ఆధ్వర్యంలో యీ కార్యాలయం పనిజేస్తుంది. ఇంతకాలం ప్రాచ్య గ్రంథాలయంగా వున్న సంస్థ అప్పట్నుంచీ ఇండియా ఆఫీస్ గ్రంథాలయంగా రూపొందింది. అధికారులు గ్రంథాలయాన్ని బాగా పెంచ దలచి మ్యూజియంను గ్రంథాలయాన్నుంచి వేరుచేసి, అందుగల అపూర్వ వస్తు సంచయం బ్రిటీషు మ్యూజియంకు తరలించారు.

*గ్రంథాలయ భవనం*

నానాటికి గ్రంథాలయం బాగా పెరుగుతూండటం వలన అప్పటివరకు లేడెన్ వీధిలో గల భవనం ఏమాత్రం సరిపోవడం లేదు. అందుచేత 1867లో దీన్ని కింగ్ ఛార్లెస్ వీధిలోగి వైట్‌హాల్ భవనానికి మార్చబడింది. అదృష్ట వశాత్తు అదే సంవత్సరంలో భారతదేశంలో ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ ఆఫ్ బుక్స్ ఆక్టు అమలులోకి వచ్చింది. ఈ చట్టం వలన భారతదేశంలో అచ్చయిన ప్రతి పుస్తకాన్ని ఉచితంగా సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు పంపవలసియున్నది. ఈ పంపబడిన పుస్తకాలన్నీ యిండియా ఆఫీస్ గ్రంథాలయంలో భద్రపరచ బడుతున్నాయి. ఆ విధంగా యీ గ్రంథాలయం కాపీరైట్

గ్రంథాలయంగా మార్చబడటంతో వేలాది గ్రంథాలు కుప్పలు తెప్పలుగా, ఉచితంగా వచ్చే అవకాశం కలిగింది.

## గ్రంథ సంచయం

పై అవకాశానికి తోడుగా భారతదేశంలో ఆంగ్లేయ ఉద్యోగులు ఎ సి బర్నెల్, జె పి బూహ్లార్ మొదలైనవారు ఎప్పటికప్పుడు సేకరించిన వ్రాతప్రతులు యీ గ్రంథాలయానికి అప్పగిస్తూనే ఉన్నారు. 1875లో జపాన్ ప్రభుత్వం తమ వేదాలు, బౌద్ధత్రిపిటకాలకు సంబంధించిన 2000 సంపుటాలు బహూకరించింది. అపూర్వమైన యీ గ్రంథ సంచయపు చేరికతో యీ గ్రంథాలయం బౌద్ధ వాఙ్మయానికి నిధి ఐంది. 1902లో రాజా సర్ ఎస్ యమ్ ఠాగూరు చిత్రాలు దీనికి బహూకరింపబడ్డాయి. ఆ తర్వాత ఆప్రెలెట్ చిత్రాలు కొనబడ్డాయి. వీనితోపాటు భారతీయ కళాకారుల చిత్రాలసేకరం యీ గ్రంథాలయానికి చేర్చబడ్డాయి. లిఖిత ప్రతులుగాని ముద్రిత గ్రంథాలుగాని, చిత్రాలుగాని, ఫోటోలుగాని ఏవైతేనేం యీ గ్రంథాలయానికి దాదాపు అధికభాగం సేకరణ రూపంలో రెండున్నర లక్షలకు పైగా సంపాదించబడ్డాయి. కీనిలో యూరోపియన్ భాషలలో 60 వేలు, బెంగాలీ 24 వేలు, ఉర్దూ 20 వేలు, సంస్కృతం 19 వేలు, హిందీ 19 వేలు, తమిళం 15 వేలు, గుజరాతీ 9500, పంజాబీ 5 వేలు, పర్షియన్ 4700, ఒరియా 4800, కన్నడం 2500, సింధీ, చైనీస్, మలయాళం, పాళీ, అస్సామీ, కాపాలీ, కాశ్మీరీ,

టిబెటన్, జెండ్ మొదలైన భాషలలో మరో 7 వేల చిల్లర గ్రంథాలున్నాయి.

వీనికితోడు సంస్కృతం, అరబిక్, పర్షియన్ మొదలైన భాషలలో 8 వేలకు పైగా లిఖిత గ్రంథాలు కలవు. ఈ గ్రంథాల పరిశీలనకు అరువుగా తీసుకువెళ్ళడానికి అవకాశం కల్పించబడింది. భారతదేశంపై పరిశోధన చేయగలవారు యీ గ్రంథాలయాన్ని విధిగా సంప్రదించవలసిన అమూల్యమైన సామగ్రి యిచట భద్రపరచబడింది.

*చరిత్రగతిలో మార్పులు*

భారతదేశానికి 1947లో స్వాతంత్ర్యం ప్రకటించబడింది. భారతదేశాన్ని మనకప్పగించి బ్రిటీషువారు ఇంగ్లండ్ వెళ్ళిపోయారు. అప్పుడు లండన్‌లో గల ఇండియా ఆఫీస్ అవసరం తీరిపోయింది. కాగా ఆఫీస్ ఎత్తివేశారు, ఆ ఆఫీస్ తాలూకు ఇండియా ఆఫీస్ గ్రంథాలయ యాజమాన్యాన్ని కామన్‌వెల్త్ వ్యవహారాల కార్యదర్శికి అప్పగించబడింది. ఐనా పేరులో మార్పు జరగలేదు. ప్రెస్ చట్టంక్రింద వచ్చే పుస్తకాలు 1948 నుంచి ఆగిపోయాయి. ఐనప్పటికీ బ్రిటీషు ప్రభుత్వం తన నిధులను వెచ్చించి పుస్తకాలను కొంటూనే ఉంది.

*ఈ గ్రంథాలయం ఎవరిది?*

ఇంతకూ యీ గ్రంథాలయం ఎవరిదనే సమస్య చాలమందికి వచ్చింది. వీళ్ళంతా—రామాయణం చదివి రాముడికి సీత ఏమౌతుందనే ప్రశ్న వేసే పెద్దల్లోనివారు. ఈ గ్రంథా

లయం నిస్సందేహంగా భారతదేశపు ఆస్తే. దీనిలోగల గ్రంథ సంచయం పూర్తిగా భారతదేశానికి చెందినదే. ఖర్చులో అధికభాగం భారతదేశపు రెవిన్యూనుండి ఖర్చుచేయబడిందే. పుస్తకాలను, భవన స్థలానికి ఖర్చుపెట్టిన రు 86,765/-, భవనంకోసం వెచ్చించిన రు 5,88,000/- భారతదేశానివే. ఐతే యీ గ్రంథాలయంలోని అధికభాగం సామగ్రి బ్రిటీషు ఉద్యోగులు సంపాదించినవనీ, యిందుగల చాలభాగం రికార్డులు యీస్టిండియా చరిత్రను విశదీకరించేవి గనుక యీ గ్రంథాలయం తమ స్వంత ఆస్తి అనీ బ్రిటీషువారి వాదన. అంతేగాక అపూర్వమైన లిఖితప్రతులు, ప్రాచీన ముద్రిత వాఙ్మయం భారతదేశంవంటి వేడి దేశాలకు తరలిస్తే చెడి పోతుంది గనుక అది లండన్‌లోనే ఉంటే మంచిదని సలహా యిచ్చినవారు లేకపోలేదు.

*శ్రీ అజాద్ ప్రయత్నం*

లండన్‌లోగల యిండియా ఆఫీస్ గ్రంథాలయాన్ని భారతదేశానికి తరలించే విషయంలో శ్రీ మౌలానా అజాద్ కేంద్ర విద్యామంత్రిగా ఉన్నప్పుడు ప్రయత్నించారు. వారు 1955లో లండన్ వెళ్ళినపుడు తొలిసారిగా బ్రిటీషు ప్రధానితో చర్చించారు. ఆ మరుసటి సంవత్సరమే కామన్‌వెల్త్ వ్యవహారాల కార్యదర్శి ఎరల్ ఆఫ్ హోమ్ భారతదేశం సందర్శించినపుడు వారితో యీ గ్రంథాలయం విషయం ప్రస్తావించి ఒక విజ్ఞాపన ఇవ్వడం జరిగింది. కాని ఫలించలేదు.

అజాద్ మరణానంతరం కేంద్రమంత్రి హుమయూన్ కబీర్ కొంత ప్రయత్నం చేశారు. ఇలా ఉండగా పాకిస్థాన్

గూడ యీ గ్రంథాలయంలో తనకుగూడ భాగం యివ్వాలని కొత్తసమస్యను లేవనెత్తింది. ఏదో ఒక పరిష్కారంకోసం నెహ్రూ యిందుకు అంగీకరించారు. 1959 సెప్టెంబరులో పాకిస్థాన్ ప్రెసిడెంట్ ఫీల్డు మార్షల్ ఆయూబ్ ఖాన్ న్యూఢిల్లీ వచ్చినప్పుడు యీ గ్రంథాలయ సమస్య చర్చించి యిరువురు సంయుక్తంగా విజ్ఞప్తి చేయడానికి నిశ్చయించుకున్నారు. తదనుగుణంగా లండన్‌లోని భారత డిప్యూటి హైకమీషనర్, పాకిస్థాన్ అంతర్జాతీయ వ్యవహారాలమంత్రి సంయుక్తంగా ఒక విజ్ఞప్తి బ్రిటీషు ప్రభుత్వానికి అందజేశారు. ఒక గ్రంథాలయాన్ని రెండుగా చీల్చినపుడు సమగ్రత దృష్ట్యా పెద్ద లోపం కలుగుతుంది. అంచేత యీ సూచన సమంజసంగా కనిపించడం లేదు.

ఇలా ఉండగా - యీ గ్రంథాలయంలోగల పత్రాలు, పుస్తకాలు బ్రిటీషుప్రభుత్వానికి, బ్రిటీషు ప్రజలకు, అచటగల పరిశోధనలకు అవసరమౌతుంటాయి గనుక యీ గ్రంథాలయాన్ని లండన్‌లోనే ఉంచడం మంచిదనే అభిప్రాయానికి బ్రిటీషు ప్రభుత్వం వచ్చింది. ఈ విధంగా యీ గ్రంథాలయ వ్యవహార పరిష్కారానికి ముగ్గురు భాగస్వాములు తయారైనారు. చివరకు మూడుసార్లు యీ సమస్య పరిష్కారానికి ప్రీవీకౌన్సిల్‌లోని జుడీషియల్ విభాగానికి అప్పగించినట్లు తెలుస్తుంది. మొత్తానికి యీ గ్రంథాలయ సమస్య సులభంగా పరిష్కరించడానికి వీలులేనిదైంది. దీనిలోగల అపూర్వసంపద ఈ చిక్కుసమస్యను మరింతక్లిష్టం చేస్తున్నది. ఈ గ్రంథాలయాన్ని మూడు భాగాలుగా విభజించి, గ్రంథాలు తమతమ

వాటాకు వచ్చేదిపోను మిగతా వాటిని మైక్రోఫిల్ములు తీయించి యిచ్చే ఆలోచన వొకటి ఉంది. ఇదెంత హర్షనీయమో బోధపడటంలేదు. ఇదెంతవరకు కార్యరూపం ధరించగలదో బోధపడకుండా ఉంది.

### జాతీయ కేంద్రగ్రంథాలయం

మన దేశానికి సంబంధించి నంతవరకు మనం చాలా కాలంగా న్యూఢిల్లీలో జాతీయ కేంద్ర గ్రంథాలయ స్థాపన కోసం ఎదురుచూస్తున్నాము. లండన్‌లోని యిండియా ఆఫీస్ గ్రంథాలయం భారతదేశానికి తరలించేమెడ అది జాతీయ కేంద్ర గ్రంథాలయానికి పునాదిగా ఏర్పడగలదని ప్రపంచ ప్రఖ్యాత గ్రంథాలయ శాస్త్రవేత్త డాక్టరు రంగనాథన్‌గారు సెలవిచ్చారు. అందుచేత యీ పనులన్నీ పూర్తయి, ఒక రూపానికివస్తే అపూర్వమైన పెన్నిధి మనకు దక్కుతుంది. లేదా తెలుగువాళ్ళం కన్నెమరా గ్రంథాలయంపై, తంజావూరు సరస్వతీ మహాల్‌పై అధికారాన్ని వదులుకొన్నట్లు, భారతీయులు ఇండియా ఆఫీస్ గ్రంథాలయంపై అధికారం పూర్తిగా వదులుకోవలసిన పరిస్థితి వస్తుందేమో చెప్పలేం, ఏమివచ్చినా నిశ్చింతగా, నిర్లిప్తంగా ఉండగల ఉదార సహృదయులం మనం.

## అనుబంధం 1

లండన్‌లోని ఇండియా ఆఫీసు లైబ్రరీ భవిష్యత్తు విషయమై బ్రిటన్, ఇండియా, పాకిస్థాన్‌ల ప్రతినిధులమధ్య ఒప్పందం కుదిరిందట. ఈ లైబ్రరీ, ఇండియా, పాకిస్థాన్‌లలో వున్న లైబ్రరీలు పరస్పరం సహకరించుకునే విషయంలోకూడా ఒడంబడిక జరిగిందట. కాని, దీని వివరాలు ఇంకా తెలియ రాలేదు.

లండన్‌లోని ఇండియా ఆఫీసు లైబ్రరీ ప్రాచీనమైనది. ఇండియాను గురించి—ముఖ్యంగా బ్రిటీష్ పరిపాలనా కాలం నాటి ఇండియాను గురించి — తెలుసుకోవగోరేవారికి, పరిశోధన జరపదలచినవారికి ఇది "కొంగుబంగారం" వంటిది.

1801లో స్థాపించిన ఈ లైబ్రరీలో అయిదు లక్షల సంపుటాలు వున్నాయి. వాటిలో ఎనిమిది వేల సంస్కృత లిఖితపత్రాలు, రెండున్నర లక్షల అధికార పత్రాలు, 37 వేల చిత్తరువులు కూడా వున్నాయి. ఇండియాపై వ్రాసిన గ్రంథాలే కాక ఈస్టిండియా కంపెనీకి సంబంధించిన చారిత్రక పత్రాలు కూడా అనేకం ఈ లైబ్రరీలో వున్నాయి. పైగా, ఇండియా మంత్రులుగాను, వైస్రాయిలుగాను పనిచేసినవారితో సహా 120 మంది ప్రముఖవ్యక్తుల ప్రయివేటు పత్రాలను, లేఖలను కూడా ఈ లైబ్రరీ ఇటీవల సేకరించింది.

ఈ లైబ్రరీ ఇండియా ఆస్తి కాబట్టి దానిని ఇండియాకు యిచ్చివేయాలని కొంతకాలం క్రితం మన కేంద్రప్రభుత్వం

బ్రిటన్‌ను అభ్యర్థించింది. దానిలో తమకు కూడా భాగ స్వామ్యం వున్నదని పాకిస్తాన్ పేచీపెట్టగా, ఇండియా చరిత్రకు సంబంధించిన గ్రంథాలను ఇండియాకు, పాకిస్తాన్‌వి ఆ దేశానికి ఇవ్వాలన్న ప్రతిపాదన కూడా వచ్చింది.

కాని, ఈ ప్రతిపాదన ఆచరణయోగ్యమైనదని మేము భావించడంలేదు. ఇండియా, పాకిస్తాన్‌ల చరిత్ర 1947 వరకు ముడిపడిలేదా? అయినప్పుడు, ఈ ప్రాచీన గ్రంథాలలో ఇండియాకు చెందినవని, పాకిస్తాన్‌కు చెందినవని వేరుచేయడం సాధ్యమా? అందువల్ల, ఈ లైబ్రరీని యథాతథంగా కదిలించకుండా వుంచడమే మంచిదని మాకు తోస్తున్నది.

ఈ సందర్భంలో ఒక విషయం గమనార్హం. కలకత్తాలోని నేషనల్ లైబ్రరీ, మద్రాసులోని కన్నెమరా లైబ్రరీ వంటి పెద్ద లైబ్రరీలు ఇండియాలో లేకపోలేదు. కాని, వీటిలోని అమూల్యమైన గ్రంథాలనే మనం సక్రమంగా భద్రపరచలేకపోతున్నాము. ఉన్న గ్రంథాలనే మనం జాగ్రత్త చేసుకోలేకపోతున్నప్పుడు ఆ అమూల్య గ్రంథాలను, చారిత్రక పత్రాలను లండన్‌నుంచి తెప్పించి, పాడుచేయడం విజ్ఞతగా కనిపించదు. పోతే ఇండియా ఆఫీసు లైబ్రరీని ఇటీవలనే కొత్తగా నిర్మించిన పదహారు అంతస్తుల భవనంలోకి మార్చారట. అయినప్పుడు, లైబ్రరీని అక్కడే వుంచితే, గ్రంథాలు భద్రంగా వుంటాయికదా!

ఇంతచేస్తే ఇండియా మాజీమంత్రులు, వైస్రాయిలకు సంబంధించిన ప్రయివేటు పత్రాలను, లేఖలను బ్రిటిష్ ప్రభుత్వం

మనకు ఇవ్వబోదు. ఇవి లేకుండా ఆ లైబ్రరీని మనం తీసుకుంటే దాని విలువ తగ్గిపోతుంది. కాగా మనకు అవసరమైన గ్రంథాలు పత్రాల మైక్రోఫిలింలను తీసుకోవడం సులభం కాబట్టి ఆ పని చేయవచ్చు. నిజానికి ప్రాచీన గ్రంథాలు, పత్రాల ప్రతులను తీయడానికి ఇప్పుడు ఆధునికమైన, సులభమైన పద్ధతులు అనేకం వచ్చాయి. వీటిద్వారా మనం ఈ లైబ్రరీ ప్రయోజనాన్ని పొందవచ్చు.

ఈ సందర్భంలో మనకు సంబంధించిన ఒక ముఖ్య విషయాన్ని కూడా గమనించాలి. 17, 18, 19 శతాబ్దాల ఆంధ్ర చరిత్రను గురించి సరిగా పరిశోధన జరగలేదు. ఆ కాలానికి సంబంధించిన మన గ్రంథాలు బొత్తిగా వెలువడ * * రణకు * * బెంగాల్ * * మలబార్ * * వారి పరిపాలనా * * సంబంధించిన గ్రంథాలు వుండగా, ఆంధ్ర ప్రాంతంలోవారి ఏలుబడికి సంబంధించిన గ్రంథం ఒక్కటైనా రాలేదు.

అలాగే ఇండియాలో ఫ్రెంచిపాలనకు సంబంధించిన గ్రంథాలు రెండో, మూడో మాత్రమే వెలువడగా, ఆంధ్ర ప్రాంతానికి సంబంధించి ఒక్కటి కూడా లేదు.

ఆంధ్ర ప్రాంతంలో బుడతకీచుల పరిపాలనను గురించి కాని, మచిలీపట్నంలో బ్రిటిష్, ఫ్రెంచి, డచ్ పరిపాలనకు సంబంధించిగాని ఒక్క గ్రంథమైనా లేదు. ఇక 18, 19 శతాబ్దాలలో ఆంధ్రుల సాంఘిక, ఆర్థిక పరిస్థితులను గురించి మనకు

బొత్తిగా తెలియదు. ఇదే కాలానికి సంబంధించి బెంగాల్, కేరళ ప్రాంతాల పరిస్థితులపై చాల పుస్తకాలు వచ్చాయి.

కడచిన మూడు శతాబ్దాల ఆంధ్రచరిత్రపై వెలుగును ప్రసరించే గ్రంథాలు, చారిత్రక పత్రాలు ఇండియా ఆఫీసు లైబ్రరీలో అనేకం వున్నాయి. కాగా ఆంధ్ర యూనివర్సిటీ లైబ్రరీకి, స్టేట్ లైబ్రరీకి, ప్రాంతీయ గ్రంథాలయాలకు ఈ గ్రంథాలు, పత్రాల మైక్రోఫిలింలను తెప్పించడానికి ప్రయత్నం జరగడమేమి, వాటి ప్రాతిపదికగా గత మూడు శతాబ్దాల ఆంధ్ర చరిత్ర రచనకు చారిత్రక పరిశోధకులు పూనిక చూపడమేమి ముఖ్యావసరం.

(15-12-1970 ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకీయం)

—

# తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయం

## 5

తంజావూరులోని సరస్వతీమహల్ గ్రంథాలయం—తమిళ చోళులు, తెలుగు నాయకులు, మహారాష్ట్రులు యీ మూడు సంస్కృతుల సమ్మేళనం. తెలుగు సాహిత్యానికి, ఆంధ్ర తేజానికి నీరాజనాలెత్తిన విజయనగర సామ్రాజ్యం పతనమైన అనంతరం ఆంధ్రభాషామతల్లి పెనుగొండ, చంద్రగిరి మొదలైన దుర్గాలలో తలదాచుకొన్నది. కొలదికాలంలో చీకటి మబ్బులు తొలగిపోగా తెలుగుతల్లి తంజావూరు సంస్థానంలో దాదాపు రెండు శతాబ్దాలపాటు కవితావిహారం చేసింది. తంజావూరు నేలిన రఘునాథభూపాలుడు (1600–1634), విజయరాఘవుడు (1634–1677) స్వయంగా కవితాహృదయం కలవారేగాక, కవిపోషకులుగూడనై కృష్ణాధ్వరి, చేమకూర వెంకటకవి, కవిచౌడప్ప, రంగాజమ్మ, రుద్రమాంబ మొదలైన కవులను, కవయిత్రులను పోషించారు.

ఆ తర్వాత వచ్చిన మహారాష్ట్ర ప్రభువులు 1వ శహాజీ, 1వ ఏకోజీ, 2వ శహాజీ, 1వ శరభోజీ, 1వ తులజాజి, 2వ ఏకోజీ, 2వ తులజాజీ, 2వ శరభోజీ, (1797–1838) మొదలైన రాజులుగూడ రాజకవులేగాక, కవిపోషకులు గూడ. అందుచేత యీ రెండువందల సంవత్సరాల కాలంలో కావ్యాలు, ప్రబంధాలు, యక్షగానాలు, నాటకాలు, ద్విప

దలు, నిఘంటువులు, శతకాలు, దండకాలు, గేయాలు - అనేక ప్రక్రియలుగా వేలసంఖ్యలో వచ్చినవి. ముఖ్యంగా ఈ రచయితలలో శృంగారతత్పరత, విలాసప్రియత్వం, హాస్య చతురత తొణికిసలాడింది.

ఈ కాలంలోనే ప్రజానీకానికి సాహిత్యాభిరుచి కలిగింది. మంత్రముగ్ధులను చేయగల మధుర భావాలను ప్రజలు విని ఆనందించారు.

సరస్వతీమహల్

తంజావూరు నేలిన నాయకరాజులు, మహారాష్ట్ర ప్రభువులు రచనలను చదివి ఆనందించటమేగాక, వాటి ప్రతులను సేకరిస్తూ వచ్చారు. వీరిలో రెండవ శరభోజీ ఉత్తమ గ్రంథ సేకరణలో నిరుపమానమైన కృషిచేశారు. రెండవ శరభోజీ మహారాష్ట్ర రాజులలో కడపటివాడు. సంగీత సాహిత్య నృత్య విద్యాపోషకుడై -వాటి ప్రోత్సాహానికి 'సరస్వతీమహల్' అనే కమనీయమైన భవనాన్ని కన్నులపింపుగా తీర్చిదిద్దాడు. సుందరము, కళాత్మకమైన యీ భవనంలో తన ముందు తరం వాళ్ళు, తానూ అనేక వ్యయప్రయాసలకోర్చి సేకరించిన రత్న ఖనితో సమానమైన వ్రాతప్రతులను భద్రపరచారు.

శరభోజ మహారాజుకు ఉత్తమ గ్రంథ సంకలనంలో ఎంత అవ్యాజమైన అభిరుచి కలదో ఈ రెండు చాటువుల వలన తెలుస్తుంది.

గీ మనుచరిత్రంబు కల్గిన మనుజచంద్ర
వసుచరిత్రంబు తెలిసికో వచ్చినాడ

అన్న సంబళ మిప్పించి మనుపునన్ను
రమ్యగుణసాంద్ర శరభోజ రాజచంద్ర !

కం సంబళము చేసి నిలిపిన
నింబున నే పుస్తకంబు నెక్కడనైనా
సంబాళించుక తెచ్చెద
శంబరహర తుల్యరూప! శరభోజినృపా !

ఇలాగే అనేకమంది వ్యక్తులద్వారా అపూర్వమైన వ్రాతప్రతులను సేకరించాడు.

శరభోజ మహారాజు కాశీయాత్ర (1820-30)కు పోయి నప్పుడు మార్గమధ్యంలో తనకెట్టి వ్రాతప్రతులు కనిపించి నను, వాటిని ఉచితంగాగాని, ధనమిచ్చిగాని సేకరించాడట. ఒకసారి ఒక పండితుడు చాల వ్రాతప్రతులు తెచ్చి శరభోజీకి అమ్మజూపాడట. ఐతే ఆ సమయంలో శరభోజీవద్ద తగినంత సొమ్ము లేదు! వెంటనే మెడలోని వజ్రాలహారాన్ని ఆ పండి తునకిచ్చి వజ్రవైడూర్యాలకంటె విలువైన గ్రంథాలను పుచ్చుకొన్నాడు. ఈ విధంగా అనేక విలువైన గ్రంథాలను సేకరించాడు. వీటితో బాటుగా యిటీవలి కాలంలో జాంబునాథ భట్ లాండగాయి, పతంగ అవధూతస్వామి, కాగల్కర్, ధవలేకర్, యన్ సుబ్రహ్మణ్యశాస్త్రి మొదలైన మహాశ యులు తమవద్దగల వ్రాతప్రతులను ఈ గ్రంథాలయానికి ప్రదానంచేశారు. నేటికీ అనేకమంది ఉదారులు తమవద్దగల అపూర్వమైన వ్రాతప్రతులను ఈ గ్రంథాలయానికి చేర్చుతున్నారు.

తంజాపురాంధ్ర సరస్వతికి ప్రతీకగా నిలచిన సరస్వతీ మహల్ ప్రాంగణంలోకి వెళ్ళగానే ముకుళితహస్తాలతో వినయంగా సరస్వతికి సమస్కరిస్తున్న శరభోజీ పాలరాతి విగ్రహం మనకు కనిపిస్తుంది. ఫ్రెంచి శిల్పి ఫ్లాస్మనూన్ తయారు చేసిన యీ విగ్రహాన్ని 1807లో యీస్టిండియా కంపెనీవారు యిచట ప్రతిష్ఠ చేశారు. నాయక రాజుల దర్బారు హాలుగా విలసిల్లిన గ్రంథాలయ మందిరంలోని విచిత్రమైన ధ్వనుల సోయగం మనలను మంత్రముగ్ధులను చేస్తుంది. ఇందు మలచిన స్తంభాలపై స్వల్పమైన దెబ్బకొడితే మూడు వందల గజాల దూరం వరకు ఆ ధ్వనికంపనాలు విజ్ఞాన పుంజాలను వెదజల్లుతాయి. మహల్‌లోని బీరువాలు, చిత్రాలు, శిల్పాలు చూస్తే కవులకు, పండితులకు, కళాకారులకు రాజయోగం పట్టినట్లుంది.

*గ్రంథ సంపద*

తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయంలో దాదాపు 40,000లకు పైగాగల వ్రాతప్రతులలో సంస్కృతం 30,000; మరాఠి 5,000; తెలుగు 2,500; తమిళం 2,000; ఇతర భాషలు 500 వ్రాతప్రతులందున్నవి. వీటిలో అనేక సంస్కృత, తమిళ గ్రంథాలు తెలుగు లిపిలో వ్రాయబడ్డాయి. మిగతావి దేవనాగరి, నందినాగరి గ్రంథలిపులలో హెచ్చుభాగం తాటి యాకులపై వ్రాయబడ్డాయి.

భారతీయ సంస్కృతిని, ప్రతిష్ఠను దేశదేశాల ఉద్రూత లూగించగల తత్వశాస్త్రం, తర్కశాస్త్రం, సంగీతం, శిల్పం,

లలితకళలు, సిద్ధ-ఆయుర్వేద వైద్యవిద్యావిధానాలపై అసాధారణమైన గ్రంథాలు, అనేక నూతన విషయాలను బయటపెట్టగల అశ్వశాస్త్రం, గజశాస్త్రం, విమానశాస్త్రంపై చాల గ్రంథాలు గలవు. ఇవిగాక తంజావూరునేలిన మహారాష్ట్రరాజులు మోడిలిపిలో వ్రాసిన అనేక రాజపత్రాలు, డైరీలు, రాచరికపు జమాఖర్చులు, పరిపాలనా వ్యవహార పత్రాలు - యింకా ఎన్నో ఉన్నవి. వీటన్నిటినీ చరిత్రకారులు ఉపయోగించుకొన్నయెడల దక్షిణ భారతదేశంలో అనేక నూతన విషయాలు బయటపడగలవు.

కనుకనే డాక్టర్ ఎ సి బర్నెల్ 'ప్రపంచంలోని వ్రాత ప్రతుల గ్రంథాలయాలలో యిది ముఖ్యమైనదనీ, ప్రసిద్ధమైనదనీ, ఇన్ని సంస్కృత వ్రాత ప్రతులు ప్రపంచంలో మరెచ్చట లేవని' వ్రాశారు. జర్మన్ పండితుడు డాక్టర్ బ్లూహార్ 'అత్యంత ఉపయోగకరమైన యిన్ని ప్రసిద్ధగ్రంథాలు ఎంత సొమ్ము వెచ్చించినా ఎచ్చటా లభించవని, కన్నారా చూడటానికైనా దొరకవనీ' వ్రాశాడు. ఇక మనదేశంలోని అనేక మంది కవులకు, పండితులకు అదొక యాత్రాస్థలమైనదంటే దాని విలువను మనం ఊహించుకోవచ్చును.

### ముద్రిత గ్రంథాలు

శరభోజీ కాలంలో ఇంగ్లీషుభాష దక్షిణదేశంలో వ్యాప్తిలోకి వస్తూంది. ఇంగ్లండ్‌లో ప్రచురించిన గ్రంథాలు ప్రచారంలో ఉన్నాయి. శరభోజి సాహిత్యపిపాసి కావడం వలన ముద్రితగ్రంథాలను 4000 వరకు సేకరించారు. వీటిలో

18, 19 శతాబ్దాల కాలంలో అచ్చయిన తొలి, ద్వితీయ ముద్రణలే ఉన్నాయి. హెచ్చుభాగం యింగ్లీషు భాషలో గ్రంథాలున్నప్పటికీ, లాటిన్, గ్రీకు, ఫ్రెంచి, ఇటాలియన్ మొదలైన ప్రపంచ ప్రసిద్ధ భాషలలో 500 గ్రంథాలవరకు ఉన్నవి. ఈ గ్రంథాలన్నిటిని మహారాజు చదివినట్లు వాటిలో గల గుర్తులనుబట్టి తెలుస్తున్నది. అన్నిటిపై మహారాజుగారి సంతకాలున్నవి. టేకు కలపతో చేయబడిన ఎత్తయిన బీరువాలలో అమర్చబడిన యీ పుస్తకాలు ముఖ్యంగా శరీరశాస్త్రం, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, సముద్ర జీవశాస్త్రం, అనేక దేశాల చరిత్రలు, ఆచారాలపై ఉన్నాయి. ఇవి గ్రంథాలయానికి ఒక ముఖ్యమైన ఆకర్షణగా ఉన్నాయి. ముద్రిత గ్రంథాలతోబాటు ఆనాడు ఆంగ్లంలో ప్రచురింపబడిన ప్రముఖమైన పత్రికలు, సంపుటాలు అందంగా బైండుచేయబడి ఉన్నాయి.

## చిత్రాలు

గ్రంథాలతోబాటు శరభోజీ మహారాజు పౌరాణిక సంబంధమైన చిత్రాలను, పక్షులు, జంతువుల చిత్రాలను సంపాదించారు. దాదాపు రెండువందల సంవత్సరాలైనప్పటికీ యిందుపయోగించిన రంగులు నేటికి కాంతిపుంజాలను వెదజల్లుతూనే ఉన్నాయి. ఇవిగాక శరభోజీ రాజావారు మానవ ముఖాకృతులు, పక్షుల, జంతువుల ఆకృతుల నమూనాలను అనేకం సంపాదించారు. నిత్యం గ్రంథాలయానికి వచ్చేవారు ఈ నమూనాలను చూచి ఎంతో ఆనందపడుతుంటారు.

*సూచీకరణ*

శరభోజీ మహారాజుకు వ్రాతప్రతులను సేకరించడం మీద దృష్టి హెచ్చుగా ఉన్నదిగాని వాటిని క్రమబద్ధమైన విధానంలో సూచీకరించే ఆలోచన కలుగలేదని తెలుస్తుంది. డాక్టర్ బర్నెల్ అనే జర్మన్ పండితుడు సంస్కృత గ్రంథాలకు సూచీ తయారుచేశారు. దీనిని 1884లో లండన్ మ్యూజియంవారు ప్రచురించారు. ఆ తర్వాత పి వి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఆధ్వర్యంలో తయారుచేసిన సంస్కృతి గ్రంథాల సూచి 1925-30లో 19 సంపుటాలలో ప్రచురింపబడింది. 1952లో 20వ సంపుటం బయటకు వచ్చింది. తమిళ గ్రంథాలకు సంబంధించిన సూచి 3 సంపుటాలలో 1925-26 లలో ప్రచురింపబడింది. వైద్యగ్రంథాలకు సంబంధించిన నాలుగవ సంపుటం 1965లో వెలువడింది.

తెలుగు గ్రంథాలకు సంబంధించిన వివరణాత్మక సూచి తొలి సంపుటాన్ని ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు 1933లోనూ, మలి సంపుటాన్ని 1965లోనూ ప్రచురించారు. ఈ సూచీల నిర్మాణం పిదప వచ్చిన వ్రాతప్రతులకు ఎప్పటికప్పుడు వివరణాత్మక సూచీలు తయారుచేసి గ్రంథాలయ పాలకవర్గంవారు అనుబంధాలుగా ప్రచురిస్తున్నారు.

*గ్రంథాలయ ప్రచురణ*

దేశంలో అనేక ప్రాంతాలకు చెందిన పండితులు వచ్చి గ్రంథాలయంలో కూర్చుని వ్రాతప్రతులను పరిశీలించడం కష్టం. ఈ విషయాన్ని గమనించి శరభోజి మహారాజు ప్రత్యేక

మైన ముద్రణాలయాన్ని స్థాపించి కొన్ని లిఖితప్రతుల కాంతులు ముద్రితరూపంలో దశదిశల వెదజల్లేటట్లు చేశారు. అయితే ఆ ప్రయత్నం హెచ్చుకాలం కొనసాగలేదు. అలా విడువ బడిన కృషి మరల దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన ఒక వంద సంవత్సరాల పిదప క్రొత్త చివుళ్ళు వేసుకొన్నది. అవిభక్త మద్రాస్ ప్రభుత్వం సహాయంతో కొన్ని సంస్కృత, తెలుగు, తమిళ, మరాఠీ గ్రంథాల ప్రచురణ ప్రారంభమైంది. ఈ సదాశ యానికి భారతప్రభుత్వం చక్కని చేయూతనిచ్చింది. తత్ఫలి తంగా వివిధభాషలలో 1949, 1967 మధ్యకాలంలో 160 గ్రంథాలు అచ్చయినాయి. మరికొన్ని అచ్చు ముచ్చటలు సంతరించుకోడానికి సిద్ధంగా ఉన్నాయి. అతి స్వల్పకాలంలో యింతటి ప్రయోజనాత్మక కృషి సల్పినందుకు పాలకవర్గాన్ని అభినందించక తప్పదు.

## మైక్రో ఫిల్మ

సృష్టిలోని ప్రతి వస్తువు ఏదోరోజుకు నశింపుకాక తప్పదు. విజ్ఞానశాస్త్ర ప్రయోజనాన్ని ఉపయోగించుకొని వాటి ఆయువును మరికొంతకాలం పెంచవచ్చునుగాని కల కాలం బ్రతికేటట్లు చేయలేము. ఒకటి రెండు తరాలకంటె హెచ్చుకాలం భద్రపరచడానికి వీలులేని కాగితం వ్రాత ప్రతులు, తాటియాకు గ్రంథాలు – ఇప్పటివరకు అనేకమంది మహనీయులు కంటికి రెప్పలాగ కాపాడడంవలన, శాస్త్రీయ సంబంధమైన అనేక జాగ్రత్తలు తీసుకొనడంవలన యిప్పటి వరకు చాలభాగం నిలచాయి. కొన్ని క్రిమికీటకాల దంష్ట్రి

గ్రాలకు బలియైపోయినవి. ఏమైనా వీటిని యికముందు హెచ్చుకాలం భద్రపరచడం కష్టమని పలువురు భావిస్తున్నారు.

ఇటీవలే మద్రాస్ ప్రభుత్వ రికార్డ్సు లైబ్రరీకి చెందిన డాక్టరు బాలిగా యీ గ్రంథాలయాన్ని ప్రభుత్వం పనుపున సందర్శించి యిందులోని వ్రాతప్రతులన్నిటినీ వెంటనే ఫిలిం తీయాలని సూచన చేశారు. అందుకు ప్రభుత్వం ఆమోదించి అందులోని 40,000 వ్రాతప్రతులను ఫిలిం తీశాక ఆ యంత్ర పరికరాలనన్నిటినీ ప్రభుత్వ రికార్డు గ్రంథాలయానికి అప్పగించేట్లు ఒక నిర్ణయం చేసినట్లు తెలుస్తుంది.

ఇటీవల యునెస్కోకు చెందిన జాతీయ గ్రంథాలయాలోని మైక్రోఫిలిం యూనిట్ ఒక వారంరోజులపాటు యీ గ్రంథాలయంలో ఉంది. సంస్కృత తమిళ విభాగాలలోని 10 వ్రాతప్రతులను ఫిల్ము తీసింది. ఈ ఫిల్ముల ప్రతులు సంపాదించడానికి, శాశ్వతమైన పరికరాలు సంపాదించడానికి గ్రంథాలయ పాలకవర్గం నిత్యం కృషిసల్పుతోంది.

## ధన్వంతరీ మహల్

తులజాజీ మహారాజు కాలంనుంచో, అంతకుముందు కాలంనుంచో గ్రంథాలయానికి అనుబంధంగా ధన్వంతరీ మహల్ ఉండేదని తెలుస్తుంది. ఇందులో సర్వౌషధాలు భస్మాలరూపంలో, లేహ్యాలరూపంలో సీళ్ళువేసిన సీసాలలో భద్రపరుచబడేవట. భారత ప్రభుత్వం వారి దేశీయ వైద్య పరిశోధక సంస్థవారు 2 రోజులపాటు యీ గ్రంథాలయంలోని

వైద్య వ్రాత ప్రతుల పరిస్థితిని పరిశీలించి వైద్యసంబంధ మైన గ్రంథాల పరిశోధనకు ఒక పరిశోధనా విభాగాన్ని నెల కొల్ప నిశ్చయించింది. ఈ పరిశోధనా విభాగంలో దాదాపు రెండుసంవత్సరాల కాలంలోనే 2000 వైద్య గ్రంథాలను ఆయుర్వేద, అల్లోపతి, సిద్ధ, యూనాని వైద్యవిధానాలలో ఆరితేరిన పండితులు పరిశోధించి 18 సంపుటాలలో "శరభేంద్ర వైద్య మురైగళు" పేరున సిద్ధంచేశారు. వీటిలో కాన్సర్, క్షయ, మధుమేహం మొదలైన దీర్ఘవ్యాధులకు నివారణో పాయాలు సూచింపబడ్డాయి.

గ్రంథాలయాభివృద్ధి

ఏమైనప్పటికీ దాదాపు మూడు శతాబ్దాల కాలంనాడు సంగీత సాహిత్య సరస్వతులు నిండు పేరోలగమున కొలువున్న తెలుగు ప్రభువులచే స్థాపించబడి, మహారాష్ట్ర ప్రభువులచే ఊహించిన ప్రమాణాలలో పెంచబడిన యీ గ్రంథాలయం యీనాడు తమిళ సోదరుల పాలనలో సాగబడుతూ ఉంది. పాలన ఎవరిదైనా జ్ఞానం విశ్వజనీనమైనది.

దీనిలోని వ్రాత ప్రతుల రక్షణకు భారత ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రత్యేకమైన శ్రద్ధవహించవలసి ఉంది. పాట్నాలోని ఖుదాబక్ష్ గ్రంథాలయంవలె దీనికి జాతీయ ప్రతి పత్తి లభించేటట్లు భారత ప్రభుత్వం చూడవలసియుంది. ప్రత్యేకమైన పరిశోధనా విభాగాలను ఏర్పరచి వ్రాత ప్రతులను శోధించి ముద్రణకు సిద్ధం చేయవలసియుంది. ఈ పని ఎంత త్వరగా జరిగితే అంత మంచిది.

# ఖుదాబక్ష్ ప్రాచ్య గ్రంథాలయం

# 6

చిరకాలంగా బీహార్ కవి పండితుల పోషణకు, చదువు సాములకు ప్రసిద్ధిగన్న రాష్ట్రం. క్రీస్తు శకం నాలుగవ శతాబ్దం లోనే అచట స్థాపించబడిన నలందా విశ్వవిద్యాలయం ప్రపంచ వ్యాప్తంగా జిజ్ఞాసువులను ఆకర్షించింది. తత్త్వశాస్త్రం, మతం, వైద్యశాస్త్రం మొదలైన విషయాలపై యీ విద్యాలయంలో అధ్యయనం, అధ్యాపనం నిరంతరం జరుగుతుండేది. రత్నరంజిక, రత్నసాగర, రత్నోదధి మొదలైన పేర్లుగల తొమ్మిదంతస్తుల భవనాలలో ఆ విశ్వవిద్యాలయం ఉండేది. అందొకదానిలో బోధనకు అవసరమైన అపూర్వ వ్రాతప్రతులు గల ప్రసిద్ధగ్రంథాలయం గూడ ఉండేది. కాని పన్నెండో శతాబ్దం వచ్చేటప్పటికి మతదురహంకారుల కరాళదంష్ట్రి లకు యీ పవిత్ర సంస్థ గురయి, మట్టిలో కలిసిపోయింది. అంతటితో దివ్య జ్యోతి వెడలగక్కిన కాంతిరేఖలు త్వర లోనే మసక చీకటిలో మాయమయ్యాయి.

మహనీయమైన ఆ ప్రాచీన సంస్కృతికి ప్రతీకగా ఆ తరువాత తరాలలో సాహిత్యప్రియులు, సంస్కారులు బీహారు రాష్ట్రంలో ఉంటూవచ్చారు. ఉత్తమ సాహిత్య సేకరణలో, పోషణలో అభిరుచి కనబరుస్తూ వచ్చారు. ఈ కోవకు చెందిన ఉన్నత కుటుంబాలలో ఖుదాబక్ష్ కుటుంబం ఎన్నదగినది.

ఇందులోని మహమ్మాద్ బక్షీ శ్రీమంతుడు. సాహిత్య, చిత్ర లేఖనప్రియుడు. తన సంపాదనలోని హెచ్చుధనాన్ని పుస్త కాల సంపాదనకోసం వినియోగించాడు.

మొగల్ గ్రంథాలయం

ఢిల్లీలో మొగలాయి పాదుషాలు అపూర్వమైన వ్రాత ప్రతులు సంపాదించి 16వ శతాబ్దంనాటికే మంచి గ్రంథాల యాన్ని స్థాపించారు. 18వ శతాబ్దం వరకు యీ గ్రంథాలయం ఎన్ని చేతులు మారినప్పటికీ చెక్కుచెదరకుండా ఉంది. ఆ శతాబ్దంలోనే మొగల్ గ్రంథాలయం ఔధ్ నవాబుల చేతు ల్లోకి పోయింది. 1857లో జరిగిన సిపాయి కలహంతో ఢిల్లీ, లక్నోల ప్రతిష్ఠ మంటగలసిపోయింది. సంపన్నమైన మొగల్ గ్రంథాలయం ఛిన్నాభిన్నమై పోయింది.

ఇంగ్లీషు వారితో చేతులు కలిపిన రాంపూర్ నవాబు యీ గ్రంథాలయంలో చాలభాగాన్ని సిపాయీలద్వారా సంపాదించాడు. నేటికి యిది రాంపూర్ గ్రంథాలయంగా పనిచేస్తూన్నది. మొగల్ గ్రంథాలయంలో మిగిలినభాగం ఖుదాబక్షీ కుటుంబానికి దక్కింది. 1876లో మహమ్మాద్ బక్షీ చనిపోయేనాటికి వారివద్ద 1400 వరకు అపూర్వమైన వ్రాత ప్రతులు చేరాయి.

1842 ఆగష్టు 2వ తేదీన జన్మించిన ఖుదాబక్షీఖాన్ తండ్రి చెప్పుచేతలలో పెరిగాడు. పాట్నాలో ప్రసిద్ధుడైన లాయర్‌గా రాణించడమేగాక ఉర్దు, అరబిక్, పర్షియన్ భాష

లలో మంచి పాండిత్యాన్ని సంపాదించాడు. అపురూప గ్రంథా లను సేకరించడంలో తండ్రిని మించిన వాడనిపించుకున్నాడు. అరబిక్ పర్షియన్ వ్రాతప్రతులలో ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన ఖుదాబక్ష్ ప్రాచ్యపౌరగ్రంథాలయాన్ని పాట్నాలో స్థాపించ డానికి ప్రధానకారకుడయ్యాడు.

మహమ్మద్ మాక్వి

రాంపూర్ నవాబులకు, ఖుదాబక్ష్ కుటుంబానికి చాల కాలంగా కలహాలుండేవి. ఎట్టకేలకు ఖుదాబక్ష్ యీ తగాదా లలో జయించాడు. ఈ జయంతోబాటు మహమ్మద్ మాక్వి అనే అరబ్ దేశీయుడు ఖుదాబక్ష్ వశమైనాడు. మారు మూలలలోని వ్రాత ప్రతులను సంపాదించడంలో మహ మ్మద్ మాక్వికి గొప్ప నిపుణత్వం ఉండేది. అందుచేత ఖుదాబక్ష్ కేవలం అపురూపమైన వ్రాత ప్రతులు సేకరించడం కోసం నెలజీతం, ప్రత్యేకమైన కమీషన్ మీద దాదాపు 18 సంవత్సరాలపాటు ఉద్యోగిగా మాక్విని నియమించాడు. మాక్వి సిరియా అరేబియా, ఈజిప్టు, పర్షియా ఇరాన్ మొదలైన దేశాలు, తిరిగి ఎన్నో వ్రాతప్రతులను సంపాదించాడు. మాక్విని "జ్యూయల్ అమాంగ్ బుక్ హంటర్స్" అంటారు.

వ్రాతప్రతులను అమ్మడానికి స్వయంగా వచ్చినవారికి కోరినంత డబ్బు యివ్వడమేగాక, రైల్వేచార్జీలకు రెట్టింపు ఉచితంగా దారిఖర్చులకు యిచ్చేవాడు. ఈ విధంగా ఖుదా బక్ష్ ఖాన్ పేరు వ్రాతప్రతులు కొనడంలో ప్రసిద్ధుడని దేశం నలుమూలలా ప్రాకిపోయింది.

ఒకసారి పుస్తకాల బైండరు ఖుదాబక్ష్ యింట్లోనుండి ఉత్తమ గ్రంథాలను తస్కరించి, వ్రాతప్రతులను మారుబేరం చేస్తూండే లోహోర్‌లోని ఒక వ్యాపారివద్దకు పంపించాడు. కాని వ్యాపారి ఆ గ్రంథాలను పుస్తకాలంటే అవ్యాజాను రాగంగల ఖుదాబక్ష్ వద్దకే మరల కొనుగోలుకు పంపించాడు. పేచీలు పెట్టకుండా తగిన వెలయిచ్చి ఖుదాబక్ష్ రెండవసారి గూడ ఆ గ్రంథాలను ఆప్యాయత కొన్నాడు! దీనినిబట్టి ఉత్తమగ్రంథాలను సేకరించడంలో ఖుదాబక్ష్‌కిగల పట్టుదల, అనురాగం మనకు బోధపడగలదు.

*గ్రంథాలయ భవనం*

తన స్వార్జితమైన అపారధనాన్ని ఖుదా బక్ష్ ఖాన్ గ్రంథాలయంకోసం వినియోగించాడు. ఇల్లంతా వ్రాతప్రతులతోనే నిండిపోయింది. గ్రంథాలయంకోసం ప్రత్యేకమైన భవనం నిర్మించాల్సిన అవసరం ఏర్పడింది. అప్పుడు లక్ష రూపాయల వ్యయంతో దివ్యమైన భవనం పాట్నాలో గంగా నది ఒడ్డున నిర్మించి 1888లో ఇంటగల గ్రంథాలయాన్ని ఆ భవనంలోకి తరలించారు.

అంతగా పెరిగి పెద్దదైన గ్రంథాలయాన్ని నిర్వహించడం ఒక్క వ్యక్తికీ కొంత కష్టమైనపనే అయింది. పాట్నాలో నల్లమందు వ్యాపారానికి ఏజంటుగా ఉన్న క్యాంప్‌బెల్‌ను యీ గ్రంథాలయాన్ని ప్రభుత్వదృష్టికి తీసుకువెళ్ళవలసినదిగా కోరాడు. అదే సంవత్సరంలో అరబ్బీ భాషలో అపారమైన పాండిత ప్రతిభగల సర్ చార్లెస్ లైయాల్ యీ గ్రంథాల

యాన్ని చూచి, యిచటగల వ్రాతప్రతులను పరిశీలించి దీనికి సహాయం చేయవలసిన అవసరాన్ని గురించి ప్రభుత్వంతో నొక్కి చెప్పాడు. లైయాల్ అభ్యర్థనను ప్రభుత్వం అంగీకరించి ఆ గ్రంథాలయానికి ఆర్థికంగా సహాయపడడానికి నిర్ణయించింది. తత్ఫలితంగా ఖుదాబక్ష్ ప్రాచ్యగ్రంథాలయంగా దానిని 1891లో గవర్నర్‌గా ఉన్న సర్ ఛార్లెస్ యిలియిట్ ప్రారంభించారు. తదుపరి గ్రంథాలయ నిర్వహణ ఒక పాలకవర్గానికి అప్పగించబడింది. వాస్తవానికి యీ గ్రంథాలయాన్ని ఖుదా బక్ష్ పేరు ముందుంచడం వారికిష్టంలేదు. కాని అభిమానుల బలవంతం మీద అందుకు అంగీకరించారు.

గ్రంథప్రదానాలు

ఖుదాబక్ష్ కుమారుడు సలాహుద్దీన్ ఖుదాబక్ష్ తండ్రి, తాతలవలె సాహిత్యాభిలాషగల వ్యక్తి. ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ భాషలతోబాటు పర్షియన్, ఉర్దూ సాహిత్యాలలో మంచి పండితుడు. అతడు అనేక దేశాలనుండి సేకరించిన ముద్రిత గ్రంథాలన్నిటినీ యీ గ్రంథాలయానికి ఉచితంగా యిచ్చివేశాడు. ఇవి ముద్రితగ్రంథాలే అయినప్పటికీ 16, 17 శతాబ్దాల నాటివి గూడ ఉన్నందున, వ్రాతప్రతులకున్నంత విలువ వీటికీ ఉన్నది.

ఆ తర్వాత 1961లో ఆల్ ఇస్లాం గ్రంథాలయం తాలూకు సుమారు 7 వేల గ్రంథాలు యీ గ్రంథాలయానికి ఉచితంగా యివ్వబడినవి. ఇవన్ని "దేశ్నా సంకలనాల" పేరుతో అందు ప్రత్యేక విభాగంగా పెట్టబడినది. ఈ

సంకలనాలలో 19 శతాబ్దంలో వెలువడిన పత్రికల తాలూకు సంపుటాలు ఒక ప్రత్యేకత కలిగి ఉన్నాయి.

గ్రంథసంపద

మొత్తం మీద యీ గ్రంథాలయంలో యీనాటికి ముద్రితా ముద్రిత గ్రంథాలు అపారంగా, చేరినవి. ముద్రిత గ్రంథాలు, పత్రికల సంపుటాలు 40 వేలకు పైగా ఉన్నవి. ఈ గ్రంథాలయం ముఖ్యంగా వ్రాతప్రతులకు ప్రసిద్ధిచెందినది. అందుచేత అవి యీ దిగువరీతిలో ఉన్నవి.

| | |
|---|---|
| పర్షియన్ వ్రాతప్రతులు | 4184 |
| అరబ్బీ వ్రాతప్రతులు | 4221 |
| ఉర్దూ వ్రాతప్రతులు | 243 |
| టర్కీ వ్రాతప్రతులు | 20 |
| హిందీ సంస్కృత వ్రాతప్రతులు | 35 |
| తాలూకు గ్రంథాలు | 200 |
| చిత్రాలు | 700 |

ముద్రిత గ్రంథాల వివరణలు సుమారు యీ తీరుగా ఉన్నాయి.

| | |
|---|---|
| అరబిక్, పర్షియన్, ఉర్దూ ముద్రిత గ్రంథాలు | 24044 |
| ఆంగ్ల ముద్రిత గ్రంథాలు | 10,000 |
| ఫ్రెంచి ముద్రిత గ్రంథాలు | 900 |
| జర్మన్ ముద్రిత గ్రంథాలు | 1000 |
| స్పానిష్, లాటిన్, ఇటాలియన్ భాషలు | 50 |
| పత్రికల సంపుటాలు | 6000 |

వ్రాతప్రతులలో 1269లో ప్రపంచ ప్రఖ్యాత లేఖకుడు యాకత్ అలీ ముస్తాకాసీచే వ్రాయబడిన పవిత్ర కొరాన్, ఇంకా షహన్‌షానామా, షాద్‌షానామా, షానామాదివానే ముస్తఫి మొదలైన పవిత్ర గ్రంథాలు – ఒక్కొక్కటి పదెనిమిదివందల సంవత్సరాలనాడు అపూర్వమైన రీతిలో వ్రాయబడినవి. ఇవి యీ గ్రంథాలయానికి అలంకారాలు.

*గ్రంథాలయసూచి*

గ్రంథాలయములోని సంచయానికి దర్పణంవలె సూచి ఉన్నప్పుడే ఆ సంపదను నలుగురూ ఉపయోగించుకొని ప్రయోజనం పొందడానికి వీలుంది. పండితుల, గ్రంథపాలకుల సాయంతో యీ గ్రంథాలయంలోని అరబిక్, పర్షియన్ వ్రాతప్రతులను 32 సంపుటాలలో వివరణాత్మకమైన సూచి ప్రచురింపబడినది. మరో మూడు సంపుటాలు ముద్రణకు సిద్ధంగా ఉన్నవి. ఇవిగాక కేవలం అరబ్బీ వ్రాతప్రతుల పట్టిక మూడు సంపుటాలతోనూ, పర్షియన్ వ్రాతప్రతుల పట్టిక రెండు సంపుటాలతోనూ, ఉర్దూ వ్రాతప్రతుల పట్టిక ఒక సంపుటంలోనూ తయారుచేయబడి ముద్రణకు సిద్ధంగా ఉన్నాయి. ఈ ముద్రణ పూర్తయిననాడు గ్రంథసంపద మరింత హెచ్చుగా ఉపయోగించుకోడానికి వీలుగా ఉంటుంది.

*గ్రంథాలయ సేవ*

ముఖ్యంగా అరబిక్, పర్షియన్ భాషలలోని వ్రాత ప్రతుల ఆధారంతో పరిశోధన చేయదలచుకున్నవ్యక్తి విధిగా యీ గ్రంథాలయానికి రాక తప్పదు. ముద్రిత గ్రంథాలు

అనువుగా యివ్వబడతాయి. వ్రాతప్రతులను మాత్రం విధిగా అచ్చుటకువచ్చి చూడవలసినదే. అందుకు గ్రంథాలయంలో మంచి వసతులున్నాయి. ఇటీవల కాలంలో చదువరి కోరిన వ్రాతప్రతికి సరసమైన చార్జీతో మైక్రోఫిల్ము తీసియిచ్చే అవకాశంగూడ కల్పించబడింది. దీనివలన ప్రపంచంలో ఏ మూల నుంచయిన కోరిన వ్రాతప్రతి తాలూకు మైక్రోఫిల్ము సంపాదించి వినియోగించుకోనవచ్చును.

### కేంద్రప్రభుత్వ గుర్తింపు

ఈ గ్రంథాలయాన్ని అభివృద్ధి చేయవలెనను తలంపు కేంద్రప్రభుత్వానికి కలిగి 1962 అక్టోబరు 16వ తేదీనుండి జాతీయస్థాయిగల సంస్థగా గుర్తించింది. పాలకవర్గ నిర్మాణంలో మార్పులుచేసి హెచ్చుస్థాయిలో పాలకవర్గాన్ని ఏర్పాటు చేసింది. ఈ నూతనమైన ఏర్పాటువలన బీహార్ రాష్ట్రప్రభుత్వం ఏటా రు 50 వేలు గ్రాంటు యివ్వవలసి ఉంటుంది. గ్రంథాలయ నిర్వహణకు, దానిని ఆధునికంగా అభివృద్ధి చేయడానికి అయ్యేఖర్చులు కేంద్రప్రభుత్వం భరిస్తుంది. ఈ అమరిక జరిగిన పిదప గ్రంథాలయం మరింత బాగా అభివృద్ధి చేయబడింది. దేశ, విదేశాలలోని పరిశోధకులకు అపారంగా ఉపయోగపడుతోంది.

దక్షిణదేశంలోని తంజావూరులోని సరస్వతీమహాల్ గ్రంథాలయం రాజుల ప్రోత్సాహపరంగా ప్రారంభమైతే, యీ గ్రంథాలయం ఉత్తరాదిన సంస్కారవంతమైన ఒక

కుటుంబపు ఆదరంతో అభివృద్ధిచెందింది. వివిధ భాషలలో, వివిధ విషయాలపైగల వ్రాతప్రతుల భద్రతకు యీ రెండు గ్రంథాలయాలు భారతదేశానికి ప్రత్యేక అలంకారాలు, భారతీయ సంస్కృతీ సంపన్నతకు ప్రతిబింబాలు.

—

# లాల్భాయి దల్పత్భాయి విద్యామందిరం

## 7

ప్రారంభించి పట్టుమని పాతికేళ్ళయినా కాలేదు. ప్రాచీన సంస్కృతీ ఛాయలను విరజిమ్మడంలో అహమ్మదాబాదులోని లాల్భాయి దల్పత్భాయి ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇండాలజీ అపారమైన కీర్తి ప్రతిష్ఠలను సంతరించుకొన్నది. స్థానికంగా యీ సంస్థను లాల్భాయి దల్పత్భాయి భారతీయ సంస్కృత విద్యామందిర్ అని పిలుస్తారు. భారతీయ, పాశ్చాత్య ప్రాచ్యసాహిత్యాలకు వారధిగా, ముఖ్యంగా జైన, బౌద్ధ వాఙ్మయాలకు పెన్నిధిగా యీ సస్థ వర్ధిల్లుతోంది. ఈ విషయంలో దీనికి సమఉజ్జీగల సంస్థ భారతదేశంలో మరొకటి లేదు.

జైన వాఙ్మయంలో మహాపండితుడు మునిశ్రీ పుణ్యవిజయీజీ తన వద్దగల పదివేల వ్రాతప్రతులు, ఏడువేల ముద్రిత గ్రంథాలతో యీ సంస్థను 1957లో స్థాపించారు. అదృష్టవశాత్తూ యీ సంస్థను కస్తూర్భాయి లాల్భాయి, వారి కుటుంబ సభ్యులు ధర్మనిధి ద్వారా భవననిర్మాణానికి తోడ్పడ్డారు. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు కొంతవరకు తోడ్పడ్డాయి. అపురూపమైన శిల్పవిన్యాసంతో యీ సంస్థ నిర్మించిన సుందరభవనాన్ని భారతప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూ 1971లో ప్రారంభించారు. జపనీస్ పద్ధతిలో రూపొందించిన

ఉద్యానవనం యిచట ఒక ప్రత్యేకత. ముఖ్యంగా యీ సంస్థ ప్రారంభించిన తొలి రోజులనుంచి గుజరాత్‌లో మహా విద్వాంసులు, సుప్రసిద్ధ పరిశోధకులు డాక్టరు హరిప్రసాద్ శాస్త్రి, కె కె శాస్త్రి, డాక్టరు జెట్టి మొదలైన వారిసంపూర్ణ సహకారం లభించింది. పైగా గుజరాత్, ప్రాచీన చరిత్రకు, సంస్కృతీ సంపన్నతకు పెట్టింది పేరు. ఇచటగల ప్రాచీన శాసనాలు, రాగిరేకులు, దానపట్టాలు, వ్రాతప్రతులు అపారం. ఈ అమూల్య సంపదను సేకరించి సద్వినియోగపరచిన భవిష్యత్తును సుందరంగా మలచుకోవచ్చుననీ, సంస్కృతీ విజయ పరంపరను నాలుగు కాలాలపాటు కొనసాగించవచ్చుననీ వారి నమ్మకం.

*వ్రాతప్రతుల సంకలనాలు*

ఈ పవిత్రోద్దేశంతో వాడవాడలా గాలించి 40,000 వ్రాతప్రతులు, 20,000 ముద్రిత గ్రంథాలు సంపాదించారు. వీటిలో 200 వ్రాతప్రతులు సచిత్రాలు. ఇందుగల విషయాలలో వేదాలు, ఆగమాలు, తంత్రాలు, జైనదర్శనాలు, భారతీయ తత్త్వశాస్త్రం, వ్యాకరణం, ఛందస్సు, అలంకార శాస్త్రం, నిఘంటువులు, వైద్యశాస్త్రం అనేకం ఉన్నాయి. ఇవన్నీ సంస్కృతం, ప్రాకృతం, ప్రాచీన గుజరాతీ, హిందీ, రాజస్థానీ భాషలలో ఉన్నాయి.

*వినియోగం*

ఇటీవలి కాలంలో యీ వ్రాతప్రతులకు నాలుగు సంపుటాలలో సూచీ తయారుచేయబడింది. వ్యక్తిగతమైన

హామీతో యిందలి వ్రాత ప్రతులను అరువుగా యిచ్చే ఏర్పాటున్నది. గుజరాత్ విశ్వవిద్యాలయం యీ సంస్థను సంస్కృతం, ప్రాకృతం, భారతీయ సంస్కృతిపై పరిశోధనలు చేయడానికి అనువైన సంస్థగా గుర్తించాక యిచటి గ్రంథాలయం ఉపయోగం బాగా పెరిగింది. ఏటా 10 మందికి పైగా పరిశోధనలు జరుపుతున్నారు. పైగా యీ మధ్యకాలంలో భారతీయ విషయాలను తెలుసుకొనగోరు విదేశీయుల సంఖ్య బాగా పెరిగింది.

ఈ మధ్యకాలంలో వ్రాతప్రతులకు మైక్రోఫిల్ము తీసి విదేశాలలో కోరినవారికి పంపించే సదుపాయం కల్పించబడింది.

అపురూప వస్తు సంచయం

ఉత్తమ గ్రంథాలయంతోబాటు యీ సంస్థకు అపురూప వస్తుసంచయం సేకరింపబడింది. 7వ శతాబ్దంలో తయారు చేసిన మొదటి జైన తీర్థంకరుని కాంశ్య విగ్రహం యిందు ఒక ప్రత్యేకత. ఇప్పుడైతే దాని వెల అయిదారు లక్షల రూపాయలు ఉండొచ్చు. 7, 8 శతాబ్దాలనాటి నగలు, నాణేలు, దంతపు సామగ్రి, కొయ్యమీద వేయబడిన చిత్రాలు అనేకం కలవు. వీటితోబాటు వైకుంఠపాళీ చిత్రాలు, జైన తీర్థంకరుల పాలరాతి విగ్రహాలు ప్రత్యేక ఆకర్షణలు.

శ్రీ విజయాజీ

ఈ సంస్థ ప్రారంభించి పెట్టని కోటగా సహాయపడుతున్న అపూర్వ వ్యక్తి, సేవాపరాయణుడు, నిస్వార్థజీవి మునిశ్రీ

పుణ్యవిజయాజీ. వారు 14వ ఏట సన్యసించి సంస్కృత, ప్రాకృత భాషల్లో జైన బౌద్ధ వాఙ్మయాల్లో సాధికారమైన విజ్ఞానాన్ని సంపాదించారు. గుజరాత్‌లో ఉంటూ తన అమూల్యమైన కాలాన్ని జైన భాండాగారాలను పునరుద్ధించడంలో అపారమైన కృషిచేశారు. ముద్రణ నోచుకోని వ్రాత ప్రతి ఎక్కడ కని పించినా దానిని సంపాదించడానికి ప్రయత్నించేవారు. దాని నకలు వ్రాసుకొని కావలసిన వారికి అనాసక్తంగా అందజేసే వారు. తాను స్థాపించిన సంస్థకు సర్వవిధాల తోడ్పడి, 1971లో తనువు చాలించారు.

*ముందు కార్యక్రమం*

ఈ సంస్థ స్థాపించిన సత్సంకల్పబలంచేత జైన బౌద్ధ వాఙ్మ యాలను కూలంకషంగా అధ్యయనం చేసిన డాక్టరు దాల్ సుఖ్భాయి మాల్వానియా నేడు డైరెక్టరుగా ఉంటూ యీ సంస్థను అపూర్వ విజ్ఞాన మందిరంగా తీర్చిదిద్దుతున్నారు. ప్రాచీన వాఙ్మయాన్ని సద్వినియోగం చేయడానికి అనేక పథ కాలను సిద్ధం చేశారు. వాటిలో ప్రాకృత వాఙ్మయంలో సాంకేతిక పదనిఘంటువు ముఖ్యమైనది. ప్రాకృత సాహిత్యం లోని నామవాచకాల నిఘంటువును యింతకుముందే సిద్ధం చేశారు. ప్రాచీన వాఙ్మయంలో కృషిచేసిన కవిపండితులచే తరచు ఉపన్యాసాలు ఏర్పాటుచేస్తున్నారు.

ఉత్తర భారత దేశంలో ప్రాచీన వాఙ్మయ పరిరక్షణకు లాల్భాయి దల్పత్భాయి భారతీయ సంస్కృతీ విద్యామందిరం ఎంతగానో తోడ్పడుతున్నది. గతాన్ని తెలుసుకొని, వర్త మానాన్ని సుందరంగా తీర్చిదిద్దుకోడానికి యీ సంస్థ శ్రీరామ రక్షగా ఉంటోంది.

# ఢిల్లీ పౌర గ్రంథాలయం

# 8

ఢిల్లీ పౌర గ్రంథాలయం స్థాపించబడి యిప్పటికి నిండుగా రెండు దశాబ్దాలు కూడ కాలేదు. ఐనా అతి తక్కువ కాలంలో యీ గ్రంథాలయం భారత గ్రంథాలయ చరిత్రలో సమున్నత స్థానం ఆక్రమించుకొన్నది. ఆసియాలో అపారమైన ఉపయోగంగల ప్రసిద్ధ గ్రంథాలయంగా ఎంచ బడుతూ ఉంది. పుస్తకాలను అరువు యివ్వడంలో ప్రపంచ ప్రఖ్యాతగ్రంథాలయాలలో ఒకటిగా గుర్తించబడుతోంది. ఢిల్లీ నగరంలోనూ, పరిసర ప్రాంతాలలోనూ పౌరులకు అపారంగా కృషిచేస్తూంది. ఆదర్శ గ్రంథాలయ నిర్వహణ విధానాన్ని ప్రయోగాత్మకంగా చేసి గ్రంథాలయ ప్రపంచానికి వెలుగు చూపుతోంది. అందుచేత దీని నిర్వహణ విశేషాలు అందరూ తెలుసుకోవాల్సిన అవసరం కనబడుతోంది.

తొలిదశ

ప్రపంచ విజ్ఞాన పరిషత్తు (యునెస్కో) 1949లో పారిస్‌లో సమావేశమైనపుడు ప్రాథమిక విద్యాప్రచార నిమిత్తం సభ్య దేశాలలో గ్రంథాలయాలను స్థాపించడానికి ఒక తీర్మానం చేసింది. ఈ తీర్మానాన్ని అనుసరించి భారత ప్రభుత్వం మన దేశంలో ఒక గ్రంథాలయాన్ని స్థాపించవలసినదిగా అర్థిం చింది. అందుకు యునెస్కో సమ్మతించి దీని స్థాపన ఒక ఒడం

బడిక తయారుచేయడానికి అనుకూలాలు పరిశీలించడానికి ఐ యస్ పేటర్సన్ అను గ్రంథాలయ నిపుణుని భారతదేశానికి పంపింది. ఈయన భారత ప్రభుత్వంతో సంప్రదించిన మీదట తయారుచేయబడిన ఒడంబడికమీద 1950 ఫిబ్రవరి మాసంలో సంతకాలు జరిగాయి. భారత ప్రభుత్వం, ప్రపంచ విజ్ఞాన పరిషత్తు సంయుక్త ఆధ్వర్యంలో ఢిల్లీలో పౌర గ్రంథాలయం స్థాపించడానికి నిర్ణయం జరిగింది.

ఇందుకు తొలి ప్రయత్నంగా గ్రంథాలయ సేవయందు అపారమైన ఉత్సాహం, అపూర్వమైన ప్రేమగల డి ఆర్ కాలియాగారిని డైరెక్టరుగా నియమించింది. గ్రంథాలయ శాస్త్రంలో అధునాతన విధానాల పరిశీలించడానికి ఉన్నత విద్య నభ్యసించడానికి అమెరికా, యూరప్ దేశాలకు పంపించింది. కాలియాగారు 1951 ఫిబ్రవరిలో తిరిగి వచ్చాక పని చాల చురుకుగా సాగింది. గ్రంథాలయం ప్రారంభించడానికి అన్ని ఏర్పాట్లు చేయబడ్డాయి. 1951 అక్టోబరు 27వ తేదీన భారత ప్రధానమంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూజీచే యీ గ్రంథాలయం ప్రారంభించబడింది.

*క్రమాభివృద్ధి*

ఈ గ్రంథాలయం ప్రారంభించిన వేళావిశేషం చేతనో, స్థాపకుల సదాశయం చేతనో యీ గ్రంథాలయం ప్రారంభించినప్పటినుండీ దీని అభివృద్ధి మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లుతోంది. ఒక చిన్న భవనంలో 1700 పుస్తకాలతో మాత్రం ప్రారంభించబడిన యీ గ్రంథాలయం యీనాడు

విశాలమైన భవనాన్ని ఆక్రమించింది. మూడున్నర లక్షల పుస్తకాలను సంతరించుకొన్నది. పిన్నలకు, పెద్దలకు, అంధులకు, ఖైదీలకు, పారిశ్రామికులకు, కళాకారులకు అనేక ప్రత్యేక శాఖలు ఏర్పరచినది. భారత గ్రంథాలయోద్యమానికి నవ తేజాన్ని అన్ని కోణాలలోనూ అందజేస్తూంది.

## గ్రంథాలయ సేవ

ఉపయోగం విషయంలో భారతదేశంలో యీ గ్రంథాలయం ప్రప్రథమ స్థానాన్ని ఆక్రమిస్తుంది. పుస్తకాల సంపదలో యీ గ్రంథాలయాన్ని మించినది లేకపోలేదు. కాని వినియోగంలో దీనిని మించినది లేదు. ఇందు పుస్తకాలను ఇండ్లకు అరువుగా తీసుకొని వెళ్ళే సభ్యులసంఖ్య ఒక లక్షా యాభై వేలున్నారు. రోజుకు ఎనిమిదివేల పుస్తకాలు అరువుగా యివ్వబడుతున్నాయి. రోజుకు ఐదువేలమంది గ్రంథాలయాన్ని సందర్శిస్తున్నారు. దీనినిబట్టి యీ గ్రంథాలయం ఢిల్లీ ప్రజల పౌర జీవితంలో ఎలా యిమిడిపోయిందో మనం ఊహించుకోవచ్చు. ఇందు సభ్యుడు చేరడానికి ప్రత్యేకమైన ధరావతు చెల్లించనవసరంలేదు. నగర పాలక సభ్యులు, శాసనసభ్యులు గజెటెడ్ ఆఫీసర్లు విద్యాలయాలఅధిపతులనుండి ఒక హామీ పత్రం (గ్యారంటీ) తెస్తే చాలు సభ్యులుగా చేరవచ్చు. పుస్తకాలను అరువుగా తీసికొని వెళ్ళవచ్చు. పుస్తకాలు చదువరికి ఎంతో ఉపయోగంగా ఉండే రీతిలో అమర్చబడ్డాయి. స్వేచ్ఛోపలబ్ధి వలన ప్రతి చదువరి సరాసరి తనకు నచ్చిన విభాగానికి వెళ్ళి కోరిన విషయంలో పుస్తకాన్ని

తీసుకోడానికి అవకాశం ఉంది. అంతటి ఉదాత్తమైన అమరిక వలన పుస్తకాలను తస్కరించే వారికి అవకాశం హెచ్చుగా లేకపోలేదు. ఇచట దాదాపు రోజుకు 8 పుస్తకాలదాకా పోతున్నాయి. ఎక్కడికక్కడ పుస్తకాలను బీరువాలలో తాళాలతో బంధించి వాటిని కలకాలం భద్రపరచే ఉపాయం యీ గ్రంథాలయ పాలకవర్గానికి తట్టకపోలేదు. కాని భద్రతా సంబంధమైన ఏర్పాట్లు హెచ్చుగా చేసేకొద్దీ పుస్తకాల వాడుక తగ్గిపోయే ప్రమాదం ఉంది. అందుచేత కొద్దిగా నష్టం జరుగుతున్నప్పటికీ స్వేచ్ఛోపలబ్ధిలోగల అపూర్వ ప్రయోజనాన్ని గమనంలో ఉంచుకొని దీనిని యిప్పటికీ ఎప్పటికీ కొనసాగించే ప్రయత్నంలో ఉన్న ఆ గ్రంథాలయ పాలక వర్గాన్ని మనసారా అభినందింపక తప్పదు. ఈ విధంగానే యీ గ్రంథాలయంలోని ప్రతి విభాగం ఒక ప్రత్యేకతను ఒక విశిష్టతను కలిగి ఉంది.

*సాంకేతిక సమాచార విభాగం*

ఢిల్లీలోనూ, పరిసరప్రాంతాలలోనూ యిటీవలికాలంలో వాణిజ్యానికి పరిశ్రమలకు, పరిశోధనకు ఆటపట్టయింది. వీరి నిత్యకార్యకలాపాలకు అవసరమైన సమాచారాన్ని సత్వరం అందజేసేందుకు వాణిజ్య పారిశ్రామిక విభాగాన్ని యిటీవల కేంద్ర విద్యామంత్రి డాక్టర్ త్రిగుణ్ సేన్ ప్రారంభించారు. ఈ విభాగం నుండి వాణిజ్యానికి, పరిశ్రమలకు, పరిశోధనకు అవసరమైన సమాచారం ఎప్పటికప్పుడు టెలిఫోన్ ద్వారా గాని, వ్రాతపూర్వకంగాగాని అందజేయబడుతూంది. ఆధునిక

గ్రంథాలయ విభాగంలో యీ విభాగానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది.

*కళా, సంగీత విభాగం*

పిన్నలలో పెద్దలలో కళాభిరుచిని పెంపొందించేందుకు యీ గ్రంథాలయం తొలినుండీ కృషిచేస్తూంది. చిత్రలేఖనంపై అనేక అపూర్వ గ్రంథాలు, గ్రామఫోన్ రికార్డులు సేకరిస్తూ వచ్చింది. ఈ తాలూకు వస్తుసంచయం బాగా పెరిగి ప్రత్యేకంగా ఒ విభాగం ఏర్పరచవలసిన అవసరం ఏర్పడింది. రెండేళ్ళక్రితం ఆ పని జరిగాక భారతీయ కళలపై, పశ్చిమదేశ కళలపై అనేక అపురూప గ్రంథాలు తెప్పించబడినవి. ఈ కళాసంబంధమైన గ్రంథాలలో అరువుకు యిండ్లకు యివ్వబడేవి తక్కువగా ఉంటాయి. అధికభాగం అచట ఉండి, ఉపయోగించుకోనవలసిందే. గ్రామఫోన్ రికార్డులు మాత్రం అరువుగా యివ్వబడతాయి. ఫ్రేములు కట్టిన చిత్రాలు విద్యాసంస్థలకు మాత్రం అరువుగా యివ్వబడతాయి.

*బాలల విభాగం*

దాదాపు గ్రంథాలయ ప్రారంభంనుంచీ యీ విభాగం ఎంతో విజయవంతంగా పనిజేస్తుంది. పిల్లలకోసం ప్రత్యేకమైన కుర్చీలు, బల్లలు, బీరువాలు, పుస్తకాలు, పత్రికలు, ఆటల వస్తువులు— యీ విభాగం ఈ విధంగా ఎంతో చూడముచ్చటగా ఉంటుంది, ఇదిగాక యిందు పిల్లల చలనచిత్ర ప్రదర్శనలు, నాటకాలు, కథల కథనం, చిత్రలేఖన, వ్యాసరచన

పోటీలు మొదలైన ఎన్నో కార్యక్రమాలు తరచుగా జరు గుతూ ఉంటాయి. ఈ విభాగంలో పదివేలకు పైగా బాల బాలికలు సభ్యులుగా ఉన్నారంటే యీ విభాగం బాలలను ఎంతగా ఆకర్షిస్తున్నదో ఊహించుకోవచ్చు.

*పాఠ్యగ్రంథాల విభాగం*

దేశంలోగల పరిస్థితుల దృష్ట్యా లక్షలాది బాలబాలిక లకు ధనాభావం వలన సాధారణ విద్యకు నోచుకొనే అవ కాశం కనిపించడంలేదు. చదువు ప్రారంభించిన వారి కవసర మైనన్ని పాఠ్యగ్రంథాలను కొనేశక్తి చాలమందికి లేదు. ఈ అవసరాన్ని గమనించి ఢిల్లీ పౌరగ్రంథాలయం తరఫున పాఠ్య గ్రంథ విభాగం ఏర్పాటుచేయబడింది. ఇందులో ఉన్నత పాఠ శాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలలో చదువుకొనే విద్యార్థులకు అవసరమైన అన్ని పాఠ్యగ్రంథాలు ఒక్కొక్కటి అనేక ప్రతులు చొప్పున ఉంచబడినవి. మొదట్లో ఈ పుస్త కాలు గ్రంథాలయ ఆవరణలోనే చదువుకోడానికి ఉద్దేశించ బడినప్పటికీ యిటీవల కాలంలో అరువు తీసుకొని చదువుకొనే అవకాశాన్ని కూడ కలిగించారు.

*అంధులకు, ఖైదీలకు సేవ*

అదృష్టంలేక, వెలుగును చూడలేనివారికి, ఏవో కారణాలవలన జైలుజీవితము గడుపుతున్నవారికి, అనారోగ్యంతో ఆస్పత్రులలో గడుపుతున్న వారికి గ్రంథాలయ సేవ చేయ డంలో ఈ గ్రంథాలయం గణనీయంగా కృషిచేస్తూంది. అం ధులు చదువుకోడానికి వీలుగా ఉబ్బెత్తు అక్షరాలుగల

భారత్ బ్రెయిలీలిపిలో పుస్తకాలనుగూడ తయారుచేస్తున్నది. ఇందుకోసం విదేశాలనుండి స్లైఖడ్ పేపరు, బ్రెయిలీరైటర్లను గూడ తెప్పించింది. అంతేగాక చదివేశక్తిలేని వారికి 'మాట్లాడే పుస్తకాలను' గూడ తయారుచేసింది. అంటే కొన్ని మంచి పుస్తకాలు టేప్‌మీద రికార్డు చేయబడతాయి. టేప్ రికార్డింగ్ సహాయంతో వీటిని సులభంగా వినవచ్చు. అందువలన అంధులు సైతం విజ్ఞానలోకంలోని అనేక విషయాలను సులభంగా తెలుసుకొని ఆనందించగలుగుతున్నారు.

ఈ గ్రంథాలయం తరఫున తిహార్ సెంట్రల్ జైలులో ఒక కేంద్రం పెట్టి అచటి ఖైదీలకు పుస్తకాలను అందజేయగలుగుతున్నారు. అలాగే హిందూరావు ఆస్పత్రిలో రోగులకు తగిన పుస్తకాలను అందిస్తున్నారు.

## సంచార గ్రంథాలయం

ఢిల్లీ నగరంలోని మారుమూల ప్రాంతాలకు, గ్రామాలకు గ్రంథాలయసేవ అందించే ఉద్దేశంతో ఈ గ్రంథాలయం తరఫున 4 మోటారు వ్యాన్‌లు ప్రత్యేకించబడ్డాయి. ఈ వ్యాన్‌లు ఫతేపూర్, చౌరీ, చతర్‌పూర్, అయానగర్, గిటార్నీ మొదలైన గ్రామాలకు గూడ వెళ్ళి గ్రామీణులలో చదివే అలవాటును పెంపొందిస్తున్నాయి. ఈ సేవను మరింత పెంపుదల చేసేందుకు త్వరలో మరొక రెండు వ్యాన్‌లు నెలకొల్పే ఆలోచన కూడ ఉంది.

అంతేగాక యీ గ్రంథాలయానికి అనుబంధంగా పటేల్ నగర్, లక్ష్మీబాయి నగర్, కరోల్ బాగ్, షాదరా మొదలైన ప్రాంతాలలో శాఖలు, మోతిబాగ్, నావల్ పూర్, నేతాజీనగర్, రామకృష్ణపురం, మోతినగర్, రమేశ్ నగర్, తిలక్ నగర్, ఆజాద్ పూర్ మొదలైన ప్రాంతాలలో సామాజిక గ్రంథాలయాలు యింకా మరో 15 పుస్తక పంపిణీ కేంద్రాలు ఏర్పాటుచేయబడ్డాయి. మొత్తంమీద 100 చదరపు మైళ్ళకు పైగాగల ఢిల్లీనగరానికి యీ గ్రంథాలయం విశేషంగా ఉపయోగిస్తున్నది.

*సాంస్కృతిక కార్యక్రమాలు*

అనేక సందర్భాలలో ఎంతో ఆకర్షణీయంగా జరిగే సాంస్కృతిక కార్యకలాపాలకు ఈ గ్రంథాలయం పెట్టింది పేరు. 300లకు పైన కూర్చొని ఆనందించడానికి వీలైన ఆడిటోరియం యీ గ్రంథాలయంలో అమరియుండటం వలన యీ కార్యక్రమాలు జయప్రదంగా నిర్వహించడానికి వీలవుతున్నది. ఇచట వారానికి మూడు నాలుగు పర్యాయములు సంగీత, నాటక, నృత్యప్రదర్శనాలు, చలనచిత్ర, రేఖావర్ణ చిత్ర, పుస్తక ప్రదర్శనములు మొదలైనవెన్నో యిచట ఏర్పాటు చేయబడుతూ ఉంటాయి. అందువలన యీ గ్రంథాలయం నిత్యం పిన్నలను, పెద్దలకు వేలాదిగా ఆకర్షించగలుగుతూ ఒక సమాజిక కేంద్రంగా రూపొందగలిగింది.

*పుస్తకాల ప్రచురణ*

గ్రంథాలయ సేవలో పుస్తకాల ప్రచురణగూడ ఒక భాగమే. అయితే యీ పని చేపట్టిన గ్రంథాలయాలు బహు

స్వల్పం. ఢిల్లీ పౌరగ్రంథాలయం కొత్తగా అక్షరాశ్యులైన వారికి పుస్తకాలను ప్రచురించే కార్యక్రమం తలపెట్టింది. వ్యాపారాపేక్షగల ప్రచురణకర్తలు చేపట్టలేని యీ కార్యక్రమాన్ని ఈ గ్రంథాలయం చేపట్టి హిందీభాషలో యిప్పటికి 36 పుస్తకాలను ప్రచురించి ప్రజలలో చదివే అలవాటును పెంపొందించడానికి తోడ్పడింది. ఈ సంవత్సరంలో ఈ కార్యం విస్తృతంగా అమలుజరిపి యితరభాషలలోగూడ పుస్తకాలను ప్రచురించే కార్యక్రమం చేపట్టబోతున్నారు.

గ్రంథాలయ భవనం

ఇప్పుడు కేంద్ర గ్రంథాలయానికి, శాఖలకుగల భవనాలు చాలీచాలకుండా వున్నాయి. అందుకోసం మింటో ఏరియారోడ్, పటేల్‌నగర్ కన్నాట్‌సర్కస్ మొదలైన ప్రాంతాలలో స్థలాలు సంపాదించబడ్డాయి. ఇచట ఒక్కొక్కచోట సుమారు 3 లక్షల విలువగల భవనాలు నిర్మించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. కేంద్ర గ్రంథాలయానికి యీ సంవత్సరాంతంలో స్థలసేకరణ పని పూర్తవుతుంది. వెంటనే తొలిదశలో 25 లక్షలరూపాయిల అంచనా గల భవన నిర్మాణం చేపట్టబడుతుంది.

భవిష్యత్తు

ఢిల్లీలో యిప్పటికీ కొన్ని ప్రాంతాలకు గ్రంథాలయ సేవ సరిగా అందడంలేదు. ఈ కొరత తీర్చడానికి పాలకవర్గం మరో నాలుగు శాఖలను వీలయిన ప్రతిచోట పుస్తకపంపిణీ కేంద్రాలను, సంచార గ్రంథాలయాలను ఏర్పాటుచేయడానికి

నిర్ణయించింది. కార్యదీక్ష, దక్షతగల ఉద్యోగులు ఈ గ్రంథాలయంలో మెండుగా ఉన్నారు. ప్రభుత్వం, యునెస్కో, ఢిల్లీ నగరపాలక సంఘం మొదలైన సంస్థలు తగిన నిధులు సమకూర్చినపుడు ఢిల్లీలోని ప్రతి పౌరుడికి గ్రంథాలయసేవ ఏదో ఒక రూపంలో అందడంలో సందేహం లేదు.

నిపుణుల పరిశీలన

ఈ గ్రంథాలయం పనిజేసే తీరును గురించి 1955లో ఒకసారి యునెస్కో నిపుణుడు ఎఫ్ ఎం గార్డనర్ పరిశీలనచేసి ఎంతో ప్రశంసించారు. 1965లో భారతప్రభుత్వ గ్రంథాలయ సలహాదారుడు బి యస్ కేశవన్‌గారు పరిశీలించి యిది పని జేసే తీరును ఎంతో శ్లాఘించారు. ఏ నిపుణుడు పరిశీలించినా ఏ విద్యావంతుని కదిలించినా, ఏ సాధారణవ్యక్తిని పలుకరించినా అందరూ దీనిని ఆదర్శ గ్రంథాలయం అంటున్నారు. భారతదేశంలో ప్రసిద్ధ పౌరగ్రంథాలయం అంటున్నారు. ఈ మాటల్లో వాస్తవం ఎంతైనా ఉంది.

—

# శతాబ్దాల చరిత్ర గల్గిన వెంకటగిరి సంస్థాన గ్రంథాలయం

# 9

నెల్లూరు జిల్లాలో ఇప్పటికీ కొనవూపిరితో నిల్చియున్న వొకటి రెండు పురాతన గ్రంథాలయాల్లో వెంకటగిరి సంస్థానం వారి పుస్తకభాండాగారాన్ని మొదట పేర్కొనాల్సి వుంటుంది. అయితే ఇందులో ఏ యే గ్రంథాలున్నాయో చూచి చెప్పిన వారుగానీ లేదా జ్ఞాపకం చేసుకొని చెప్పగలిగినవారుగానీ ఇటీవల ఎవరూ లేరనే చెప్పాలి. ఈ మధ్య ఈ గ్రంథాలయాన్ని కొంత క్షుణ్ణంగానే పరిశీలించే అదృష్టం నాకు లభించింది. జిజ్ఞాసువులకు కొంత ఆసక్తికరంగా వుండొచ్చుననే ఆశాభావంతో నా యీ కొద్దిపాటి అనుభవాన్ని వివరిస్తున్నాను.

"వెంకటగిరి సంస్థానం : గోపీనాథ వెంకయ్యశాస్త్రి, ఇతరకవులు" అనే విషయంపై ఉస్మానియా విశ్వవిద్యాలయం వారిచే పి హెచ్ డి పరిశోధనకై నియుక్తుడనై ఇందుకు సంబంధించిన వివరాలను సేకరించవల్సివచ్చింది. 1967 వేసవి కాలమంతా ఈ పనిమీదనే వెంకటగిరిలో వుండిపోయాను. నేను మొదట అభ్యర్థించుకొన్నప్పుడు శ్రీ కుమార రాజా గారు కొంత సంకోచించినా తర్వాత తమ సంస్థానం లైబ్రరీని

పరిశీలించేందుకు అంగీకరించి అన్ని సదుపాయాలూ సమకూర్చారు. శ్రీ కుమార రాజాగారి సహృదయతకు ఈ సందర్భంగా కృతజ్ఞతలు చెప్పుకోవాల్సి వుంటుంది.

వెంకటగిరి వెళ్ళేముందు రెండు మూడు రోజుల్లో, మహా అయితే వారం పది రోజుల్లో పనిపూర్తిచేసుకొని రావచ్చుననే ధీమాతో బయలుదేరాను. కాని అక్కడకు వెళ్ళి నిజస్థితి కళ్ళారా చూచినప్పుడు నా వూహ పూర్తిగా తల్లకిందులైంది.

సంస్థాన గ్రంథాలయం 'ఆస్థాన పండితుని' ఆధీనంలో వుంటుందట. నేనక్కడ ఉండగానే గ్రంథాలయాన్ని చూపవల్సినదిగా ఆస్థానపండితులకు కబురుపెట్టారు. ప్రధాన రాజభవనానికి (నగరి) దక్షిణంగా వంటశాల వుంది – దీన్నే మోదేఖానా కాబోలు అంటారు. ఈ ఆవరణలోనే ఒక చిన్న మేడ ....

*గ్రంథాలయం జాగ్రఫీ*

మేడ పైకి పోతే రెండంకణాల వరండా. ఆ వరండాకు ఎదురు బొదురుగా రెండు పొడుగాటి గదులు. ఈ గదుల్లో వొకటేమో రికార్డాఫీసట, రెండోదేమో గ్రంథాలయమన్నారు. పాపం! ఆస్థానపండితులవారికి ఆ గ్రంథాలయం అనబడే గది తలుపు తెరవడానికే పది నిముషాలు పట్టింది. తుప్పుపట్టిన తాళం వొక పట్టున వూడిరాలేదు. తాళం వూడి వచ్చినా తలుపులు తెర్చుకోలేదు. తీరా తలుపు తెర్చిచూస్తే పురాతత్వశాఖవారు భూమిలోనుండి కనుగొన్న ప్రాచీన గుహ

మోస్తరుగా వుంది ఆ గది. అప్పటికే నా ఆతురతకొద్దీ చాలా ప్రశ్నలువేసి వేధించానేమో - ఆ పండితులవారు ఆ గ్రంథాలయం (గది) లోని గ్రంథాలతో తమకు బొత్తిగా పరిచయమే లేదనీ, ఏడాదికో రెండేళ్ళకో ఈ తలుపు తెరవవలసిన అవసరం పడితేతప్ప తా మీ పక్కకుకూడా రామనీ, నాకు అవసరమైన గ్రంథాలు నేనే వెతుక్కోవల్సి వుంటుందనీ, కేటలాగువంటిదేదీ వుండదని హెచ్చరించి, కొంచెం ధైర్యం చెప్పి తమ పన్లు చూచుకోడానికి వెళ్ళిపోయారు.

ఈ గ్రంథాలయంలోని అపురూపమైన గ్రంథసంచయం గూర్చి ముచ్చటించేందుకు దీన్ని కొద్దిగా భౌతికంగా వర్ణించవలసిన అవసరంవుంది. షుమారు 12.6అ వెడల్పు, 48.6అ పొడవున్న గది లేదా హాలు యిది. మొత్తం గది అంతకూ కలిపి వొకేవొక ఇరుకైన కిటికీ. ఆ కిటికి చెక్క తలుపులు. (ఇవి సగం సగం శిధిలం) ఈ గదిలో మొత్తం ఎనిమిదో పదో కొయ్యబీరువాలున్నాయి. గదిమధ్య అక్కడక్కడా పూర్వ వ్రాయసగాండ్లు వాడుకొనే వాలుబల్లలూ, వ్రాతపరికరాలుగాక పెద్ద నలుచదరపు బల్లలు కొన్ని, బల్లలపైనా, నేలమీదా గుట్టలు గుట్టలుగా చిందరవందరగా పడివున్న తాటాకు పుస్తకాలు, అచ్చుపుస్తకాలు, గోడలకు ఎత్తుగా చెక్కలు అమర్చబడి వున్నాయి. వాటిమీదకూడా తాటాకు గ్రంథాలు గుట్టలుగుట్టలుగా పడివున్నాయి. కొయ్య బీరువాల తలుపులంతా చెదలు, తాటాకు పుస్తకాలకు చెదలు, ఎక్కడ చూచినా చెదలు. ఇదీ నేను చూచిన ఆ గది దృశ్యం.

మొదటి రెండు మూడు రోజులు, ఆ ప్రవేశయోగ్యం చేసుకోడానికే సరిపోయింది. ఆ గదిలో నా పరిశోధనకు పని కొచ్చే, సరుకేమిటో కనుక్కోవాలంటే మొత్తం ముద్రితా ముద్రిత గ్రంథాలన్నింటికీ స్థూలంగా చిత్తుజాబితా అయినా తయారుచేస్తేకానీ, కుదరదనిపించింది. ఈ పనిలోనే ఈ గ్రంథాలయపు పురాతన విశిష్టత, వైభవం, తెల్సివచ్చింది.

*ముద్రిత గ్రంథాలు*

ముద్రిత గ్రంథాల విషయమే ముందు చూద్దాం. క్రీ శ 1850 ప్రాంతాల్లోనూ, ఇంకా అంతకుముందు ముద్రింపబడ్డ తెలుగు గ్రంథాలెన్నో ఈ గ్రంథాలయంలో వున్నాయి. సుప్రసిద్ధ భాషాపరిశోధకుడు, తెలుగువారికి వాఙ్మయ భిక్ష పెట్టిన సి పి బ్రౌన్ దొరగారి సహాయకులైన జూలూరి అప్పయ్య పంతుల ప్రతిపద పీఠికతో 1844లో వెలువడిన వసుచరిత్ర, శ్రీనివాసతారావళీ, రామపంచవింశత్కాండం, యదువంశభూషణశతకం అప్పయ్యపంతులుగారివే - మొదలైన గ్రంథాలెన్నో ఈ చెదలపురుగుల మధ్య ఇంకా పదిలంగా ఉన్నాయి. ఆనాడు వెలువడిన అనేక గ్రంథాల తొలి ముద్రణలు ఇక్కడ చాలామటుకు దొరుకుతాయి.

ఇక పోతే వెంకటగిరి రాజులు చాలా గ్రంథాలు అంకితం తీసుకున్నారు. తామూ, తమ వంశీయులూ అంకితం గొన్న గ్రంథాలలో అనేకం తామే స్వయముగా ముద్రించారు. ఎందరో కవుల గ్రంథ ముద్రణలకు సహాయము చేశారు. ఈ గ్రంథాల ప్రతులన్నీ పదులు, వందల సంఖ్యలో

ఇక్కడ కనిపించాయి. గోపీనాథ వెంకటశాస్త్రిగారి రామాయణం, శిశుపాలవధ మొదలైన గ్రంథాలు, బిరుదురాజు శేషాద్రిరాజు, కటికనేని రామయకవి, రత్నాకరం సుబ్బరాజ కవి, మండపాక పార్వతీశ్వరకవి మొదలైన వాటి నెన్నింటినో వెంకటగిరి వారే స్వయముగా ముద్రించారు. ఇవన్నీ సర్వజ్ఞ కుమారయాచేంద్ర, రాజగోపాలకృష్ణ యాచేంద్ర మొదలైన వారి ముద్రితాముద్రితమైన గ్రంథాల సరసనే పడి ఉన్నాయి.

పోతే, ఈ గ్రంథాలయము ఒక్క తెలుగుకే పరిమితము కాదు. ఇంగ్లీషు, హిందీ, సంస్కృతము, తమిళం, పరిషియన్ పుస్తకాలెన్నో ఇక్కడ ఉన్నాయి. ఇంపీరియల్ గెజిటీర్ ఆఫ్ ఇండియా వాల్యూములు, షేక్స్పియర్ నాటకాలు, ది లీషర్ అవర్, ది కాటేజ్ అండ్ ది ఆర్టిసాన్, ఆబ్ కారీ వంటి విదేశీ పత్రికలు, బైబిల్ ప్రతులు అడ్మినిస్ట్రేషన్ రిపోర్టులు, మాన్యువల్స్ మొదలైన వెన్నో ఓపికపట్టి చూచేవారి కెవరి కైనా కనుదగుల్తాయి.

ఆనాటి రాజులు సమకాలీన పత్రికలు విరివిగా చదివే వారు. సుమారు పాతికపైగా తెలుగు పత్రికలు, పది ఇంగ్లీషు జర్నల్ సంపుటాలు గుట్టలు గుట్టలు పడి ఉన్నవి. సరస్వతి, శశిరేఖ, అముద్రిత గ్రంథ చింతామణి, సుజనా మోదిని, వాగ్వల్లి, పురుషార్థప్రదాయిని, ప్రబంధ కల్పవల్లి మొదలైన పత్రికల సంపుటాలు ఇక్కడున్న వాటిల్లో కొన్ని. ది మెడ్రాస్ రివ్యూ, ది ఎడ్యుకేషనల్ రివ్యూ వంటి ఆంగ్లపత్రికలు మరి కొన్ని.

వ్రాతప్రతులు

ఇక వ్రాతప్రతుల సంగతి — రాంబాణాలు కొట్టి, చెదలుపట్టి పోయినవి పోగా ఇప్పటికి వందకు పైబడిన తాళ పత్ర గ్రంథాలు, కాగితపు వ్రాతప్రతులు కనిపిస్తున్నవి. అష్టా దశ పురాణాలు, వేదమంత్రాలు, భారత రామాయణాలు, సంస్కృత కావ్యాలు, వ్యాఖ్యలూ, మంత్రశాస్త్రాలు — సంస్కృత విభాగములో ముఖ్యమైనవి. ఇక తెలుగు ప్రబం ధాలలో చాలామటుకు కనబడ్డాయి. తెలుగు భారతము ప్రతులు ఒకటికి రెండున్నాయి. భాగవతము శుద్ధ ప్రతి (పాఠాంతరాలతో సహా) ఒకటి ఉంది — ఆశ్చర్యం వేసింది. ఇవిగాక అరడజను భాస్కరరామాయణాలు, హరివంశాలు కనిపించాయి. సంగీత సూర్యోదయము వంటి అయిదు శాస్త్ర గ్రంథాలున్నాయి. అభిమన్యు కళ్యాణము వంటి ద్విపద కావ్యాలు, వీరగాథలు, వేట గ్రంథాలూ, తత్వశాస్త్ర గ్రంథాలు ఇప్పటికీ చెడకుండా మిగిలి ఉన్నాయి. ఇవిగాక వాడుక భాషలో రచించబడిన సాముద్రిక శాస్త్రాలు, తత్వ శాస్త్రాలు అనేకము ఉన్నాయి.

ఆయా రాజుల సమగ్ర జీవితాన్ని జాతక గ్రంథాలుగా నాటి జోస్యులు వ్రాసినగ్రంథాలు మరికొన్ని. ఇవన్నీ ఒకఎత్తు, లీలావతీ, హేమవతీ, తిరునాళ్ళ, బంగారు యాచమనాయని దండ కాలు, వెంకటగిరి వారిపై చెప్పినవని చాలామంది పరిశోధ కులు పూరకే పరంపరగా పేర్కొనడమే కానీ, వాటిని చూచినవారుమటుకు లేరు. సర్వజ్ఞ కుమార యాచేంద్రుని

వ్రాతప్రతులన్నీ ఇక్కడే భద్రపరచబడి ఉన్నాయి. ఈయన వ్రాసిన మనసాక్ష్యము హిందీ అనువాదము కూడా ఇక్కడ ఉంది. ఇట్లా చెప్పుకుంటూ పోవాలంటే ఇది ఒక పెద్ద లిష్టు అవుతుంది.

హిందీ, అరబ్బీ, పార్శీలలో కూడా కొన్ని అందమైన వ్రాతప్రతులు ఇక్కడ చూచాను. కొన్ని వర్ణచిత్రాలు, రాజముద్రలు కూడా చూచినట్లు గుర్తు. బహుశా ఏ అర్కాటు, నైజాము నవాబులో ఈ వ్రాతప్రతులన్నీ వీరికి బహూకరించి ఉండాలి.

*జాబులూ, కవితెకట్టలు*

వీటితోపాటు, ఆ పాతకాలమునాటి జాబులు కూడా అనేకం ఉన్నాయి. వెంకటగిరి సంస్థానాధిపతులకు, పండితులకు ఆంధ్రప్రదేశములోని వివిధ ప్రాంతాలకు సంబంధించిన కవులు, కళాకారులు, పండితులు వ్రాసిన జాబులు అనేకం చాలావరకు శిథిలమై అవసానదశలో కన్పించాయి. యివి వందల సంఖ్యలో వున్నాయి. వేదం వెంకటరాయశాస్త్రి, వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రి, చదలవాడ సుందరరామశాస్త్రి, తాంపూరి లక్ష్మీ నరసింహారావు, కాళ్ళకూరి రాజగోపాలరావు ప్రభృతులు తమ వుత్తరాలను అచ్చువేసి పంపేవారు. యివిగాక వెంకట పార్వతీశ్వరకవులు, వీరేశలింగం పంతులు, పూండ్ల రామకృష్ణయ్య, తిరుపతి వెంకటకవులు, పిసుపాటి చిదంబరశాస్త్రి, గోపీనాథ వెంకయ్యశాస్త్రి మొదలైన వారి లేఖలు, నా పరిశీలనలో

కనబడ్డాయి. యిట్లాంటి జాబులే వందల సంఖ్యలో శిథిలం అయిపోతున్నాయి.

వెంకటగిరి జ్ఞానసమాజం వారు మద్రాసు వేదసమాజం వారితో నడిపిన వివాదాలకు సంబంధించిన జాబులూ, జ్ఞాన సమాజం ప్రొసీడింగ్స్‌కు సంబంధించిన కవిలెకట్టలూ ఆసక్తి దాయకమైనవి. బహుశా వీటి మధ్యనే కాబోలు రాజా రామమోహనరాయ్‌గారి నుండి వచ్చిన ఒక జాబు నాకను తగిలినట్టు గుర్తు. ముఖ్యంగా ఆయా జాబులన్నీ సంస్థానాధిపతులకూ ఆ సమకాలీన పండితులకూ గల సాహిత్యాన్ని సూక్ష్మవివరాలతో కూడా పట్టియిచ్చేవిగా వున్నాయి.

*గ్రంథాలయం హిస్టరి : వెంకటగిరి నుండి ప్యారిస్‌కు....*

ఈ గదిలో భద్రపరచబడిన గ్రంథసంచయం ఒకనాటిది కాదు. బహుశా క్రీ శ 1600 నాటినుండి అనేకులు సేకరించి జాగ్రత్త చేసిన అక్షరసంపద యిది. ఫాదర్ మిక్‌మిల్ అనే ఆయనచే వ్రాయబడి, తిరుచునాపల్లి సెంట్ జోసఫ్స్ సొసైటీ వారిచే 1910లో ప్రచురింపబడిన 'ది హిస్టరీ ఆఫ్ తెలుగు క్రిస్టియన్స్' (The History of Telugu Christians) అనే గ్రంథంలో పేర్కొనబడి, 1942 నెల్లూరు జిల్లా గెజిటెడ్ గ్రంథంలో పునరుద్ధరింపబడిన కథనం నిజమైతే 1730 ప్రాంతంలో ఫాదర్ కెల్మెట్ అనే ఆయన వెంకటగిరి రాజా క్రింద కొంతకాలం లైబ్రరియన్‌గా వున్నట్లు, ఆ కాలంలో వేదవాఙ్మయానికి చెందిన తాటాకు గ్రంథాలు వెంకటగిరి సంస్థానం నుండి ఫ్రెంచి వోరియంటల్ లైబ్రరీకి తరలింపబడి

నట్లు చెప్పుకోవల్సి వుంది. అయినా ఈ గ్రంథాలయం సర్వతోముఖంగా అభివృద్ధి పొంది ప్రఖ్యాతి పడ్డది. క్రీ. శ 1850–1915 మధ్య దినాల్లోనే రసజ్ఞులైన యిద్దరు ప్రభువుల ప్రభుత నెరపిన కాలమిది. సర్వజ్ఞ కుమారయాచేంద్రులు 1847లో రాజ్యానికి వచ్చారు. యిప్పటికి ఈ గ్రంథాలయ నిర్మాతగా వీరి నే పేర్కొనవలసి వుంది. వీరికి సంగీత సాహిత్య నృత్యాలతోపాటు మతం వగైరా సర్వ విషయాలలోనూ ఆదరం ఎక్కువ. ఈయన తన దేశాటనలలో క్రొత్త క్రొత్త గ్రంథాలయాల్ని సుసంపన్నం చేసిన వ్యక్తి.

ఈయన కాలం నుండి సంస్థాన గ్రంథాలయం సరస్వతీ నిలయంగా వాడుక పడ్తూ వచ్చింది. 1860 ప్రాంతాల నుండి సంస్థాన గ్రంథాలయం ఆరోగ్యకరమైన విధానాల్లో నడుప బడుతుండినట్లు సూచనలు కనపడ్డాయి. 1904 ప్రాంతంలో ఈ సరస్వతీ నిలయాన్ని రాజగోపాలకృష్ణయాచేంద్రులు యిప్పటి భవనంలోకి తరలించారు. వీరి నిర్యాణం తర్వాత వచ్చిన ప్రభువులకు సాహిత్యంపైన ఆసక్తి, గ్రంథాలయంపైన అనురక్తి క్రమంగా నశించినట్లు చెప్పవలసి వుంది.

## జర్మనీలో 'రతిరహస్యం'

పూర్వం ఈ సరస్వతీ నిలయం ఎన్ని అపురూపమైన గ్రంథాలకు నిధానమై వుండేదో ఆనాటి చిట్టాలు కొన్ని సూచిస్తున్నాయి. ఒక్క కామ శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలే గీర్వాణ గ్రంథాలతో కలిపి 15 దాకా వుండేవి.

ఈ క్రింది ఒక చిన్ని వుదాహరణ పేర్కొనవలసి వుంది ఈ సందర్భంగా.

హరిహరుని రతిరహస్యం అనే సంస్కృత గ్రంథాన్ని జర్మనీలోని 'జీర్ క్రిఫ్ట్' అనే పత్రికా సంపాదకుడు పరిష్కరించి సంస్కృత లిపిలోనే ముద్రిస్తానన్నాడట. అందుకుగాను 4వ ఆశ్వాసం వెంకటగిరి గ్రంథాలయంలో వున్నట్లు తెలిసి మానవల్లి రామకృష్ణకవిగారు రాజగోపాలకృష్ణ యాచేంద్రునికి లేఖ వ్రాశారు. యిది 1911 నాటి మాట. 1930-37 వరకు నామకేవాస్తే అయినా ఈ గ్రంథాలయం లెక్కలు వ్రాయబడ్డ దాఖలా ఉన్నాయి.

*ప్రస్తుత స్థితి - ఒక ఆవేదన*

యిక యిప్పటి పరిస్థితి గూర్చి చెప్పాలంటే ఏడుపు వస్తుంది. ఆదిలోనే విన్నవించుచున్నాను. యీ పుస్తకాలున్న గది అంతా చెదల పుట్ట. వాన నీళ్ళు ముఖ్యంగా ఈ గ్రంథాలయం నిర్మూలనకు మూలకారణం. వరండా కంటే గది కాస్త పల్లంగా వుండటం వల్ల వర్షం నీళ్ళు నేరుగా గదిలోకే ప్రవేశిస్తాయి. ఈ రోజుల్లో అన్ని జాగ్రత్తలూ తీసుకుంటూ కూడా గ్రంథాలు శిథిలం కావడాన్ని అరికట్టలేకుండా వున్నాము. యిట్లా దిక్కు దివాణం లేకుండా పాడుపడిపోయిన ఈ గదిలో చిక్కుకున్న విజ్ఞాన సంపద ఎట్లా చీలిపోతున్నదో వూహాకందని విషయ మేమీ కాదు.

అయినా ఒక చిన్న స్వానుభవపూర్వకమైన ఉదాహరణ : ఒకసారి నేను కొంత చదివి "రత్నపరీక్ష" అనే

తాటాకుల పుస్తకాన్ని ఊరికి వెళ్తూ మళ్ళీ తిరిగి వచ్చి చదవచ్చునని జాగ్రత్త చేసి వెళ్ళాను. వారం రోజుల తర్వాత వచ్చి చూస్తినిగదా ఆ గ్రంథం ప్రాంతం వానకు తడిసి చదలుకు ఆహారమై పోయింది. దాంతోపాటు అక్కడే వుంచి పోయిన నోట్సులు, చాపకూడా ఆహుతై పోయాయి. వారం రోజులకే యింతటి ముప్పు కల్గితే 1967లో నేను చూచిన దానికి యిప్పటికి దాంట్లో ఎంత భాగం క్షేమంగా వుందో వూహించుకోలేక పోతున్నాను. నేను అక్కడ పరిశోధన ప్రారంభించిన తొలిరోజుల్లోనే ఒక డబ్బా ఫ్లిట్, నాఫ్తలిన్ బాల్స్‌తో కొంతవరకూ చెదలు నరికట్టవచ్చునని సూచించాను. కానీ యిందుకు సంబంధించిన ఏర్పాటేమీ చేసినట్లు లేదు. ఈ 8 ఏండ్లలో ఎంత నాశనమై ఉంటుందో అనేదే నా బెంగ.

ఒక విన్నపం

ఈ సందర్భంగా కుమార రాజాగారికి నా దొకటే విజ్ఞప్తి. రాజకీయాల్లో, అనేక యితర వ్యాసంగాల్లో పడి వారికి ఈ గ్రంథాలయాన్ని పునరుద్ధరించి, అందలి అనర్ఘ రత్నాలను లోకానికి చాటే అవకాశం, అభిరుచి, తీరిక వుండకపోవచ్చు. కానీ యిట్లా ఆ గ్రంథాలయం ఎవరికీ వుపయోగం కాకుండా నిర్మూలం కావటం ఎవరికీ ప్రతిష్టను చేకూర్చదు. ఈనాడు అందులో ఏమున్నాయో ఎవరికీ తెలియక పోవచ్చు. అట్టే వుపయోగపడే గ్రంథాలు లేవనే అన్పించవచ్చు. రాజాగార్లు యివి తమ వ్యక్తిగతమైన రికార్డులని,

వీటితో బైటవారికేమీ ప్రమేయం వుండదనీ, భావించరాదని నా మనవి. ఈనాడు స్థానికచరిత్రకు గల ప్రాముఖ్యం రాజాగార్లకు తెలియంది కాదు. నెల్లూరు మండలానికి, ఎవరు చూసొచ్చారు. ఆంధ్ర దేశానికే సంబంధించిన అనేకానేకమైన ఆసక్తికరమైన విషయాలు భావిపరిశోధనల్లో బైటపడవచ్చు. యిందలి తాళపత్ర గ్రంథాలు కూడా చాలా ప్రాచీనమైనవనే నా నమ్మకం. ఉదాహరణకు భాస్కరరామాయణాలు అరడజనుదాకా వున్నాయి. ఒక్క పద్యం అధికంగా ఈ ప్రతుల్లో కన్పించినా వుత్తోదయం అయినంతగా సంతోషించేవారు లేకపోలేదు. కానీ కొన్ని అసలే అచ్చుకు నోచుకోని గ్రంథాలున్నాయి. వాటిలో కొన్ని అయినా వెలుగు చూడాల్సిన అక్కర ఎంతయినా ఉంది.

యింత వ్రాసిన తర్వాత ఆఖరుగా కొన్ని సూచనలు :

సంస్థానం వారు స్వయంగా ప్రచురించిన 'గోపీనాథ రామాయణం, శిశుపాలవధ, కువలయానందప్రకాశము, రసార్ణవ సుధాకరరఘువంశీ గ్రంథాల ముద్రిత ప్రతులు డజన్లకొద్దీ కాపీలు బాగా బైండ్ అయివున్నవి. బీర్వాల సొరుగుల్లో పుచ్చి ఎందుకూ పనికిరాకుండా పోతున్నాయి. ఈ గ్రంథాలను ప్రముఖ గ్రంథాలయాలకు, విశ్వవిద్యాలయాలకు, పరిశోధనా సంస్థలకు, పండితులకు (యిప్పటికయినా) పంచిపెడితే వాటిని ముద్రించిన ప్రభువుల వుద్దేశ్యం సఫలమౌతుంది.

1900–20 సం రాల మధ్య గోపాలకృష్ణ యాచేంద్రులు ఆయన పుత్రులు మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాల పరిశోధ

నాలయానికి అనేక వ్రాతప్రతుల్ని బహూకరించి వున్నారు. వీరి ననుసరించి పిఠాపురంవారూ ఖ్యాతి నార్జించారు. హైదరాబాదులో మనం యిటీవలే క్రొత్తగా రాజ్యాధి లేఖక కార్యాలయాన్ని (స్టేటుఆర్కైవ్స్) ఏర్పాటుచేసుకోగల్గాం. లేటెస్ట్ టెక్నిక్‌లో ఈ వ్రాతప్రతుల్ని భద్రం చేయడమే గాకుండా పరిశోధకులు చదివేందుకు ఎక్కువ అవకాశముంటుంది లేదా పాత గ్రంథాలను పోగుచేసివున్న నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్ యాజమాన్యంలోనైనా వుంచవచ్చు. నెల్లూరుజిల్లా గ్రంథాలయ సంస్థకు యిప్పుడు భూరి భవనం లభ్యమైంది గనుక వారికైనా చేర్చవచ్చు. యింకా కాలం గడిస్తే మిగిలేదంటూ ఏమీ వుండకపోవచ్చును. ఈ గ్రంథ సంచయం ఎక్కడున్నా పసిపిల్లలకన్నా ఎక్కువగా చూసుకోవడం అవసరం. యివన్నీ కాదనుకుంటే కనీసం వెంకటగిరి విశ్వోదయ కాలేజీ వారికైనా అప్పగించడం బాగుంటుంది. ఈ సూచనలను సహృదయంతో వెంకటగిరి కుమారరాజాగారు స్వీకరిస్తారని ఆశిస్తూ అంతరించిపోతున్న ఈ గ్రంథాలయానికి మంచిరోజులొస్తాయని విశ్వసిస్తూ ముగిస్తున్నాను.

(రచన : శ్రీ కె పురుషోత్తం)

—

# శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం

# 10

ఆంధ్ర ప్రాంతంలో వ్యాప్తిలోకి వచ్చిన గ్రంథాలయోద్యమానికి తెలంగాణా ప్రాంతంలో వ్యాపించిన గ్రంథాలయోద్యమానికి ఒక ముఖ్యమైన తేడా ఉన్నది. ఆంధ్ర ప్రాంతంలో ఉద్యమం జాతీయోద్యమం, ఆంధ్రోద్యమం మొదలైన అనేక ఉద్యమాలతో ముడివడియుంటే, తెలంగాణా ప్రాంతంలో యీ ఉద్యమం ఆంధ్రభాష రక్షణతో నిరంతర సంబంధం నిండుకొని ఉంది. ఉద్యమ చరిత్రలో ఏ దశను పరిశీలించినా ఈ విషయం విస్పష్టంగా కనిపిస్తూ వుంటుంది.

భాషా ఉద్యమంతో బాటు తెలంగాణా గ్రంథాలయోద్యమంలో, యితర ప్రజా ఉద్యమాలలో, గురుతరమైన పాత్రవహించిన హైదరాబాదులోని శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. తెలంగాణాలో స్థాపించబడిన యీ తొలి పౌరగ్రంథాలయాలలో యిది ప్రసిద్ధి చెందినది.

1901లో ఒక రోజున స్వర్గీయ కొమర్రాజు లక్ష్మణ రావుగారు, రావిచెట్టు రంగారావుగారు, నాయని వెంకట రంగారావుగారు యథాలాపంగా సమావేశమై రాబర్ట్ సీవెల్ రచన ఫర్ గాటెన్ ఎంపైర్ చదివి శ్రీకృష్ణదేవరాయల

శౌర్యపరాక్రమాలు, రాజనీతి దురంధరత్వం, పాండితీప్రకర్ష అష్టదిగ్గజాలపోషణ మొదలైన విశేషాలు తెలిసికొని ఆశ్చర్య చకితులయ్యారు. అంతేగాక ఆనాడు తెలంగాణాలో ఆంధ్ర భాషామతల్లిని ఆవరించిన దుస్థితిని తలచుకొని బాధాకరమైన ఆవేదన పడ్డారు. నాడు ఆంధ్రులకు ఆంధ్రభాషకుగల వైభ వాన్ని మరల ప్రతిష్టచేసే ఉదారమైన ఆశయంతో చర్చలు జరిపారు. ఈ ఆశయాలు నెరవేరేందుకు ఒక గ్రంథాలయాన్ని హైదరాబాదులో స్థాపించ నిర్ణయించుకున్నారు.

ప్రారంభోత్సవం

పరాయి పాలనలో తెలుగు వారికి, తెలుగు సంస్కృతికీ ఏమాత్రం ఆదరణ లేని రోజులలో 1901 సెప్టెంబరు 1వ తేదీన హైదరాబాదు నగరంలో రామకోటిలోని రావిచెట్టు రంగారావుగారి బంగళాలో పాల్వంచ సంస్థానాధీశులగు రాజా పార్థసారధి అప్పారావు సవాయి అశ్వారావు, మహ బూబు సరపురాజ్‌పంతు బహద్దర్‌గారి ఆధిపత్యంలో ప్రారం భోత్సవం జరిగింది. ఆనాటి సభలు హైదరాబాదులోని ప్రముఖులైన ఆంధ్రులందరూ పాల్గొని యీ గ్రంథాలయానికి అన్నివిధాలా సాయపడటానికి వాగ్దానం చేశారు. ఏమైనప్పటికి గ్రంథాలయపు తొలిదశలో బలమైన పునాదులు ఏర్పడడానికి ఆదిపూడి సోమనాధరావుగారు, మైలవరపు నరసింహాశాస్త్రి గారు విశేషమైన కృషిచేశారు.

ఈ గ్రంథాలయ ప్రారంభోత్సవ విశేషాలు తెలిసికొని వరంగల్లులో రాజరాజ నరేంద్ర ఆంధ్రభాషా నిలయం,

హైదరాబాదులో బాలసరస్వతీ ఆంధ్రభాషా నిలయం మొదలైన గ్రంథాలయాలు స్థాపించబడ్డాయి. వీటిని గ్రంథాలయాలనక 'భాషానిలయం' లని ప్రత్యేకంగా నామకరణం చేయడంలో ఆనాడు కార్యకర్తలలో ఆంధ్రభాషయందుగల గాఢమైన అభిమానం మనకు అభివ్యక్తమౌతున్నది.

తొలిరోజులు

ఈ గ్రంథాలయ నిర్వహణలో తొలిరోజులలో అనేక కష్టాలు ఎదురైనాయి. పూర్వాచారాలందు విశేషమైన మక్కువగల పెద్దలు సామాన్యులకు విజ్ఞానాన్ని ఉచితంగా అందజేయడంలో ఆసక్తి ఏమాత్రం లేదు. పైగా మరొక వైపున పాలకులను అనుసరించి విద్యావంతులలో తెలుగు భాషకంటే ఇంగ్లీషు, ఉర్దూ భాషలయందు వ్యామోహం హెచ్చుగా ఉండేది. ఈ పరిస్థితిలో ఆంధ్ర భాషోద్ధరణకు కంకణం గట్టుకొన్న గ్రంథాలయం నిర్వహించడంలో ఎన్ని యిబ్బందు లుంటాయో ఊహించుకోవచ్చు. కాని యీ కష్టాలను సులభంగా ఎదుర్కొనగల కార్యదక్షులు ఈ గ్రంథాలయపు తొలిదశలో ఉన్నారు. వారిలో వేలూరి రంగధామ నాయుడుగారు, ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు, ఆదిరాజు వీరభద్రరావుగారు ముఖ్యులు. వీరికి తోడుగా భాషాపోషణయం దభిరుచిగల గద్వాల, పాల్వంచ, వనపర్తి, బొబ్బిలి, వెంకటగిరి మున్నగు సంస్థానాధీశులు ఆర్థికంగా యీ సంస్థకు చేయూత నిచ్చారు.

తొలిదశలో తగినంత ప్రోత్సాహం లభించకపోయినా రానురాను యువతరంలో యీ గ్రంథాలయమందు అభి

మానం పెరగజొచ్చింది. తొలి రోజులలో యీ నిలయాన్ని బాసటగా చేసికొని ఆంధ్రభాషాభ్యాసానికి ఒక పాఠశాల, ఆంధ్రభాషోజ్జీవన నాటక సంఘమని ఒక నాటకసమాజమూ వెలిశాయి. ధనాభావంచేతగానీ, యితర కారణాలచేతగానీ యీ అనుబంధ సంస్థలు తర్వాత మూసివేయ బడ్డాయి. గ్రంథాలయం మాత్రం యథావిధిగా నిర్వహింపబడుతూనే వుంది. తొలి పదేళ్లు రావిచెట్టు రంగారావుగారి యింటనే యీ గ్రంథాలయం నిర్వహించిన మీదట, చదువరులకు మరింత అందుబాటులోకి ఉండే ఉద్దేశ్యంతో దీనిని నెలకు నాలుగున్నర రూపాయల కిరాయితో కొత్తబజారులోని ఒక గదికి మార్చారు. స్వంత భవనం నిర్మించుకొనేవరకు గ్రంథాలయం యిచటనే ఉంది.

### మూడు నష్టాలు

గ్రంథాలయ ప్రగతి సాయిలా పాయిలాగా సాగుతున్న రోజులలో గ్రంథాలయం రెండు తీవ్రమైన నష్టాలను ఎదుర్కొన్నది. మూసీనది పొంగి పొరలి హైదరాబాదు నగరాన్ని నీటముంచి విలయతాండవం చేసింది. ప్రజలు ఆనాడు దీనివలన అనేక బాధలకు గురైనారు. ఈ గ్రంథాలయం తాలూకు అత్యంత ప్రయాసతో కూడబెట్టిన మూలధనం రు 726–65 మద్రాస్‌లోని ఆర్బత్‌నాట్ కంపెనీలో ఉంచగా అదికాస్తా దివాలాతీసి గ్రంథాలయ ప్రగతికి గొడ్డలిపెట్టువంటి దెబ్బ తగిలింది. వీటన్నిటికంటే మించి యీ గ్రంథాలయాన్ని పెంచి పోషించిన ఉదారపురుషుడు, త్యాగశీలుడు అయిన రావిచెట్టు

రంగారావుగారు 1910లో దివంగతులైనారు. గోరుచుట్టుపై రోకలిపోటులాగ వరుసగా వచ్చిన యీ సంఘటనలు కార్యకర్తలలో కొంత నిరుత్సాహాన్ని కలుగజేయకపోలేదు. కాని ఈ నిలయ ప్రారంభకుల దీక్షవలన స్ఫూర్తిని పొందిన యువకులు దీని అభివృద్ధికి కంకణం కట్టుకున్నారు.

*భవన నిర్మాణం*

నిలయ పాలకవర్గం రావిచెట్టు రంగారావుగారి స్మృతి చిహ్నంగా భవనాన్ని నిర్మింప నిశ్చయించుకున్నారు. తొలి సమావేశంలోనే రు 1200/- కు వాగ్దానాలు లభించాయి. ఆ తర్వాత రంగారావుగారి ధర్మపత్ని లక్ష్మీనరసమ్మగారు రు 3000/- లు విరాళం ప్రకటించారు. అంతేగాక నిలయ యావజ్జీవ ప్రధాన పోషకులు మునగాల రాజాగారు రు 1250/-, కర్పూరం పార్థసారథినాయుడుగారి స్మారక నిధికి లభించిన విరాళం రు 785/- ఈ పనికి వినియోగించబడ్డాయి. ఇంకా ప్రజల నుంచి రు 11533/- వసూలు చేయబడ్డాయి. ఎట్టకేలకు ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు, రాజా మొదలియార్, నాచుపల్లి గౌరీశంకరవర్మ, లాల్జీ, మేఘ్‌జీగార్ల నిరంతర కృషివలన సుల్తాన్ బజార్‌లో ఒక యింటిని కొని, దానిని సమూలంగా తీసివేసి భవనం నిర్మించారు. దీని నిర్మాణం 1921న పూర్తి కాగా విద్యావేత్త కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రారంభోత్సవం చేశారు. దీనితో నిలయానికి భవనపు కొరత తీరింది.

గ్రంథాలయం నగరం నడిబొడ్డున ఉండటంతో తెలుగు సంస్కృతికి సంబంధించిన సమావేశాలు జరుపుకోడానికి యిది ఎంతో వీలుగా ఉంది. అయితే ఈ సమావేశాలకు స్త్రీలు కూడా పాల్గొనుటకు వసతి సరిగా లేకున్నది. ఈ లోటును తీర్చడానికి వేలూరి రంగధామనాయుడుగారు ప్రయత్నించారు. తత్ఫలితంగా భోజరాజులు నాయుడు, రావుబహద్దుర్ రామన్న, పుల్లయ్య, రావుబహద్దుర్ సేట్ లక్ష్మీనారాయణ, సింగారవేలు మొదలియారు, రాజా ప్రతాపగిర్జిగార్ల సహకారం వలన బాల్కనీ అమరింది.

సంస్కృతిక కార్యక్రమాలు

ఎప్పుడూ ఏదోవక కార్యక్రమాన్ని నిర్వహిస్తూ గ్రంథాలయాన్ని ఒక సజీవ సంస్థగా చేయడంలో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయానికి పెట్టింది పేరు. ప్రజాసేవయందభిలాష, ఆంధ్రజాతియందు మక్కువ, ఉత్సాహం పుణికిపుచ్చుకున్న కార్యకర్తలు యీ నిలయ కార్యవర్గంలో ఉండటమే యిందుకు కారణం. గత నాలుగైదు దశాబ్దాలనుంచి యీ నిలయంలో సభలు, సమావేశాలు, వర్ధంతులు, సన్మానాలు, కవిసమ్మేళనాలు, కథాకాలక్షేపాలు వందలాదిగా జరిగాయి. అందు ముఖ్యంగా కృష్ణదేవరాయలు, నన్నయ, తిక్కన, వీరేశలింగం, లక్ష్మణరావుగార్ల వర్ధంతులు ప్రత్యేకంగా పేర్కొనదగినవి. తెలుగు జాతికి మణిమకుటాలైన ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారికి 1912లో స్వర్ణపతకం బహూకరింపబడింది. కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు

గారు 1915లో సత్కరించబడ్డారు. అలాగే చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు, ప్రొఫెసర్ కోడి రామమూర్తినాయుడు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు మొదలైనవారెందరో మహానుభావు లందు సత్కరించబడ్డారు.

కల్యాణానందభారతీ స్వాములవారు, కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు, ఆదిపూడి సోమనాథరావుగారు, విద్వాన్ మాడేపల్లి వెంకటరమణాచార్యులుగారు, శేకుమళ్ళ రాజగోపాలరావుగారు, యామినీపూర్ణ తిలకమ్మగారు, అష్టావధాని పతి త్రియంబకరావుగారు మొదలైన కవిపండితులు తెలుగు సాహిత్యాన్ని గురించి యిచట ఉపన్యాసాలు చేశారు.

ఈ గ్రంథాలయంలో నిర్వహించబడిన ఉత్సవాలలో అఖిలాంధ్ర కథకుల సమ్మేళనం, అఖిలాంధ్ర కవులసమ్మేళనం, పోతన వర్ధంతి సప్తాహం (1940), భువనవిజయ సప్తాహం (1942), రెడ్డియుగ సారస్వత సప్తాహం (1941), కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్ష సప్తాహం (1950), కుప్పా వీరరాఘవశాస్త్రిగారి సంపూర్ణ రామాయణ హరికథా కాలక్షేపం (1941) పేర్కొనదగినవి. ఈ సభలు, సదస్సులు, సప్తాహాలవలన తెలంగాణాలో తెలుగు భాషపై అభిమానం, సాహిత్యపరిశోధనపై మక్కువ పెరగ నారంభించింది.

అంతేగాక ఈ గ్రంథాలయాన్ని డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, గొల్లపూడి సీతారామశాస్త్రి, ఆంధ్రకేసరి ప్రకాశం, దువ్వూరి రామిరెడ్డి, నాళం కృష్ణారావు, మున్నంగి లక్ష్మీనరసింహశర్మ, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ మొదలైన ప్రముఖులు ఎందరో సందర్శించి కృషిని ప్రశంసించారు.

*భవన విస్తరణ*

ఎల్లప్పుడు జరిగే సాంస్కృతిక కార్యకలాపాలకు భవనం విస్తరించవలసిన అవసరం ఏర్పడింది. ఈ భవనానికి పడమరగా, ఉత్తరంగావున్న యిండ్లను కొని మధ్య హాలును విశాలం చేయడానికి పదివేలరూపాయలకు మించి ఖర్చయింది. ఇందుకు రాజా నాయని వెంకటరంగారావుగారి కుమార్తె వనపర్తి రాణీ సరళాదేవి, రాజబహదూర్ వెంకటరామారెడ్డి, పింగళి కోదండరామరెడ్డి మొదలైనవారి ఆర్థిక సహాయం; ఖండవల్లి లక్ష్మీరంజనం, బి విశ్వనాథం గార్ల కార్యదక్షత ప్రధాన కారణం.

*గ్రంథ సంపద*

దీని పాలకవర్గం దీని తొలిదశలో తెలుగు గ్రంథాలు మాత్రమే విశేషంగా ఉంచడానికి నిశ్చయించినప్పటికీ రాను రాను అన్ని భాషలలోని గ్రంథాలు యిందు స్థానం కల్పించుకొన్నాయి. నిలయ స్థాపనకు కొంతకాలానికి పూర్వం రావిచెట్టు రంగారావుగారు, మరికొందరు పెద్దలతో ఏర్పాటుచేసిన దేవనాగరిలిపిలోగల అపూర్వ గ్రంథపరిచయంగల సంస్కృత

గ్రంథాలయాన్ని యిందు విలీనంచేశారు. ఆ తర్వాత ప్రభుత్వ ఆర్థిక సహాయంచేతగాని, స్వచ్ఛంద సంస్థల, చదువరుల విరాళాలచేతగాని యీనాడు సుమారు 15,000 పుస్తకాలు యీ గ్రంథాలయంలో చేరాయి. సుమారు 75 పత్రికలు తెప్పించబడుతున్నాయి. అనేక విజ్ఞాన సర్వస్వాలు, నిఘంటువులు, దర్శినులుగల సమాచార విభాగం విజయవంతంగా పనిచేస్తున్నది.

*గ్రంథ సూచి*

గ్రంథాలయానికి వచ్చే చదువరికి యిందుగల పుస్తకాల వివరాలను అందజేసే ఉద్దేశంతో రెండుసార్లు ముద్రణ సూచనలను సిద్ధం చేశారు. కొత్త పుస్తకాలు ఎప్పటికప్పుడు హెచ్చుగా రావడంతో యీ ముద్రిత సూచీలకు త్వరగా కాలదోషం పడుతున్నది. అందుచేత గ్రంథాలన్నింటినీ శాస్త్రీయమైన విధానంలో వర్గీకరించి కార్డు పద్ధతిపై సూచీని తయారుచేయడం ప్రారంభించి చాలవరకు పూర్తిచేశారు. దీనితోబాటు-గ్రంథాలయ అమరిక, అరువిచ్చు విధానం మొదలైన విషయాలలో ఆధునిక విధానాలను అనుసరించిన యెడల చదువరులకు యీ గ్రంథాలయం మరింత ప్రయోజనకరంగా ఉండటానికి వీలుంది.

ఉత్సవాలు

విశాలాంధ్రావనిలో దాదాపు 60 సం పైబడి పనిచేసే గ్రంథాలయాలు చాలా వున్నాయి. కాని దేనికీ శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయానికి ప్రజలనుంచి వచ్చినంత

ఆదరణ, ప్రోత్సాహము రాలేదు. అందుచేతనే దీనికి 1927లో రజతోత్సవాలు, 1953లో స్వర్ణోత్సవాలు, 1962లో వజ్రోత్సవాలు ఎంతో విజయవంతంగా నిర్వహించబడ్డాయి. ఈ ఉత్సవాల సందర్భంలో సర్వాంగ సుందరంగా సంచికలు ప్రచురింపబడటమేగాక గ్రంథాలయ ప్రగతికి కృషిచేసిన పెద్దలను గౌరవించడం, సాహిత్యం, సంస్కృతి మొదలైన అనేక విషయాలపై గోష్ఠులను ఏర్పాటుచేయడం జరిగింది. ప్రతి ఉత్సవానికి ఆంధ్ర ప్రాంతంలోని ప్రముఖులు కూడ ఆహ్వానించబడి ప్రాంతీయ భేదాలు మరచి యీ ఉత్సవాలు ఆంధ్రజాతి గౌరవానికి ప్రతీకగా నిర్వహించబడ్డాయి.

నేటివరకూ ఈ గ్రంథాలయం హైదరాబాదులో జరిగే అనేక కార్యక్రమాలకు కేంద్రంగా ఉపయోగపడుతూనే ఉంది. తెలుగు సంస్కృతికి ప్రతిబింబంగా పనిచేస్తూనే ఉంది. శ్రీకృష్ణదేవరాయలు, అష్టదిగ్గజాలు, గ్రంథాలయాభివృద్ధికి పాటుపడిన నాయని వెంకట రంగారావు, కొమర్రాజు లక్ష్మణరావు ప్రభృతుల వర్ణచిత్రాలతో తెలుగుతనం మూర్తీభవించినట్లుగా ఉట్టిపడేలాగున ముచ్చటగా వుంది. దీనిలోని పుస్తక సంఖ్యను పెంచి, పరిశోధనకు వసతులు కల్పించి, గ్రంథాలయం ద్వారా తెలుగుజాతి వికాసానికి, తెలుగు సంస్కృతి వికాసానికి అవకాశాలు కల్పించినపుడు ఆంధ్రదేశ చరిత్రలో యీ గ్రంథాలయం ధ్రువతారగా నిలచిపోవడానికి అవకాశం ఉంది.

—

# గౌతమీ గ్రంథాలయం, రాజమండ్రి
# 11

ఆంధ్ర దేశ చరిత్రలో రాజమహేంద్రవరానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. సుమారు వేయి సంవత్సరాలనాడు పాలించిన చాళుక్యరాజులకు, ఆ తర్వాత వచ్చిన రెడ్డిరాజులకు యీ రాజమహేంద్రవరం రాజధానిగా ఉండి సంస్కృతి సంపదలను వెలయించినది. రాజరాజ నరేంద్రుని కొలువులో మంత్రి, పురోహిత, దండనాయక, దౌవారిక - మొదలైన వారితోబాటు అపారశబ్ద పారంగతులైన వైయాకరణులు, భారతరామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులు, మృదుమధుర రసభావాలతో కూడిన వచన రచన చేయగల మహాకవులు, సమస్తశాస్త్రాలను పుక్కిటబట్టిన తర్కశాస్త్ర పండితులు మొదలైన వారెందరో ఉండేవారని నన్నయ భారతం వలన తెలుస్తుంది. దీనినిబట్టి చాళుక్యరాజుల కాలంలో కవిపండితులకున్న మన్నన, మర్యాద మనం ఊహించుకోవచ్చు.

తరువాత రెడ్డిరాజుల కాలంలో పాండిత్యపోషణ యింత మిన్నగా లేకపోయినా సాహిత్య ఆదరణ యితోధికంగా ఉంది. ఆ తర్వాత సాహిత్యవాణి నాలుగైదు శతాబ్దాలు మూగబోయినప్పటికీ గత శతాబ్దారంభంలో సాహిత్యలతలు కొత్త చివుళ్లు సంతరించుకొని సుమసౌరభాలు పరిమళింపజేసినవి. దాదాపు ఒకే కాలంలో కందుకూరి వీరేశలింగం,

వడ్డాది సుబ్బారాయ కవి, జలదారి వీరనారాయణ కవి, చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులు, చిలుకూరి నారాయణరావు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం పంతులు, భావరాజు కృష్ణారావు, న్యాపతి సుబ్బారావు, నాళం కృష్ణారావు మొదలైన కవి పండితు లెందరో ప్రాచీన వైభవాన్ని మరిపించారు. ఈ మహనీయుల ప్రభావంతో రాజమహేంద్రవరంలో అనేక ప్రజోపయోగమైన సంస్థలు వెలిశాయి. వాటిలో ఉత్తమ గ్రంథ సంకలనంలో విశేష ప్రశంసల నందుకొన్న గౌతమీ గ్రంథాలయం ఒకటి.

### ప్రారంభం

పౌరగ్రంథాలయ ప్రయోజనాన్ని చవిచూడని గత శతాబ్ది నాలుగవ పాదంలో ఒక గ్రంథాలయాన్ని స్థాపించవలెనను కుతూహలం రాజమహేంద్రవరంలో ఒక సంపన్న కుటుంబానికి చెందిన యువకుడు నాళం కృష్ణారావుగారికి కలిగింది. అప్పటికే కృష్ణారావుగారికి సాహిత్యాభిలాష, ప్రజా ఉద్యమాలందు అభిమానం ఉంది. తనవద్దనున్నవి, మిత్రులవద్దవి కొన్ని వందల పుస్తకాలు సేకరించి తమ పూర్వులు నిర్మించిన "నాళం వారి సత్రం"లోని ఒక గదిలో 1898లో యీ గ్రంథాలయాన్ని స్థాపించారు. అప్పట్లో దానికి ఏ పేరూ లేదు. సామాన్య ప్రజలందరు వినియోగించుకోడానికి వీలుగా ఉండేది. తొలి రోజులలో కృష్ణారావుగారికి సహచరులైన యువకుల సహకారం లభించింది. వారందరూ యీ గ్రంథాలయాభివృద్ధికి సాయపడ్డారు.

*వీరేశలింగం ఉద్యమాలు*

ఆ రోజులలో కొత్తగా తలెత్తిన వీరేశలింగం సంఘ సంస్కరణ, యితర ఉద్యమాలు కృష్ణారావుగారిపై మంచి ప్రభావాన్ని కలిగించాయి. కృష్ణారావుగారు వీరేశలింగంగారి అనుచరులలో ఒకరయ్యారు. మిత్రులతో సంప్రదించి ఆ గ్రంథాలయాన్ని మరొక యింటిలోకిమార్చి ఆ మహానీయు నిపై గౌరవాధిక్యంతో వీరేశలింగ పుస్తక భాండారం అను పేరు పెట్టారు. పిదప యీ గ్రంథాలయం వీరేశలింగం పంతులు గారు నిర్మించిన పురమందిరానికి మార్చబడింది. మరల కొన్ని పరిస్థితుల కారణంగా యీ గ్రంథాలయ నామం సర్వజన పుస్తక భాండాగారంగా 1914లో మార్చబడింది. కేవలం యీ గ్రంథాలయం ఒకవైపున పలువురు యువకులను ఆకర్షించి మరొకవైపున పరస్పర ద్వేషాలకు, కావేషాలకు, ఆవేశాలకు గురయింది. ఒకప్పుడు వ్యక్తిగత రాజకీయాలలో ప్రముఖస్థానం ఆక్రమించింది. తుదకు పురమందిరం నుండి ఆ గ్రంథాలయం మరొక యింటికి తరలించబడింది. ఎన్ని ఒడుదుడుకులను ఎదుర్కొన్నప్పటికీ యీ గ్రంథాలయం ముఖ్యంగా నాటి విద్యార్థులైన యువకులను ప్రత్యేకంగా ఆకర్షించింది. వారిలో నవీనభావాలు, నవీనచైతన్యం పాదుకొల్పడానికి, అనేక ఉద్యమాలు నిర్వహించడానికి నాడు ఎంతో తోడ్పడింది. గ్రంథాలయం గూడ ఎంతగానో పెరిగి పెద్దదైనది.

## గౌతమీ గ్రంథాలయం

సూక్తిసుధానిధి వడ్డాది సుబ్బారాయ కవి నాటి ప్రసిద్ధు లలో ఒకరు. వారి గౌరవార్థం వారి అనుచరులైన అద్దంకి సూర్యనారాయణశర్మగారు 1910లో వసురాయ గ్రంథాల యాన్ని స్థాపించి నడుపుతున్నారు. అయితే వసురాయ గ్రంథా లయం, వీరేశలింగ గ్రంథాలయాల తాలూకు సభ్యులు దాదాపు ఒకరే. పైగా యీ రెండు వేరువేరుగా ఒక యింట్లో నిర్వహించబడుతూ ఉన్నాయి. ఈ రెంటినీ విలీనం చేయడం వలన హెచ్చు ప్రయోజనాన్ని పొందవచ్చునని పలువురు సభ్యులు సూచనచేయగా, చివరకు యీ రెంటిని కలిపి గౌతమ గ్రంథాలయంగా నామకరణం చేయడానికి 1919లో నిర్ణయం జరిగింది. ఇది 1920లోనే రిజిష్టరుకూడ చేయడం జరిగింది. ఈ రెంటినీ కలిపాక యీ గ్రంథాలయాన్ని మరింత హెచ్చుగా పెంపుదలచేసే అభిప్రాయం కార్యకర్తలకు కలిగింది.

## భవన నిర్మాణం

ఈ గ్రంథాలయం స్థాపించి చాల సంవత్సరాలు పైబడిన తర్వాత దీనికి స్వంతభవనం నిర్మించాలనే ఆలోచన కార్య నిర్వాహక వర్గమునకు వచ్చింది. ఎన్ని శ్రమల కోర్చయినా పని సాధించవలయుననే పట్టుదల వారి నావేశించింది. భవన నిర్మాణానికి కంచుమర్తి వెంకట సీతారామచంద్రరావుగారు రు 6000/- నాళం కృష్ణారావుగారు రు 3000/- గోదావరి జిల్లాబోర్డువారు రు 3000/- పురప్రముఖులు రు 1500/- యిచ్చిన ఉదారమైన విరాళములతో చరిత్ర ప్రసిద్ధమైన

రాజరాజ నరేంద్రుని కోటబురుజుపైనున్న విశాలమైన సుందర మందిరాన్ని కొని స్వంతభవనం లేని కొరత తీర్చారు. సభలు, సమావేశాలు జరుపుకోడానికి యీ భవనం చుట్టూ విశాలమైన స్థలం సుమారు 3000 చదరపు గజాలుంది. ఆ తర్వాత కంచుమర్తి సీతారామచంద్రరావుగారు తమ కుమార్తె స్మారక చిహ్నంగా గ్రంథాలయావరణ యందు మహిళాభ్యుదయ కార్యక్రమాలు నిర్వహించుకొనే నిమిత్తం బాబాయమ్మ స్మారక భవనాన్ని నిర్మించారు. ఇప్పటికీ యీ భవనంలో మహిళల కార్యక్రమాలు జరుగుతున్నవి.

*గ్రంథ సంపద*

గ్రంథాలయం స్థాపించినప్పటినుంచీ దీనికి పండితుల, కవుల, శ్రీమంతుల అండదండలుండటంచేత అనేక ఉత్తమ గ్రంథాలు చేరాయి. తెలుగు సాహిత్యంలో అచ్చయిన ప్రతి ఉత్తమ గ్రంథం యిందు స్థానం ఏర్పరచుకున్నది. అంతేగాక సుప్రసిద్ధ పండితులు కొక్కొండ వెంకటరత్నంగారి పేర రాజమహేంద్రవరంలో నిర్వహింపబడుతున్న 'రత్నకవి గ్రంథాలయం' బోడపాటి సూర్యనారాయణగారి కృషివలన గౌతమీ గ్రంథాలయంలో విలీనం చేయబడింది. ఈ విధంగా అనేక మార్గాలనుండి ఉత్తమ గ్రంథాలు సంతరించబడినవి. నేటికి యీ గ్రంథాలయంలో 60వేల వరకు పుస్తకాలున్నవి. ప్రయివేటు యాజమాన్యాలలో నిర్వహించబడే గ్రంథాలయాలలో యిది అగ్రగణ్యమైనదని చెప్పవచ్చు. ముఖ్యంగా వ్యాకరణం, ఛందస్సు, అలంకారశాస్త్రం మొదలైన విషయాలలో

యిచట ఉన్నన్ని అపురూప గ్రంథాలు మరెచ్చటా లేవంటే ఆశ్చర్యం లేదు.

పత్రికా సంపుటాలు

ముఖ్యంగా పంథొమ్మిదో శతాబ్ది చివరి భాగం, యీ శతాబ్ద తొలి భాగంలో అచ్చయి తెలుగు సంస్కృతికి ప్రతిబింబాలుగా నున్న శారద, కవిత, వాసవి, మనోరమ, అముద్రిత ఆంధ్రగ్రంథ చింతామణి, స్వధర్మప్రకాశిని, హిందూ సుందరి మొదలైన పత్రికల సంపుటాలు యీ గ్రంథాలయానికి ప్రత్యేక ఆకర్షణ. ఈ పత్రికల సంపుటాలు యిచట తప్ప ఆంధ్రదేశంలో మరెచ్చటా లేవు. దీనినిబట్టి యీ సంపుటాల ప్రాముఖ్యతను మనం ఊహించుకోవచ్చు.

వ్రాతప్రతులు

తెలుగు సాహిత్యంలో విలువైన భాగం తొలుత వ్రాతప్రతుల మీదే లభించబడి భద్రపరచబడింది. రాగిరేకుల మీద చెక్కబడినవి, తాటియాకులు, కాగితాలమీద వ్రాయబడినవి యీ గ్రంథాలయంలో వెయ్యికి పైగా గ్రంథాలున్నవి. ఈ వ్రాతప్రతులలో అధికభాగాన్ని పెద్దాపురం జమీందారీ వంశీకుడైన రాజావత్సరాయ జగపతిశర్మగారు యీ గ్రంథాలయానికి దానం చేశారు. కల్లికోట రాజావారి కళాశాలాంధ్ర పండితులైన నేమాని సుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే రచించబడిన ఋగ్వేదసంహిత తెలుగు పద్యకావ్యం సుప్రసిద్ధ కవులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి కృషి వలన యీ గ్రంథాలయానికి చేర్చబడింది. పురాణప్రసిద్ధమైన

వ్యక్తుల గాథలు సవివరంగా తెలుపగల గుంటుబోయిన సన్యాసినాయుడుగారి రచన వంశవృక్ష ప్రదర్శిని యిందు గలదు. దీనికి ముద్రణభాగ్యం కల్పించిన అపూర్వమైన రెఫరెన్సు గ్రంథంగా ఉపయోగడపగలదు.

ఇవిగాక సుప్రసిద్ధ వైయాకరణ సమీక్షకులు కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగారి పరిషేను శేఖరమ్ - చిత్రప్రభావ్యాఖ్య, గంగాధరభట్టు రచన మనోరమా శబ్ద రత్నమ్ మొదలైన ఉత్తమశ్రేణి సంస్కృత వ్రాతప్రతులను యీ గ్రంథాలయానికి దానం చేశారు. సంస్కృతాంధ్ర భాషలలో యిచటగల వ్రాతప్రతులన్నిటికీ వివరణాత్మకసూచి తయారుచేసి ప్రచురించిన పరిశోధకులకు అత్యంత ప్రయోజనకారిగా నుండగలదు.

### సాంస్కృతిక కార్యకలాపాలు

గ్రంథాలయం స్థాపించినప్పటినుంచి యిచట సాంస్కృతిక కార్యకలాపాలు జరుగుతూనే ఉన్నవి. కవి సమ్మేళనాలు, సాహితీసభలు మొదలైనవి ఎన్నో జరిగాయి. ఇవిగాక నేటికీ యీ గ్రంథాలయ ఆవరణలో స్త్రీలకు కుట్టుమిషను, పాఠశాల, అందరి ఉపయోగార్థం హిందీపాఠశాల, మరొక వ్యాయామ విద్యాలయం నిర్వహింపబడుతున్నవి. నగర కార్యకలాపాలలో సముచిత స్థానం దీనికి ఉన్నది.

### నేటి పరిస్థితి

ఒకప్పుడు తన కీర్తిచంద్రికలను ఆంధ్రదేశమంతటా వెదజల్లిన యీ గ్రంథాలయం సర్వవిధాల చితికిపోయిన

సంపన్న గృహస్థుని పోలి ఉంది. ధూళిధూసరమైన వాతావరణం, బీటలువారిన గోడలు, క్రుంగి కూలిపోవడానికి సిద్ధంగానున్న భవనం, క్రమబద్ధంలేని నిర్వాహణ చూస్తే హృదయం కల వ్యక్తికి, నాటి రాజమహేంద్రవరపు కీర్తిప్రతిష్ఠలు తలచుకొన్న వ్యక్తికి హృదయం ద్రవింపక మానదు. ఒక తరంలో అనేక కష్టనష్టాలకు ఓర్చి, శ్రమించి సంకలనం చేసిన మణిరత్నకూటాన్ని మించిన అపూర్వమైన, అపారమైన, అమూల్యమైన గ్రంథసంపద సముచితమైన, సమయోచితమైన ఆలనాపాలనా లేక మట్టిలో కలసి పోతున్నాయి. క్రిమికీటకాలకు ఆహుతి ఔతున్నాయి. శక్తినిమించి కృషిచేస్తున్న మహీంధర జగన్మోహనరావుగారి శ్రమ దీని అభివృద్ధికి చాలడంలేదు. గ్రంథాలయం మూసివేయకుండా నడిపించడానికి మాత్రం పనికివస్తున్నది.

ఏమైనప్పటికి యీ గ్రంథాలయానికి ఆధునిక పద్ధతిలో భవనం నిర్మించి అపూర్వమైన గ్రంథసంచయం ఆంధ్రజాతికి శాశ్వతంగా దూరంకాకుండా కాపాడవలసి ఉంది. ఇందుకు ముఖ్యంగా ప్రభుత్వం, జిల్లా గ్రంథాలయ సంస్థ, రాజమహేంద్రవర పురప్రముఖులు కృషిచేయవలసి ఉంది. లేకపోతే మన సంస్కృతి సంపదకు తీరని నష్టం సంభవించే ప్రమాదం ఉంది. మన దురదృష్టవశాత్తు దాన్ని ఏ వ్యక్తి, ఏ శక్తి, ఏ సమాజమూ, ఏ సంఘమూ పూడ్చలేవు!

కొంత ఓదార్పు

ఈ గ్రంథాలయాభివృద్ధికి ఏటేటా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, తూర్పుగోదావరిజిల్లా గ్రంథాలయం సంస్థవారు కొంత

విరాళం యిస్తున్నట్లు తెలిసింది. ఈ సందర్భోచితమైన విరాళా నికి వారిని సర్వవిధాల అభినందించవలసిందే. వారి విరాళం ముప్పయి వేలకు పెరిగిననాడు, ఈ గ్రంథాలయానికి చేయూ తను వారి అభివృద్ధి కార్యక్రమాలలో ఒకటిగా స్వీకరించిన నాడు వారి సేవా నిరతి పరాకాష్ఠ నందుకుంటుంది. గ్రంథా లయసంస్థ స్థాపనోద్దేశం అక్షరాల సమకూరుతుంది.

ఆనాడే యీ గ్రందాలయం కోసం అహార్నిశలు కృషి చేసిన, ఆంధ్ర దేశానికి మణిదీపాలువంటి వారైన కందుకూరి వీరేశలింగం, వడ్డాది సుబ్బారాయకవి, నాళం కృష్ణారావు మొదలైనవారికి ఆత్మశాంతి కలుగుతుంది. అందుచేత ఆత్యా యికమైన యీ విషయానికి రాజమహేంద్రపురవాసులు తగిన ప్రాధాన్యత యివ్వవలసిన అవసరం వచ్చింది.

—

# వర్ధమాన సమాజం, నెల్లూరు

# 12

వైశాల్యంలో, విస్తీర్ణంలో, సిరిసంపదలలో, పాడిపంటలలో నెల్లూరు మండలానికి మించినవి తెలుగునాట లేకపో లేదు. కాని సంస్కృతీ సమారాధనలో, సాహిత్యపిపాసువుల సమాదరణలో, సాహితీ సంస్థల పోషణలో నెల్లూరు మండలానికి దీటైనవి లేకపోవచ్చును. దాదాపు గత వేయి సంవత్సరాలనుండి యీ మండలానికి యశశ్చంద్రికలు ఛాయ తగ్గక నిలచి ఉన్నాయి. తెలుగు నుడికారానికి యింపుసొంపులను సమకూర్చిన మహాకవి తిక్కన, గుడ్లూరు శంభుదాసుడైన ఎఱ్ఱన, సాహితీ సామ్రాజ్యంలో సార్వభౌమాధికారం గల శ్రీనాథుడు, ముగ్ధమనోహరంగా రామకథ నాలపించిన మొల్ల, యింకా జక్కన, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, మారన, గోపీనాథము వెంకటకవి యీ మండలానికి చెందిన ధ్రువతారలే.

ఆధునిక యుగంలో ఉద్దండ పండితులు, కవులు, విమర్శకులు వేదం వెంకటరాయశాస్త్రి, ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావు, కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మ, కవికోకిల దువ్వూరి రామిరెడ్డి ప్రభృతులవంటి మహానుభావు లెందరికో సింహపురి మాతృస్తన్య మిచ్చింది. అలాగే పత్రికారంగంలో బెజవాడ పట్టాభిరామరెడ్డి, పూండ్ల రామకృష్ణయ్య, మరు

పూరు కోదండరామరెడ్డి, బంగోరే గారల సాహితీ సౌరభా లను దేశమంతటా వ్యాపించే అవకాశాన్ని కలిగించింది.

చారిత్రకంగా చూచినా నెల్లూరు మండలానికి దక్షిణ భారత చరిత్రలో ప్రత్యేకమైన స్థానమున్నది. ఈనాటి రాజ కీయ రంగంలో, సాంఘిక రంగంలో, నాటక రంగంలో నెల్లూరుకు గణనీయమైన స్థానం ఉన్నది. కనుక అనేకవిధాల అగ్రస్థానం వహించిన యీ మండలంలో అనేక సంస్థలు ప్రభ వించి ప్రకాశించడంలో సందేహం లేదు. వానిలో ఒక సము చితస్థానం అలంకరించిన నెల్లూరు వర్ధమాన సమాజం గురించి కొన్ని విషయాలు తెలుసుకొందాం.

*యువతరం ముందంజ*

చరిత్ర పుటలను ఒక్కసారి తిరగవేసినట్లయితే యువ తరానికి, సామాన్య మానవ ప్రగతికి స్థానం ఉన్నట్లు కనుపించే ఉదంతాలు బహు తక్కువ. గతకాలంలో రాజులు, శ్రీమం తుల, మతిమంతుల వినోదాలకు, సరదాలకు సామాన్య మాన వుడు ఉపయోగపడేవాడు. గత శతాబ్ది తుది పాదంలో ప్రారంభమైన సంఘసంస్కరణ ఉద్యమాలు, రాజకీయ ఉద్య మాలు, ప్రజానీకంలో చైతన్యాన్ని కలిగించాయి. యువ తరంలో అణగారిన శక్తియుక్తులను ఉద్దీపనం చేసినవి. సంఘ పురోగతి, దేశాభివృద్ధి తమ బాధ్యతగా గుర్తించిన యువ కులు తమకు అభిరుచివున్న విషయాలలో సమిష్టికృషి కొన సాగించే నిమిత్తం అనేక సంఘాలను, సమాజాలను దేశంలో స్థాపించుకొంటూ వచ్చారు. ఇందువలన వచ్చిన ధనాన్ని

ప్రజోపయోగ కార్యాలకు వినియోగ పరచుకుంటూ వచ్చారు.

గత శతాబ్ది పూర్వభాగంలో మహారాష్ట్ర దేశంనుంచి ధార్వాడ నాటక కంపెనీవారు నెల్లూరువచ్చి చాలకాలం నాటకాలాడారు. ఈ నాటక ప్రదర్శనలు యువకులలో ఉత్సాహాన్ని కలిగించినవి. నాటకప్రదర్శనలందు అభిమానం గల యువకులు ఎమెచ్యూర్ డ్రెమిటిక్ సొసైటీ పేరున నాటక సమాజాన్ని స్థాపించారు. వీరికి ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారి ప్రోత్సాహం లభించింది. వారి నాటకాలే అనేకం ప్రదర్శించారు. ఈ నాటకాల వలన వచ్చిన డబ్బును ప్రజోపయోగ కార్యాల నిమిత్తం వెచ్చిస్తూ వచ్చారు.

ఇలా ఉండగా మరికొందరు యువకులు ఒక హాస్టలును, ఉచిత పఠన మందిరాన్ని ఏర్పాటుచేయడానికి సంకల్పించారు. విద్యార్థులకు హాస్టలు నిర్వహించడం అప్పట్లో కష్టమనిపించింది. పఠన మందిరం స్థాపనకు ప్రయత్నాలు చేస్తూవచ్చారు. ఇదే సమయంలో విద్యార్థులు బీజాన్ సొసైటీ అని ఒక సంఘాన్ని, మద్రాసులో ఉన్నతవిద్య అభ్యసిస్తూ సెలవులలో వచ్చిన విద్యార్థులు నెల్లూరు స్టూడెంట్స్ యూనియన్ పేరున మరొక సంఘాన్ని స్థాపించారు.

## వర్ధమాన సమాజం

ఇంతకు ముందు స్థాపించబడ్డ మూడు నాలుగు సంఘాలు వేరు వేరుగా ఉన్నప్పటికీ ఆశయాలలో మార్పు

ఏమంతగా లేదు. అందుచేత యీ యువకుల కృషి మరింత యినుమడింప జేసేందుకు సంఘాలను కలిపి వర్ధమాన సమాజంగా (నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్) 1906 జనవరి 6వ తేదీన ఏర్పాటుచేశారు. ఆ తర్వాత యువజనుల దృష్టి ప్రధానంగా పఠన మందిర నిర్వహణ వైపుకు మరలింది. తత్ఫలితంగా 1907 జులై 7 తేదీ నుండి పఠనమందిరం ప్రారంభించబడింది. ఈ మందిరంపై పెళ్లేటి పెంచలు రెడ్డి గారికి ప్రత్యేక అభిమానం కలిగింది. నల్లపురెడ్డి సుబ్బారెడ్డి ఫ్రీరీడింగురూము యీ పేరుతో యీ సమాజం తరఫునే పఠనమందిరం నెల్లూరు హైరోడ్‌లో గల నల్లపురెడ్డివారి భవనంలోకి మార్చబడింది. అచట 1915 వరకూ ఉంది.

వర్ధమాన సమాజం తరఫున కొన్ని పుస్తకాలుగూడ సేకరించి అందుగల తెలుగుపుస్తకాల విభాగాన్ని తిక్కన గ్రంథాలయమని 1911 మార్చి 31 లోనూ, ఆంగ్ల గ్రంథ విభాగాన్ని కారనేషన్ ఇంగ్లీషు గ్రంథాలయమని 1911 లోనూ స్థాపించారు. సంస్కృతగ్రంథ విభాగానికి 1932లో సుప్రసిద్ధ విమర్శకులు, పండితులు వేదం వెంకటరాయశాస్త్రి గౌరవార్థం వేదం వెంకటరాయశాస్త్రి సంస్కృత గ్రంథాలయాన్ని స్థాపించారు. ఆయా భాషలలో ఉత్తమ గ్రంథాలను అనేకం సేకరించారు.

*గ్రంథాలయ భవనం*

భాషా పోషణలో, వదాన్యతలో అసమానమైన ప్రఖ్యాతి చెందిన రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు 1915లో

తెలుగు నాటికే తొలిసారిగా టౌనుహాలు నిర్మించారు. అందు కొంత భాగాన్ని శాశ్వతంగా వర్ధమాన సమాజపు అధీనం చేసి, ప్రగతికి కారకులయ్యారు. గ్రంథాలయం, పఠనమందిరమూ టౌనుహాలుకు వచ్చిన పిదప దినదిన ప్రవర్ధమానమైంది. గ్రంథాలయాభివృద్ధితో బాటు సాంస్కృతిక కార్యకలాపాలు నిత్యం జరుగుతూ వచ్చాయి. వర్ధమాన సమాజ సంస్థలతో, కార్యకలాపాలతో నెల్లూరు పురజనులకు సన్నిహిత సంబంధం ఏర్పడింది. గ్రంథ విభాగానికి, పఠన మందిరానికి ప్రస్తుత భవనం చాలకపోవడంతో రేబాలవారు టౌనుహాలుకు ప్రక్కనే మరొక భవనం నిర్మించగా 1952లో దీనికి రేబాల పట్టాభిరామరెడ్డి పఠన మందిరం అని నామకరణం చేశారు. నిరంతరం పెరిగిపోతున్న అవసరాల దృష్ట్యా యీ భవనాన్ని విస్తరించవలసిన అవసరం గూడ ఎంతో కనిపిస్తోంది. ఇంత కాలమూ వర్ధమాన సమాజ ప్రగతికి వెన్నెముకగా నున్న, వదాన్యతలో వాసికెక్కిన రేబాల కుటుంబం వారికీ, నెల్లూరు పురజనులకు యిదేమంత శక్తికి మించిన పనిగాదు.

*గ్రంథ సంపద*

చదువు సాములకు, కవి పండితులకు నెల్లూరు మండలం కాణాచి అని చెప్పవచ్చు. అందుకు ప్రతిబింబంగా నెల్లూరులోని సంస్థలు ఉన్నాయి. సంస్థలలో చేవా ఉన్నది. నెల్లూరు వర్ధమాన సమాజంలో తెలుగులో 15,000 గ్రంథాలు, ఆంగ్లములో 11,000, సంస్కృతంలో 2,040 హిందీ, తమిళ, కన్నడ, బెంగాలీ మొ భాషలలో సుమారు 700 గ్రంథాలు

మొత్తం పాతిక వందల వరకు యిందు గ్రంథాలున్నవి. ప్రయివేటు యాజమాన్యంలో నిర్వహించబడే గ్రంథాలయాలలో యిన్ని పుస్తకాలుండటం సామాన్యమైన విషయం కాదు. హెచ్చు పుస్తకాలు సంతరించామని సంబరపడటంకంటే ఉపయోగకరమైన పుస్తకాలు, ఉదాత్తమైన గ్రంథాలు ఎంత హెచ్చుగా సేకరించామని పరిశీలన చేసికొంటే – యీ దృష్టిలో యీ గ్రంథాలయానికి అగ్ర స్థా న ం లభిస్తుంది. ఛందస్సు, అలంకారశాస్త్రం, వ్యాకరణం మొదలయిన లక్షణ గ్రంథాలు యిచట వేయికి పైగా ఉన్నవి. ఈ విషయంపై యిన్ని ఉత్తమ గ్రంథాలు మరెచ్చటా లేవు. పైగా మరే గ్రంథాలయంలో లభించని గ్రంథాలు, ముద్రణలో ఒకే ప్రతిగా మిగిలిన గ్రంథాలు యిందు భద్రంగా ఉంచడం నెల్లూరు పౌరుల, ఆంధ్రుల అదృష్టమని చెప్పాలి. అందుచేత తెలుగు భాషా సాహిత్యాలలో ప రి శో ధ న చేసేవారు, సాహిత్య జిజ్ఞాస కలవారు యీ గ్రంథాలయాన్ని సందర్శింపక తప్పదు.

పత్రికలలోని రచనలలో గ్రంథస్థం కానివి అనేకం ఉంటాయి. అందుచేత యీ పత్రికలను సంపుటాలుగా భద్రపరచడం గ్రంథాలయాలు నిర్వహించదగు పనులలో ఎన్నదగినది. కాని దీనిని గుర్తించిన గ్రంథాలయాలు బహుకొద్ది. కాని యీ సమాజం యీ విషయంలో జాగ్రత్తపడి భారతి, ఆంధ్రపత్రిక, ఉగాది సంచికలు, కృష్ణాపత్రిక, మోడరన్ రివ్యూ, రీడర్స్ డైజెస్ట్ మొదలయిన పత్రికలను భద్రపరచింది.

1885లో ప్రారంభమై దాదాపు రెండు దశాబ్దాలపాటు నెల్లూరి నుంచి వెలువడ్డ "అముద్రిత గ్రంథ చింతామణి" సాహిత్య పత్రికా సంపుటాలు యిందు పదిలంగా ఉన్నాయి. అందుచేతనే యీ గ్రంథాలయం కవులకు, పండితులకు, పరిశోధకులకు, జిజ్ఞాసువులకు యాత్రా స్థలమైనది.

## సాంస్కృతిక కార్యకలాపాలు

సంవత్సరం పొడవునా సాంస్కృతిక కార్యకలాపాలు నిర్వహించడంలో వర్ధమాన సమాజానికి పెట్టింది పేరు. ఇంత పెట్టున సాహిత్య సమారాధన ఉత్సవాలను నిర్వహించే గ్రంథాలయం ఆంధ్రదేశంలో మరొకటి లేదని చెప్పవచ్చును. నెల్లూరు మండలంలోని ఉదారులైన సాహిత్యాభిమానులు ఏర్పరచిన శాశ్వత నిధులద్వారా యీ ఉత్సవాలు జరుగుతున్నవి. వదాన్యశేఖర తిక్కవరపు రామిరెడ్డిగారు కవిత్రయ జయంతులు నిర్వహించి ముగ్గురు కవులకు ఒక్కొక్కరికి రు 232 చొప్పున యివ్వడానికి, దువ్వూరి వేణుగోపాలరెడ్డిగారు కవికోకిల జయంతులు నిర్వహించి విజ్ఞాన శాస్త్రవేత్త ఒకరికి రు 600 బహూకరించడానికి, సుదర్శనారామరెడ్డి కళాభారతి వసంతోత్సవం ప్రతి ఉగాదికి జరిపి మహిళా రచయిత్రికి లేదా సంఘసేవకురాలికి రు 232 బహూకరించడానికి, అలాగే దుర్భా సుబ్రహ్మణ్యశర్మ జయంతి, వేదం వెంకటరాయ శాస్త్రి వర్ధంతి, రవీంద్ర కవీంద్ర జయంతి, రేబాల పట్టాభిరామిరెడ్డి జయంతి, తులసీదాసు జయంతి, పోతన జయంతి, శ్రీనాథ జయంతి, మొల్ల జయంతి, రామకృష్ణ వివేకానంద

జయంతి, ధన్వంతరీ జయంతి— యీ జయంతులన్నీ ఏటేటా నిర్వహించడానికి శాశ్వత నిధులు కేటాయించబడ్డాయి. ఆ నిధులనుండి వచ్చే వడ్డీతో ఉత్సవాలు నిర్వహింపబడతాయి. ఉదాత్తమైన యీ సంప్రదాయాన్ని అనుసరిస్తే తెలుగునాట గల గ్రంథాలయాలు సజీవ సంస్కృతీ కేంద్రాలుగా విలసిల్ల డానికి అవకాశం ఉన్నది.

షష్ట్యబ్ది ఉత్సవం

నెల్లూరు మండలంలో సజీవ సంస్థగా పనిచేస్తున్న వర్ధమాన సమాజపు రజతోత్సవం 1931 ఏప్రియల్ 18 తేదీన జయప్రదంగా జరిగింది. ఆ తర్వాత షష్ట్యబ్ది పూర్తి ఉత్సవం 32వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభలు జరుగుతున్న సందర్భంలో 1967 డిశంబరు 24 తేదీన అత్యంత వైభవోపేతంగా జరిగింది. దుర్గాబాయి దేశ్‌ముఖ్ దంపతులు, తెలుగునాట దశదిశల గల గ్రంథాలయ కార్యకర్తలు యీ ఉత్సవాలకు హాజరై వర్ధమాన సమాజ మందు తమకుగల ప్రగాఢ అభిమానాన్ని వెల్లడించారు.

నేటి పరిస్థితి

ఈ గ్రంథాలయం స్థాపించబడి యిప్పటికి 63 సంవత్సరాలైంది. ఇందు, అనేక ఉదాత్తమైన, అపురూపమైన పుస్తకాలు అనేక వ్యయప్రయాసల కోర్చి సేకరించబడినవి. అనేక సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహింపబడుతూ ఆవరణ నందనోద్యానంలా ఎప్పుడూ కళ కళ లాడుతూనే ఉంటుంది. కాని గ్రంథాలయ నిర్వహణ అధునాతనంగా లేదు. పెరుగుతోన్న

విజ్ఞానానికి అనువైన రీతిలో వర్గీకరణగాని, సూచీకరణ గాని యిందు లేవు. గ్రంథాలయాభివృద్ధికోసం అహర్నిశలు కృషి చేసిన గ్రంథపాలకుడు స్వర్గీయ యం వి సుబ్బారావుగారి జ్ఞాపకశక్తి మీదనే యీ గ్రంథాల అమరిక ఇంతకాలం ఆధారపడి ఉన్నది. ఇంత పెద్ద గ్రంథాలయమూ ఒక వ్యక్తి చేతిమీదుగానే నిర్వహింపబడింది. నేడు కొందరు యువకులు దీని నిర్వహణ బాధ్యతను స్వీకరించారు. అందుచేత సామాన్య మానవుడు మొదలు పరిపూర్ణ పండితుని వరకు దీనిని ఉపయో గించుకోడానికి కొంత యిబ్బంది ఏర్పడుతున్నది. కనుక యీ గ్రంథాలయంలో ప్రధానంగా గ్రంథాలయ శాస్త్రంలో శిక్షణ పొందిన గ్రంథపాలకుని నియమించి సాంకేతికంగా పటిష్ఠమొనర్ప వలసియున్నది. అధునాతనమైన పద్ధతిలో గ్రంథాలయాన్ని తీర్చిదిద్దవలసి యున్నది. భవనాన్ని తగినంతగా విస్తరించ వలసియున్నది.

ఈ కార్యకలాపాలు నిర్వహించడానికి తగినంత ధనం కావాలి. దీనిలో కొంత భాగాన్ని ప్రభుత్వంనుంచి స్వీకరించ వచ్చు. దేశానికంతకు ఆదర్శప్రాయంగా అనేక సంస్థలు నిర్వ హిస్తున్న ఉదారులు, కార్యదక్షులు నెల్లూరు మండలవాసు లకు, సాహితీ హృదయం సహృదయం గల నెల్లూరు పౌరు లకు యిదేమంత కష్టమైన పనిగాదు.

——

# శారదా గ్రంథాలయం, అనకాపల్లి
# 13

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించాకనైతేనేమి, గ్రంథాలయశాసనం అమలుపరిచాకనైతేనేమి, ముఖ్యంగా తెలుగునాటగల ప్రయివేటు గ్రంథాలయాలలో స్తబ్దత ఏర్పడినమాట వాస్తవం. ఇందుకు కారణం పై రెండు సంఘటనలే అని ఉద్యమ సారధులు చెబుతారు. కాని ఇవి ఎంతవరకు వాస్తవం? శాసనానికి పూర్వం కంటే శాసనం అమలులోకి వచ్చాక ప్రభుత్వంలో గ్రంథాలయాలకు ఒక ప్రత్యేకస్థానం ఏర్పడింది. అంతకు ముందు కంటే ప్రభుత్వం విరాళాల మొత్తాలు ఎక్కువ చేసింది. ఈ మొత్తాలు గ్రంథాలయాల నిర్వహణకు ఎంత వరకు సరిపోతున్నవనేది ఆలోచించ వలసిన విషయం. ఐతే స్వాతంత్ర్యానికి పూర్వం గ్రంథాలయ రంగంలో వందలాది కార్యకర్తలుండేవారు. స్వాతంత్ర్యం వచ్చాక వారంతా గ్రంథాలయ రంగాన్ని వదలి పదవుల కోసం పరుగెత్తారు. ఏ పదవీ లభించని వారు ఉద్యమంలో నిలచిపోయారు. అందుచేత గ్రందాలయరంగం స్వాతంత్ర్యం వచ్చాక నాయకత్వ లోపంచే కుంటుపడింది. మరి కొందరు పదవుల జోలికి పోలేదు. కాలగమనంలో వచ్చే ఆటుపోటులన్నిటినీ తట్టుకుని నాటి నుంచీ నేటి వరకు నిలబడిన చెప్పుకోదగ్గ గ్రంథాలయాలు తెలుగునాట పదికి మించి లేవు.

వాటిలో గత నాలుగయిదు దశాబ్దాలుగా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లే గ్రంథాలయాలలో అనకాపల్లిలోని శారదా గ్రంథాలయం గణనీయమైనది. గ్రంథాలయం స్థాపించినప్పటినుంచీ నేటి వరకు కొందరు కార్యకర్తలు పెట్టని కోటలా యీ గ్రంథాలయానికి అండగా నిలబడి పనిచేస్తున్నారు.

*గ్రంథాలయ ప్రారంభం*

విశాఖపట్నం జిల్లాలోని అనకాపల్లిపట్నం చిరకాలంగా వర్తక వాణిజ్యాలకు ప్రసిద్ధిగన్నది. ప్రజోపయోగ కార్యాలందు పరిణత నందినది. బెంగాల్ విభజన, వందేమాతరం, సత్యాగ్రహాలు మొదలైన జాతీయోద్యమ సంఘటనలకు ఉత్తేజితులై అనకాపల్లిలోని కొందరు యువకుల సహకారంతో, అందు ముఖ్యంగా జాతీయోద్యమ కార్యకర్తలు కోరుకొండ లింగమూర్తిగారి సహకారంతో శారదా గ్రంథాలయం 1936లో స్థాపించబడింది. తొలిదశలో కొంత నిరుత్సాహం కలిగినప్పటికీ, ద్వితీయ ప్రపంచ సంగ్రామ ప్రభావం యీ గ్రంథాలయంపై పరోక్షంగా పడినప్పటికీ ఆ బాలారిష్టాలన్నిటినీ తట్టుకొని యీ గ్రంథాలయం బయటపడింది. అనతి కాలంలోనే పురజనుల కృషితో చక్కని భవనం ఏర్పడింది. దీన్ని లింగమూర్తి హాలు అంటున్నారు.

*గ్రంథ సంకలనం*

తొలి దినాల నుంచీ యీ గ్రంథాలయానికి ఉత్తమ గ్రంథాలను సమకూర్చడంలో అత్యంత శ్రద్ధ తీసుకొనడం

జరుగుతూనే ఉంది. ఆంధ్రాంగ్ల సంస్కృత భాషలలో ప్రచురింపబడే ఉత్తమగ్రంథా లనేకం దీనికి చేర్చబడుతున్నవి. సాధారణ గ్రంథాలతోబాటు పరిశోధనకు అవసరమైన అమూల్య గ్రంథాలెన్నో యీ గ్రంథాలయానికి సంపాదింపబడినవి. ఈ సంవత్సరాంతానికి యీ గ్రంథాలయంలో మొత్తం 20,000 వరకు గ్రంథాలున్నవి. అందు ఇంగ్లీషు 5649, తెలుగు 7,000, హిందీ 1000, సంస్కృతం 231, పరిశోధన విభాగంలో ఇంగ్లీషు 529, తెలుగు 259, బాలల విభాగంలో తెలుగు 1000, ఇంగ్లీషు 300 గ్రంథాలున్నాయి.

*గ్రంథాల వినియోగం*

ఈ గ్రంథాలయాన్ని ఎవరైనా ఉచితంగా వినియోగించు కొనవచ్చును. ఐతే గ్రంథాలను అరువుగా ఇండ్లకు తీసికొని వెళ్ళేవారు నామ మాత్రంగా రుసుం చెల్లించవలసి ఉంటుంది. ఉదారులు శాశ్వత సభ్యులుగా చేరవచ్చును. విరాళాలరూపంలో సహాయపడవచ్చును. ఈ గ్రంథాలయాన్ని సగటున రోజుకు 150 మంది సందర్శిస్తున్నారు. వీరిలో పరిశోధన నిమిత్తం యితర ప్రాంతాలనుంచీ, ముఖ్యంగా ఆ సమీపంలో గల ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచీ రావడం ఒక ముఖ్య విశేషం. దీన్నిబట్టి ఈ గ్రంథాలయం ఎంత సమర్థవంతంగా నిర్వహింపబడుతున్నదో ఊహించుకోవచ్చు.

*వర్గీకరణ - సూచీకరణ*

ఆధునిక గ్రంథాలయ నిర్వహణ విధానంలో వర్గీకరణ సూచీకరణ పద్ధతులు ప్రాణతుల్యమైనవి. ఈ విషయంలో

గ్రంథాలయ నిర్వాహకులు తొలినాటి నుంచీ ఒక దేశీయ విధానాన్ని తయారుచేసికొని అమలుపరుస్తున్నారు. కొన్ని 'ఫైల్స్' పద్ధతిలో సూచీకరణ చేస్తున్నారు. పాఠకుల అవసరాన్ని గమనించి ఒకో విషయానికి సంబంధించిన గ్రంథాలు ఒకో ఫైలులో వ్రాయబడ్డాయి. ఎప్పటికప్పుడు నూతన గ్రంథాలందు చేర్చబడుతున్నాయి. ఈ విధానం ఆధునికం కాకపోయినప్పటికీ ఉపయోగం బాగానే ఉంది. ఏ విధానం అనుసరించినప్పటికీ చదువరికి కావలసిన సమాచారం సత్వరం లభించేట్లయితే అంతకంటే కావలసింది ఏముంటుంది?

*విభాగాలు*

గ్రంథాలయాలలో సాధారణంగా నిర్వహించే పుస్తక విభాగం, పత్రికల విభాగానికి తోడు యిచట బాలలకు, స్త్రీలకు, ప్రత్యేక విభాగాలున్నవి. పిల్లలు, మహిళలు, ఏ రోజైనావచ్చి ఆయా విభాగాల్లో చదువుకోవచ్చు. మహిళలకు ప్రతి శుక్రవారం సాయంత్రం వారికోసం ప్రత్యేకంగా తెరచి ఉంచబడుతుంది. వీటితో బాటు ఈ గ్రంథాలయంలో గాంధీ సాహిత్యంపై ప్రత్యేక విభాగం ఉంది. ముఖ్యంగా ఆంధ్రాంగ్ల భాషలలో గాంధీజీపై వెలువడే గ్రంథాలనన్నింటినీ యీ విభాగానికి తెప్పించి అనేక తీరులుగా యీ విభాగాన్ని అభివృద్ధిచేస్తున్నారు. ఇందు విశేషంగా ప్రశంసింపదగినది సమాచార విభాగం. (రిఫరెన్స్ సెక్షన్) ఇందు పాత దిన, వార, మాస పత్రికల సంపుటాలు, గజెట్లు, జాతీయ అంతర్జాతీయ సమావేశాల వృత్తాంతాలు ఇంకా నిఘంటువులు,

విజ్ఞానసర్వస్వాలు మొదలైనవీ, అన్నిటికంటె ముఖ్యమైనవి 30 సంపుటాలలో పత్రికల కత్తిరింపులూ, 20 సంపుటాలలో ఉత్తమ గ్రంథాల కుదింపులూ ప్రత్యేకంగా పేర్కొనదగినవి. ఇందు చివరి రెండు అంశాలు ఆంధ్రదేశంలో మరే గ్రంథాలయంలోనూ లేవనుకుంటాను. అందు మొదటిదానిలో 1944 నుంచి సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా, సాహిత్య పరంగా పత్రికలలో ప్రచురింపబడే వార్తలను, విశేషాలను విషయాలవారీగా విభజించి, కత్తిరించి, చక్కగా అంటించి సంపుటాలుగా తయారుచేశారు. ఆ తర్వాత డాక్టర్ రాధాకృష్ణన్ గారి భారతీయ తత్త్వశాస్త్రం, బర్ట్రెండ్ రసెల్ పాశ్చాత్య తత్త్వశాస్త్రం మొదలైన పెద్దపెద్ద ఉత్తమ గ్రంథాలను సంగ్రహించి చదువరులకు ఉపయోగంగా ఉండే టట్లుగా చక్కని నోట్సు తయారుచేశారు. అత్యంత అధునాతనంగా నిర్వహింపబడుతున్నాయని చెప్పుకొంటున్న పెద్దపెద్ద గ్రంథాలయాలలో డాక్యుమెంటేషన్, 'స్పేడ్సు' మొదలైన విధానాలు ఈ గ్రంథాలయంలో ఏనాడో ప్రారంభించ బడినవంటే యీ నిర్వాహకుల ముందు చూపు, ఆలోచనా పటిమ మనకు వ్యక్తమౌతుంది.

అధ్యయన అధ్యాపన

ఈ గ్రంథాలయం స్థాపించినప్పటి నుంచీ ఒక సమగ్రమైన ప్రజాసంస్థగా భాసిస్తోంది. 1939లోనే శారదా హిందీ విద్యాలయం దీనికి అనుబంధంగా స్థాపించబడి హిందీ భాషా ప్రచారవ్యాప్తికి తోడ్పడింది. పిదప 1941లో హిందీ ప్రేమి

మండలి స్థాపించబడింది. ఇందు 1944-47 మధ్యకాలంలో ప్రతిరోజు తెలుగులో భగవద్గీత తరగతులు నిర్వహింపబడినవి. 1949లో జిల్లా గ్రంథాలయసంఘ సహకారంతో గ్రంథాలయ శిక్షణా తరగతులు ప్రారంభించబడినవి. అదే సంవత్సరం వేసవిలో వయోజన విద్యా ఉపాధ్యాయుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. 1950, 1958, 1961 సంవత్సరాలలో ప్రతి వేసవిలోనూ ఆధునిక విషయాలపై తెలుగులో ఉపన్యాసాలు ఏర్పాటుచేయబడినాయి. ముఖ్యంగా 1962-69 మధ్య కాలంలో వారానికి ఒక అరగంట చొప్పున ఆధునిక విషయాలపై మొత్తం 281 సంగ్రహ ఉపన్యాసాలు యివ్వబడినవి. చదువరులకు తగిన పుస్తకాలు, పత్రికలను అందించడంతోబాటు, యిలాంటి ఎన్నో కొత్త విషయాలు చదువరులు తెలుసుకోడానికి అవకాశం కలిగిస్తున్నది.

సాంస్కృతిక కార్యకలాపాలు

భారీ ఎత్తున సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించి ఆబాల గోపాలాన్ని ఆనంద డోలికల్లో తేలియాడించడంలో యీ గ్రంథాలయానికి పెట్టింది పేరు. అందుకోసం యీ గ్రంథాలయానికి అనుబంధంగా 1953లో విజ్ఞాన సమితి, 1958లో శారదా సంగీత పరిషత్, 1969లో అనకాపల్లి సైన్స్ క్లబ్ స్థాపించబడ్డాయి. ఈ మూడు సంస్థలపరంగా సాహిత్యం, సామాజిక శాస్త్రాలు, విజ్ఞానశాస్త్రాలపై సభలు, సదస్సులు, సంగీత కచేరీలు తరచుగా ఏర్పాటు చేయబడతాయి. ఈ కార్యక్రమాలు ఏర్పాటు చేయడానికి గ్రంథా

లయం పై భాగంలో సర్వసమగ్రమైన చక్కని వసతులున్నాయి. కనీసం ఐదారు వందలమంది సులభంగా యీ సాంస్కృతిక కార్యకలాపాలను ఆనందించవచ్చు.

*లింగమూర్తి ప్రచురణలు*

ఈ గ్రంథాలయ నిర్మాతలలో ప్రధానులైన లింగమూర్తిగారి పేర కొన్ని ప్రచురణలు కూడ వెలువడుతున్నవి. వాటిలో గాంధిజీ అనాసక్తయోగం, తల్లాప్రగడ సత్యనారాయణ మూర్తిగారి కాశ్మీర్ లింగమూర్తిగారి జీవితం, విజ్ఞాన సమితిలో చేయబడిన ముఖ్యమైన వ్యాసాల సంకలనం ప్రధానమైనవి. సాటి ప్రయివేటు గ్రంథాలయాలకు ఉపయోగంగా ఉండేటట్లు యీ గ్రంథాలయ విధానాలను, సఫలమైన పద్ధతులను వివరించే ఒక గ్రంథం వెలువరిస్తే మంచిదని తోస్తుంది. ఈ సత్కార్యానికి యీ పాలకవర్గం పూనుకుంటుందని ఆశిస్తాను.

*పాలకవర్గం*

ముఖ్యంగా యీ గ్రంథాలయం యొక్క పాలకవర్గపు ఐక్యత, దీక్ష అనన్య సామాన్యమైనది. సుప్రసిద్ధ వణిక్ప్రముఖులు, ప్రజాసేవకులు గ్రంధి వేంకటరమణయ్య బాబుగారు అధ్యక్షులుగానూ, అప్పల సన్యాసి సెట్టిగారు కార్యదర్శిగానూ, డాక్టరు కోరుకొండ సుబ్బరాజుగారు సంయుక్త కార్యదర్శిగాను – వారి సేవలు అనితర సాధ్యమైనవి. అన్నిటికి మించి నవ్యనవనీత సమాన మనస్కులైన డాక్టరు సుబ్బరాజుగారు యీ గ్రంథాలయం తరఫున జరిగే ప్రతి చిన్న విషయానికి కారణభూతులు. నిరంతర సేవకులు. పత్రికల కత్తిరింపుల

సంపుటాలు, ఉత్తమ గ్రంథాల కుదింపుల సంకలనాలు వీరి అపూర్వ ప్రతిభా సంపత్తి, శ్రమ, నిశితకుశాగ్ర బుద్ధి వలన రూపొందించబడినవే. శారదా గ్రంథాలయం ఆంధ్రదేశంలో ఒక ఉత్తమ గ్రంథాలయంగా రూపొందించడానికి వారి కృషి ప్రధానం. ఈ సమయంలో విరామమెరుగక గ్రంథాలయాభివృద్ధికోసం నిరంతరం పరిశ్రమించే గ్రంథపాలకుడు కె యర్రయ్య పంతులుగారి సేవలను కూడ అభినందించవలసి యున్నది. విశేషించి యీ శారదా గ్రంథాలయాన్ని నాటి నుంచి నేటివరకు పోషిస్తున్న అనకాపల్లి పౌరులను, ముఖ్యంగా వర్తకసంఘ ఉదారతను కొనియాడవలసి యున్నది.

— —

# సారస్వత నికేతనం, వేటపాలెం

# 14

తెలుగునాడు గ్రామీణ గ్రంథాలయాలకు పెట్టిందిపేరు. తెలుగు దేశంలో ఉన్నన్ని గ్రామస్థాయి గ్రంథాలయాలు దేశంలో మరే రాష్ట్రంలోనూ లేవంటే ఆశ్చర్యం లేదు. ఇటీవల ప్రభుత్వం సేకరించిన సమాచారాన్నిబట్టి మన రాష్ట్రంలో సుమారు 6 వేల వరకు గ్రామీణ గ్రంథాలయాలున్నట్లు తెలుస్తోంది. కాని వీటిలో క్రమబద్ధంగా పనిజేసే వాటిలో ప్రశంసనీయంగా సేవజేసే వాటిని వ్రేళ్ళ మీద లెక్కించవచ్చు.

నేడు ప్రశస్తంగా పనిజేసేవాటిలో ప్రకాశం జిల్లా వేటపాలెం, సారస్వత నికేతనానికి గణనీయమైన స్థానం వున్నది. గత 50 సంవత్సరాలుగా యీ గ్రంథాలయం అపారమైన గ్రంథసంచయాన్ని సేకరించి, అపూర్వంగా కృషిచేసి గ్రంథాలయోద్యమానికి నాయకమణిలా ప్రకాశిస్తుందనడంలో ఆశ్చర్యం లేదు. దీని నిర్వాహణ విధానం పౌర గ్రంథాలయాలన్నిటికీ ఆదర్శప్రాయమైనది. అనుసరణీయమైనది.

యువకులలో చైతన్యం

దేశనాయకుల ప్రబోధంచేతగాని, ఇంగ్లీషు చదువుల ప్రభావంచేతగాని, యితర ఉద్యమాల చేయూతవలనగాని

తెలుగునాట యీ శతాబ్ది తొలిపాలులో యువజనులలో చైతన్యం మోసులెత్తింది. ఈ సమయంలో యువకులు తమ శక్తి యుక్తులను పెంపొందించుకొనే నిమిత్తం గ్రామీణ స్థాయిలో గ్రంథాలయాలు, విద్యాలయాలు స్థాపింప జొచ్చారు. ఒక వైపున పాలకులైన బ్రిటీషువారిని తృప్తిపరుస్తున్నట్లు అభినయిస్తూ, మరోవైపున ప్రజలలో ఐక్యతను, దేశభక్తిని, విజ్ఞానవ్యాప్తిని సమకూర్చటం నాటి యువజనుల ముఖ్యాశయంగా పెట్టుకున్నారు. అందుచేత గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా వేటపాలెం అనే గ్రామంలో కొందరు యువకులు 1911 డిశంబరు 12వ తేదీన 5వ జార్జి పట్టాభిషేక మహోత్సవ సందర్భంగా జార్జి కారనేషనల్ రీడింగు రూమ్ స్థాపించారు. ఈ పఠనమందిరం మూడేళ్లు నిర్విఘ్నంగా నడచింది. ఆ తర్వాత కారణాంతరాలవల్ల మూతపడింది.

## మొదటి ప్రపంచ యుద్ధం

చరిత్ర ప్రసిద్ధమైన తొలి ప్రపంచ సంగ్రామం 1914లో ప్రారంభమైంది. తత్ఫలితంగా విశాల విశ్వంలోని దేశాలన్నిటిలో ఒక చలనం, ఒక ఆందోళన బయలుదేరింది. ప్రపంచపు నలుమూలలాజరిగే విశేషాలు, యుద్ధవార్తలు తెలుసుకోవాలని తాపత్రయంపడే ప్రజలు ఒక గ్రంథాలయాన్ని స్థాపించడానికి నిర్ణయించారు. అప్పుడే ప్రజారంగంలోకి ప్రవేశించిన ఆదర్శ భావాలు గల యువకులు ఊటుకూరు సుబ్బాయ శ్రేష్ఠిగారు యీ నిర్ణయానికి మరింత ప్రోత్సాహాన్నిచ్చారు. తత్ఫలితంగా వేటపాలెం గ్రామంలో హిందూ యువజన సంఘం పేరున ఒక

గ్రంథాలయం వెలసింది. తొలిదశలో అందు నూరు పుస్తకాలు మాత్రం ఉండేవి. రెండు దినపత్రికలు, మూడు వారపత్రికలు తెప్పించేవారు. పూర్తిగా అభిమానుల చేయూతతో యీ సంస్థ ఐదు సంవత్సరాలు ప్రశంసనీయంగా పనిజేసింది. అయితే యీ సంస్థకు రానురాను ఆదాయం తరిగిపోయింది. ఖర్చు పెరిగిపోయింది. సంస్థ మూతవేయవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆ సమయంలో ఊటుకూరు సుబ్బరాయ శ్రేష్ఠిగారు యీ సంస్థ నిర్వహణాభారము స్వీకరించి, దానిని మరింత ఉదాత్తరీతిలో నిర్వహించే నిమిత్తం సంస్థ పేరును సారస్వత నికేతనంగా 1924 సెప్టెంబరు 1వ తేదీన మార్చివేశారు. అప్పటినుంచీ యీ గ్రంథాలయ నిర్వహణలో నవశకం ఏర్పడింది.

*గ్రంథాలయ ప్రగతి*

సారస్వత నికేతన నిర్వహణ బాధ్యత స్వీకరించిన పిదప శ్రేష్ఠిగారు గ్రంథాలయాభివృద్ధి విషయంలో అహర్నిశలు కృషిచేయడం ప్రారంభించారు. తమ ప్రజాహిత కార్యక్రమాలలో గ్రామసీమకు వెన్నెముక యైన గ్రంథాలయ ప్రగతికి అధిక ప్రాధాన్యం ఇచ్చారు. పుస్తకాలను, పత్రికలను పెంచడంలోనూ, చదువరులకు గ్రంథాలయం హెచ్చుగా ఉపయోగించేట్లు చేయడంలో ప్రశంసనీయమైన కృషిచేశారు. అన్నిటికంటె మించి వారి కుటుంబ సభ్యులు యితర ఉదారుల ఆదరణతో 1923లో గ్రామపు నడిబొడ్డున ఒక భవనాన్ని కొని దానిని బాగుచేయించి సారస్వతనికేతనాన్ని 1924 సెప్టెంబరు

1వ తేదీన అందులోకి తరలించారు. గ్రంథాలయ ప్రగతికి శ్రేష్ఠిగారు చేసిన సేవలకు పురస్సరంగా దీనికి 'సుబ్రాయ మహల్' అని నామకరణం చేశారు.

తొలి నాటి నుండి యీ గ్రంథాలయానికి విశేషమైన ఆదరణ, ప్రయోజనం ఉండడంతో యీ భవనం చాలీచాలకుండా ఉంది. అందుచేత శ్రేష్ఠిగారు యీ భవన విస్తరణ కార్యక్రమాన్ని సంకల్పించారు. అదే సమయంలో ఆంధ్ర దేశ పర్యటన నిమిత్తం వచ్చిన జాతిపిత మహాత్మాగాంధీజీ యీ విస్తరణ కార్యక్రమానికి 1929 ఏప్రియల్ 18న శంకుస్థాపన చేశారు. అనతికాలంలోనే యీ విస్తరణ పూర్తయి భవనం ఉపయోగంలోకి వచ్చింది. ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు యీ భవన ప్రవేశ మహోత్సవం గావించారు. ఈ విస్తరణను శ్రేష్ఠిగారి సోదరుడగు కోటిలింగం శ్రేష్ఠిగారి సతీమణి మీనాక్షమ్మగారల స్మారక మందిరం అని నామకరణం చేశారు.

ఆ తర్వాత గ్రంథాలయం నానాటికీ పెరగడంతో భవనానికి పై అంతస్తు వేయవలసి వచ్చింది. దక్షతగల పాలక వర్గం యీ కార్యభారాన్ని అనతికాలంలోనే పూర్తి చేసింది. ఇందుకైన సుమారు 16వేల రూపాయలను శ్రేష్ఠిగారి కుటుంబ సభ్యులు, ప్రభుత్వం, సమీపగ్రామస్థులు యిచ్చారు. ఈ విస్తరణ పని 1957తో పూర్తయింది. ఈ విస్తరణలో ఒక విభాగానికి శ్రేష్ఠిగారి భార్యయెడల గౌరవ పురస్సరంగా ఊటుకూరు కమలాంబ స్మారక మందిరమనీ, మరొక విభాగా

నికీ బాపూజీ స్మారక మందిరమనీ నామకరణం చేశారు. నేటికీ యీ భవనం గ్రంథాలయ ప్రయోజనంకోసం అపారంగా వినియోగపడుతున్నది.

పాలకవర్గం

అదృష్టవశాత్తు యీ గ్రంథాలయానికి నిస్వార్థపూరితులు, మనసులు కలసిన మిత్ర బృందం పాలకవర్గంగా ఏర్పడడంవలన దీని ప్రగతి మూడు పువ్వులు ఆరు కాయలుగా వికసించింది. శ్రేష్ఠిగారు 1918 నుంచి 1924 వరకు కార్యదర్శిగానూ, 1924 నుంచి 1935 వరకు అధ్యక్షులుగా ఉన్నప్పటికీ ప్రధాన బాధ్యతలన్నిటినీ వారే నిర్వహించే వారు. చిన్న వయసులోనే శ్రేష్ఠిగారు కాలంచేయగా వారి సన్నిహిత బంధువు సహృదయులు దేటుకూరి జయరామదాసుగారు అధ్యక్షులుగానూ, అంతకు ముందు కొంత కాలంగా గ్రంథపాలకులుగా పనిజేస్తున్న అడుసుమిల్లి శ్రీనివాసరావుగారు గౌరవ కార్యదర్శిగా ఎన్నుకోబడి గత 40 ఏళ్లుగా వీరా పదవులను ఎంతో ఆదర్శప్రాయంగా నిర్వహిస్తూ గ్రంథాలయానికి వన్నెచిన్నెలు సమకూరుస్తున్నారు. తమ చేతులమీదుగా ఒక మొలకను ఫలపుష్పాదులతో మహావృక్షంగా తీర్చిదిద్దారు.

గ్రంథ సంపద

ఆంధ్రలోని అనేక గ్రంథాలయాలలో ఉత్తమ గ్రంథ సేకరణలో, భద్రతలో ముందుగా సారస్వత నికేతనానికి తొలి తాంబూలమిచ్చి, ఆ తర్వాత మిగతా వాటి విషయం

ఆలోచించవలసి యుంటుందనడంలో ఏ మాత్రం ఆశ్చర్యం లేదు. తెలుగులో ముద్రణ ప్రారంభమైన నాటినుండి వెలువడిన ఉత్తమ గ్రంథాలలో 90 శాతం గ్రంథాలు యిచట తొలి కుదిపుటలతో సహా పదిలంగా భద్రపరచబడినవి. ఈనాటికీ ఎప్పటికప్పుడే వెలువడిన ప్రతి మంచిపుస్తకమూ యీ గ్రంథాలయంలో సముచితస్థానం ఏర్పాటు చేసుకోవలసిందే. మొత్తం మీద యీనాడు యీ గ్రామీణ గ్రంథాలయంలో 40000 గ్రంథాలున్నవి. అందు తెలుగు, సంస్కృతం షుమారు 20 వేలు, ఇంగ్లీషు 14 వేలు, హిందీ, ఉర్దూ, బెంగాలి మొదలైన భాషలలో మిగతావి ఉన్నవి.

పత్రికల సంపుటాలు

పత్రిక లన్నిటినీ సంపుటాలుగా చేసి భద్రపరచడంలో కూడ యీ గ్రంథాలయానికి సమున్నతస్థానం లభిస్తుంది. 1942 నుండి నేటివరకు ఆంధ్రపత్రిక దినపత్రికలు 1938 నుంచి కృష్ణాపత్రిక యింకా అనేక దినపత్రికలు, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, శారద, భారతి, ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, ఆంధ్రభాషావిలాసిని మొదలైన అచ్చయిన ప్రతి సంచిక అత్యంత పదిలంగా భద్రపరచబడిందంటే యీ పాలకవర్గపు కార్యదీక్షను, ముందుచూపును మనం ఊహించుకోవచ్చు. తెలుగుభాషా సాహిత్యాలపై పరిశోధన చేయదలచిన వారు యీ గ్రంథాలయం సందర్శించక తప్పదు.

గ్రంథాల వినియోగం

గ్రంథాలయం స్థాపించినప్పటినుంచీ యిచట ఒక గుణాత్మకమైన సంప్రదాయం ఆనవాయితీగా ఉంది. గ్రంథా

లయంలోనికి ఎవరైనా ప్రవేశించవచ్చు. ఏ పుస్తకమైనా తీసుకోవచ్చు. యథేచ్ఛగా చదువుకోవచ్చు. కావాలంటే యింటికి తీసుక వెళ్ళవచ్చు. ఇందుకు పైసా రుసుం లేదు. తోస్తే తృణమో పణమో దానం యివ్వవచ్చు. అంతే. గ్రంథాలయచట్ట ఫలితంగా తెలుగునాట పనిజేస్తున్న గ్రంథాలయాలలో అనుసరిస్తున్న అనేక ఆధునిక విధానాలు, యీ గ్రంథాలయంలో ఏనాటినుంచో, అంటే గ్రంథాలయ శాస్త్రమంటూ తెలుగునాట పాదుకొల్పక ముందునుంచీ ఆచరణలో ఉన్నది. ఈ గ్రంథాలయ ప్రయోజనం యీనాడు వేటపాలెం గ్రామానికి, సమీప గ్రామాలకు, దగ్గర తాలూకాలకు మాత్రం' పరిమితం కాలేదు. తెలుగు దేశపు నలుచెరగులనుంచీ. పొరుగు రాష్ట్రాలనుంచీ పండితులు, పరిశోధకులు వస్తూ ఉంటారు. ఈ గ్రంథాలయం ద్వారా తెలుగు భాషామతల్లికి నీరాజనాలర్పించి సిరిసంపదలను నిండుగా మెండుగా సమకూరుస్తూవుంటారు.

సాంకేతిక కార్యకలాపాలు

ఈ గ్రంథాలయం ఒక కుగ్రామంలో ఉండొచ్చు. కాని నిర్వహణలోమాత్రం నగరాలలోని ఏ గ్రంథాలయంతోనూ తీసిపోదు. ఇచటి గ్రంథాలన్నీ దశాంశ వర్గీకరణ విధానంలో వర్గీకరించబడినవి. అదే క్రమంలో అమర్చబడినవి. ఆంగ్లో అమెరికన్ కోడ్ ప్రకారం నిఘంటు సూచీ విధానంలో కార్డు కేటలాగు తయారుచేయబడింది. ఇంతకుముందొకసారి ముద్రిత సూచి 1932లో తయారుచేయబడింది. మరల అలాంటి సూచీ

ముద్రించవలసిన అవసరం నేడు కనిపిస్తోంది. ఇలాటి సూచీ ఉన్నయెడల దూరతీరాలందు గలవారు గూడ యిచటికి రాకుండా గ్రంథాలను తెప్పించుకొని వినియోగపరచుకోడానికి వీలుంటుంది. శిక్షణ పొందిన గ్రంథపాలకుని నియమించిన ప్రయివేటు గ్రంథాలయం ఆంధ్రదేశంలో ఇది ఒకటేనేమో!

## సాంస్కృతిక కార్యక్రమాలు

గ్రంథాలయ నిర్వహణలో సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ ఒక భాగమే. గ్రంథాలయ స్థాపన కాలం నుంచీ యిచట వీలైనప్పుడు సభలు, సమావేశాలు జరుగుతూనే ఉన్నవి. ప్రతి ఏడాదీ శ్రేష్ఠిగారి వర్ధంతి, సారస్వత నికేతన జయంతి, కమలాంబ వర్ధంతి, నెహ్రూ బాలల జయంతి ఆయా దినాలలో జరుగుతుంటాయి. ఇవిగాక కవిపండిత సన్మానాలు, కవిసమ్మేళనాలు యితోధికంగా జరుగుతాయి. గ్రంథాలయ సభలు, సమావేశాలు యిందు ఎన్నో జరుగుతాయి. ప్రతి నెలలో ఒకటి రెండు కార్యక్రమాలతో గ్రంథాలయపు ఆవరణ కళకళలాడుతూ ఉంటుంది.

## మహిళా మండలి

ఈ గ్రంథాలయం తరఫున మహిళా మండలి ప్రత్యేకంగా నిర్వహింపబడుతూ ఉంది. మహిళలలో విజ్ఞాన వినోదాలు పెంపొందించడంతో బాటు, వారికి కుట్టు మొదలైన వృత్తి శిక్షణ నేర్పి వారికి ఆర్థిక ప్రయోజనాన్ని కల్పించడంలో ఈ మండలి బాగా పనిజేస్తూంది. సభలు, సమావేశాలతో బాటు కుట్టు, హిందీ తరగతులు జయప్రదంగా నిర్వహింప

బడుతున్నాయి. ఈ మండలికి అనుబంధంగా బాలల శాఖ గూడ జయప్రదంగా నిర్వహించబడుతున్నది. పిల్లలకు పుస్తకాలు పత్రికలు అందజేయడమే గాక వారికి పోటీ పరీక్షలు పెట్టి వారిలోని శక్తియుక్తులను వికసింపజేయడానికి యీ శాఖ పనిజేస్తుంది.

*ప్రచురణలు*

గ్రంథ ప్రచురణను ప్రోత్సహించే ఉద్దేశం యీ పాలక వర్గానికి కలదు. అందుచేత 1924 నుంచి అప్పుడప్పుడు యీ గ్రంథాలయం తరఫున కొన్ని పుస్తకాలు, కరపత్రాలు ప్రచురింపబడుతున్నాయి. అందు ముఖ్యంగా గ్రంధి సుబ్బరాయ గుప్తగారి ధన్వంతలహరి, యింకా ఇతర రచయితల – భగవద్గీతా సంగ్రహం, మాంచాల, తులసీదాస హృదయం, చీకటింట్లో నల్లపిల్లి, త్రిభాషాబోధిని, జాతీయత, శాంతిమాత, గుంటూరుజిల్లా గ్రంథాలయ చరిత్ర ఎన్నదగినవి. ఈ గ్రంథాలయం తరఫునే ప్రచురించిన స్త్రీ విద్య, త్రాగుడు మొదలైన కరపత్రాలు పలువురి మన్ననలను పొందాయి. ఈ గ్రంథాలయం తరఫున అన్ని హంగులు గల ముద్రణాలయం కూడ ఉండేది. ఇటువంటి అవకాశం ఆంధ్రదేశంలో మరే గ్రంథాలయానికి లేదేమో!

*ఆర్థిక వనరులు*

అంత పెద్ద గ్రంథాలయాన్ని, యిన్ని సంస్థలను నిర్వహించడం సామాన్యమైన పనిగాదు. ఇందుకోసం నిరంతరం తపించే ఒక ప్రాణి ఉన్నప్పుడే సాధ్యమౌతుంది. ఇందు కవసర

మైన విధులలో అధికభాగం ప్రజల విరాళాల రూపంలో లభిస్తున్నది. ప్రభుత్వం చాలాకొద్దిగా సాయంచేస్తున్నది. అయిదారేళ్లుగా జిల్లా గ్రంథాలయ సంస్థ ఏటేటా వెయ్యిరూపాయిలు గ్రాంటుగా యిస్తున్నది. ఈ గ్రాంటు కనీసం పది వేల రూపాయలకైనా పెరగవలసి ఉంది. ఏమైనప్పటికీ ప్రజల అండదండలు యీ గ్రంథాలయానికున్నంత కాలమూ ఈ సంస్థ సజీవంగానే ఉంటుంది. సుమసౌరభాలు నలుమూలలా వెదజల్లుతునే ఉంటుంది.

స్వర్ణోత్సవం

ఈ గ్రంథాలయానికి 1943లో రజతోత్సవాలు జయప్రదంగా జరిగాయి. 1972 అక్టోబరు 8వ తేదీన పౌర గ్రంథాలయశాఖ (నాటి) డైరెక్టరు కె వి వి సుబ్బరాజుగారి అధ్యక్షతన జరిగాయి. ఉత్సవాలు నిర్వహించినప్పుడు ముఖ్యంగా గ్రామపౌరులందరూ వీటిలో ఉత్సాహంగా పాల్గొనడం, గ్రంథాలయం తమదిగా అనుకోవడం ఇచట గల ప్రత్యేకత. మిగతా గ్రామీణ గ్రంథాలయాలు ఈ విషయంలో నేర్చుకోవలసింది ఎంతో ఉంది.

టీమ్ వర్క్

వేటపాలెం, సారస్వత నికేతనం పేరు తలవగానే మనకు మేరుపర్వతంలాగ కనుపించే మహామనీషి అడుసుమిల్లి శ్రీనివాసరావుగారు. వారి జీవితకృషి, నిరంతర ఆవేదన, జిజ్ఞాస ఆ సంస్థలో మూర్తీభవించినట్లు కనుపిస్తూ ఉంటుంది. ఆ గ్రంథాలయం పేరు ఆలోచనలోకి వచ్చినపుడెల్లా వారి అపూర్వమైన

ఆదరణ, ఆప్యాయత, అందుతో బాటు "వేవురు వచ్చినా వండనలయని" అన్నపూర్ణకు ప్రతిరూపమగు వారి శ్రీమతి గారి మన్నన మర్యాదలు మనలోని మధురస్మృతులను మెదపుతూ ఉంటాయి. ఈ గ్రంథాలయానికి అనుకూలమైన పాలక వర్గంతో బాటు గ్రంథాలయ సేవకోసమే జీవిస్తున్నట్లు పనిజేసే నిష్కామ సేవకులు కామయ్యగారు, శర్మగారు, గ్రంథాలయ శాస్త్రంలో శిక్షణ పొందిన యువకులు సుబ్రహ్మణ్యంగారు ఈ గ్రంథాలయానికి పెట్టని కోటలు.

---

# రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం, హైదరాబాదు

## 15

అందాల హైదరాబాదు నగరానికి నడిబొడ్డున మూసీ జీవనది ఉంది. ఆ నదీతీరంలో కనుపించే ఉన్నత సౌధాల్లో సుందరమైన వాతావరణంలో కనుపించే గ్రంథాలయ భవనం అందరి దృష్టిని ఆకర్షించి తీరుతుంది. ఆ వీథి మలుపులో సోయగం, నందనవనాన్ని పోలిన ఉద్యానవనం, తొలి చూపులో వలపు జనించే విధంగా సుందరమైన ఆకృతిగల గ్రంథాలయ ప్రాంగణం పుస్తకాల యెడల, గ్రంథాలయాల యెడల ఏ మాత్రం అభిరుచిలేని రాతిహృదయాలనుగూడ రసహృదయులుగా, సాహితీ పిపాసువులుగా తీర్చిదిద్దుతుంది. హైదరాబాద్ నగరానికున్నంత ప్రేమాయణం దీనికి లేకపోయినా సంస్కృతీ పరిరక్షణలో, సాహిత్య ప్రచారంలో యీ గ్రంథాలయానికి విశిష్టమైన పాత్ర కలదని చరిత్ర రుజువు పరుస్తోంది.

గత నాలుగైదు వందల సంవత్సరాలుగా హైదరాబాదు నగరాన్ని అసఫ్‌జాహి వంశపు రాజులు పాలించారు. వీరి కాలంలో పల్లెలు, పంటలు ఎంతగా మరుగు పడినప్పటికీ నగరాన్ని మాత్రం అత్యంత శోభాయమానంగా, దక్షిణ భారతదేశంలో ఒక ముఖ్య పట్టణంగా తీర్చిదిద్దారు. ముఖ్యంగా మీర్ మహబూబ్ అలీఖాన్ అను ఆరవ అసఫ్‌జా (పాలనా కాలం 1869–1911), నవాబ్ మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ అను

ఏడవ అసఫ్‌జా (పాలనా కాలం 1911–1950) కాలంలో సాహితీ సౌరభాలు ఎల్లెడల గుబాళించాయి. కళాసంపద ఎంతో వికసించింది. దీనితో బాటు కళాహృదయంగల మంత్రులు, సామంతులు, శ్రీమంతులు ఆ కాలంలో ఉండటం వలన హైదరాబాదు నగర ప్రశస్థి దశదిశల వ్యాపించింది.

*తొలి ప్రయత్నం*

ముఖ్యంగా ప్రాచీన సంస్కృతి సంపదలో భారతదేశానికి దీటురాగల దేశాలు యీ విశ్వంలో లేవని చెప్పవచ్చు. తరతరాలుగా మన మహా మనీషులు అపూర్వమైన మేధా సంపత్తితో విజ్ఞానాన్ని ప్రోదిచేసి వ్రాతప్రతులలో నిక్షిప్తం చేశారు. అపారమైన ప్రాచీన విజ్ఞానంలో చాలభాగం కాల గర్భంలో కలసిపోగా మరికొంత స్వార్థపరులద్వారా యితర దేశాలకు తరలింపబడగా (తస్కరింపబడగా) బహుకొద్ది మాత్రమే మనం మిగుల్చుకో గలిగాం.

ఇతర దేశాలకు వ్రాతప్రతుల చేరవేత గత శతాబ్ది తుది భాగంలో ఒక ప్రధానమైన వ్యాపారం. దేశపు కీర్తిప్రతిష్ఠలు గమనంలో లేని ధనాశా పరులు మన దేశంలో అమూల్యమైన వ్రాతప్రతులను విదేశాలకు చేరవేస్తుండేవారు. ఈ వ్యాపారం హైదరాబాదులోగూడ సాగుతూండటం కొందరు మంత్రులు, ఉద్యోగులు గమనించారు. చేయిదాటిపోతున్న వ్రాతప్రతులను వీరే కొని భద్రపరచటం ప్రారంభించారు. వ్యక్తులనుండి కూడ మరికొన్ని వ్రాతప్రతులు సంపాదించారు. ఈ విధంగా 1890 నాటికి హిందూ మహమ్మదీయ సంస్కృ

తిపై అనేక ఉత్తమ తరగతి వ్రాతప్రతులు సేకరింపబడ్డాయి. ఆ రోజులలో నిజాం ప్రభుత్వంలో విద్యాశాఖకు డైరెక్టరుగా ఉన్న మౌల్వీ సయ్యద్ హుస్సేన్ బిల్‌గ్రామి (నవాబ్ ఇమదుల్-ముల్క్ బహుదూర్) గ్రంథాలయస్థాపన కోసం విశేషంగా కృషి చేశారు. వారి ప్రయత్నాల వలన 1891 ఫిబ్రవరి మాసంలో అసఫియా రాష్ట్రీయ గ్రంథాలయం స్థాపించబడింది. తొలుత యీ గ్రంథాలయం పండితులకు, పరిశోధకుల కోసమే ఉద్దేశించబడింది. అందుచేత యిందు అరబిక్, పర్షియన్, ఉర్దూ, సంస్కృత భాషలలో వ్రాతప్రతులు, మరి కొన్ని ముద్రిత గ్రంథాలు చేర్చబడ్డాయి. మరికొంత కాలానికి ఇంగ్లీషు, యితర యూరోపియన్ భాషలలోని గ్రంథాలు చేర్చబడ్డాయి. ఏమైనప్పటికీ యీ గ్రంథాలయం స్థాపించబడిన నాలుగైదు దశాబ్దాల వరకు సామాన్య ప్రజానీకానికి దూరంగానే ఉంచబడినది.

పెద్ద మార్పు

1940 తర్వాత గ్రంథాలయ నిర్వహణలో అనేక మార్పులు వచ్చాయి. దీని అభివృద్ధి విషయంలో ప్రభుత్వం మంచి శ్రద్ధ చూపింది. తెలుగు, మరాఠీ, కన్నడ, హిందీ మొదలైన ప్రాంతీయ భాషలలో పుస్తకాలు పత్రికలు తెప్పించబడినవి. సామాన్య మానవునికిగూడ యిందు ప్రవేశం కల్పించబడింది. గ్రంథాలయపు సెలవులు తగ్గించబడినాయి. పనిగంటలు హెచ్చింపబడినాయి. నియమ, నిబంధనలలో అనేక చేర్పులు, మార్పులు చేయబడినాయి. ఈ విధంగా

యీ గ్రంథాలయం సర్వజనోపయోగంగా విశేష ప్రయోజన కరంగా చేయబడింది.

*కేంద్ర గ్రంథాలయం*

నిజాం ప్రభుత్వం దీన్ని హైదరాబాద్ ప్రభుత్వ కేంద్ర గ్రంథాలయంగా గుర్తించింది. 1941లో యీ గ్రంథాలయానికి స్వర్ణోత్సవాలు నిజాం ప్రభుత్వంలో పాలకవర్గ అధ్యక్షుడు నవాబ్ హాఫీజ్ సర్ అహమ్మద్ సయ్యద్ ఖాన్ బహదూర్ నవాబ్ అధ్యక్షతన అత్యంత వైభవోపేతంగా జరిగాయి. అప్పట్నుంచి యీ గ్రంథాలయ అభివృద్ధి విషయంలో ప్రభుత్వం సముచితమైన శ్రద్ధ కనబరుస్తూనే ఉంది.

*అభివృద్ధి ప్రణాళిక*

హైదరాబాదులోని యీ గ్రంథాలయం జంటనగరాలకు మాత్రం వినియోగపడుతున్నది. జిల్లా స్థాయిలోను, తాలూకా స్థాయిలోను గ్రంథాలయసేవ చేసేందుకు ఒక ప్రణాళిక తయారు చేయబడింది. దీని వలన 16 జిల్లా కేంద్ర గ్రంథాలయాలు (అప్పుడు హైదరాబాద్ రాష్ట్రానికి 16 జిల్లాలుండేవి), 124 తాలూకా గ్రంథాలయాలు స్థాపించబడతాయి. ఈ విధంగా రాష్ట్ర వ్యాప్తంగా గ్రంథాలయ సేవ చేయడానికి ఒక ఆలోచన చేయబడింది. అయితే యీ ప్రణాళికా నిర్వహణకు వ్యయం లక్షలలో తేలింది. అంత డబ్బు గ్రంథాలయ నిర్వహణకోసం ఖర్చు చేయడానికి ప్రభుత్వం యిష్టపడక పోవడం వలన ఆ ప్రణాళిక చీకటి చాటుకుపోయింది.

*విశాల రాష్ట్రం*

ఆంధ్రుల చిరకాల కృషి ఫలించి ఆంధ్రప్రదేశ్ 1958లో ఏర్పడింది. సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల తర్వాత మరల దాదాపు ఐదు వందల సంవత్సరాలకు తెలుగుజాతి అంతా ఒక రాష్ట్ర పాలనలోకి వచ్చింది. చారిత్రకంగా తెలుగుజాతి కిది అపూర్వమైన పండుగ. 1960లో మద్రాసు, హైదరాబాదు గ్రంథాలయ శాసనాలు విలీనం చేయబడి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాసనం రూపొందించబడింది. ఈ శాసనం వలన హైదరాబాద్ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంగా మార్పు చేయబడింది.

*గ్రంథ సంపద*

దక్షిణ భారతదేశంలోని ప్రసిద్ధ పౌర గ్రంథాలయాలలో తొలి స్థానం మద్రాస్‌లోని కన్నెమరా పౌర గ్రంథాలయానికి రాగా, ద్వితీయ స్థానం యీ గ్రంథాలయానికి వస్తుంది. ఉద్యోగుల నిరంతర కృషి వలన అచిరకాలంలోనే యీ గ్రంథాలయానికి అపారమైన గ్రంథసంకలనం ప్రోగైంది. ఇందు ఇంగ్లీషు 52 వేలు, ఉర్దూ 45 వేలు, హిందీ 19 వేలు, మరాఠీ 13,400, కన్నడం 12 వేలు, తెలుగు 17,000, సంస్కృతం 2,500, మిగతా భాషలలో మరో మూడువేల పైచిలుకు గ్రంథాలున్నాయి. మొత్తం మీద యీ గ్రంథాలయంలో రెండు లక్షల గ్రంథాల వరకూ యీనాడున్నవి. విషయాలవారీగా వస్తే ముఖ్యంగా చరిత్ర, సంస్కృతి, సాహిత్యం పై గ్రంథాలు హెచ్చుగా ఉన్నట్లు తెలుస్తుంది.

## వ్రాతప్రతులు

అమూల్యమైన వ్రాతప్రతులకు యీ గ్రంథాలయం పెట్టింది పేరు. ముఖ్యంగా ఉర్దూ, పర్షియన్ భాషలలో గల అపురూపమైన వ్రాతప్రతులు ఇచట ఎన్నో ఉన్నాయి. ప్రపంచం మొత్తంమీద ఒకే ప్రతిగా నిలచినవి కూడ యీ గ్రంథాలయంలో ఎన్నో ఉన్నవి. అన్ని భాషలలోనూ కలసి యీ నాడు 17100 వ్రాతప్రతులున్నవి. ఈ వ్రాతప్రతులన్నిటికీ విషయాల వారీగా వివరణాత్మకమైన సూచీని తయారు చేసి ప్రచురించినపుడు ఆశించిన ప్రయోజనం సిద్ధింప గలదు. అంతేగాక యీ వ్రాతప్రతులలోని పాఠభేదాలను పరిశీలించి, సమన్వయపరచి ఉత్తమ ప్రతులను నిర్దుష్టంగా ముద్రించే ప్రయత్నం జరగవలసి ఉంది.

## గ్రంథాల వినియోగం

జాతి మత కుల వర్ణవిచక్షత లేక పిన్నలు, పెద్దలూ - ఎల్లరూ జంటనగరాలలో విశేషంగా ఉపయోగించు కొనే పౌర గ్రంథాలయాలలో యీ గ్రంథాలయానికి అగ్రస్థానం వస్తుంది. ఇందు రోజుకు సుమారు 1150 మంది చదువరులు వస్తున్నారంటే దీని ఉపయోగాన్ని మనం ఊహించుకోవచ్చు. స్వేచ్ఛోపలబ్ధి విధానం ఇచట అమలులో ఉంది. ఉన్న గ్రంథాలలో మనకు కావలసిన పుస్తకాన్ని యితరులసాయం లేకుండా సులభంగా ఎంచుకోవచ్చు. ఎట్టి షరతులు లేకుండా అచట ఉచితంగా చదువుకోవచ్చు. ఇంటికి తీసుకొని వెళ్ళవలయునంటే నామమాత్రమైన డిపాజిట్ చెల్లించవలసి యుంటుంది.

ఈ విధంగా బయటకు అనువుగా యివ్వబడే గ్రంథాలు రోజుకు 550 వరకూ ఉంటాయి.

*పఠన మందిరం*

ఈ గ్రంథాలయానికి విశాలమైన పఠన మందిరం ఉంది. పర్షియన్ సాంస్కృతి ఉట్టిపడే విధంగా యీ మందిరం అత్యంత శోభాయమానంగా తీర్చిదిద్ద బడింది. ఇందు ఒకేసారి సుమారు 200 మంది కూర్చొని చదువుకోడానికి అవకాశం కల్పించబడింది. అనేక భాషలలో అనేక విషయాలపై దేశ విదేశాల నుండి తెప్పించే పత్రికలు సుమారు 300 వరకు యిచట ఉంచబడి అత్యంత ప్రయోజనాన్ని కలిగిస్తున్నాయి. జాతీయ గ్రంథాలయంలో ఏర్పరచినట్లుగానే మరొక విశాల మైన గదిలో దిన పత్రికల విభాగం ఉంది.

*పాఠ్యగ్రంథాల విభాగం*

ఈనాడు మధ్యతరగతి, సామాన్యతరగతి కుటుంబాల లోని ఆర్థిక పరిస్థితి దృష్ట్యా విద్యార్థులందరు తమ పాఠ్య గ్రంథాలకు, రెఫరెన్స్ గ్రంథాలను స్వయంగా సంపాదించగల స్థితిలో లేరు. ఈ అవసరాన్ని తీర్చే నిమిత్తం యిచట పాఠ్య గ్రంథాల విభాగం ఏర్పాటు చేయబడింది. ఇందు పి యు సి, బి ఏ, బి కాం, బి యస్ సి, యం బి బి యస్, ఎం ఏ, ఎం యస్ సి మొదలగు పాఠ్య ప్రణాళికలకు సంబంధించిన గ్రంథాలెన్నో ఉన్నాయి. వీటిని ఎవరైనా వినియోగించు కోవచ్చు. విశేషించి యీ భాగం ఉదయం గం 8 నుంచి రాత్రి గం 12 వరకు పనిజేస్తుంది. ఇంత విస్తృత ప్రాతిపదికపై

ఏర్పాటు చేయబడిన పాఠ్య గ్రంథాల విభాగం, ఒక్క విశ్వ విద్యాలయాలను మినహాయిస్తే మరెచ్చటా భారతావనిలో లేదని తెలుస్తుంది.

బాలల విభాగం

ఈ గ్రంథాలయంలో ఒక భాగంగా ఏర్పాటు చేయ బడిన బాలల విభాగం ప్రత్యేకంగా ప్రశంసింపదగింది. అంద మైన బొమ్మలలో, రంగురంగుల వాతావరణంలో యీ విభాగం ఒక బొమ్మరిల్లులాగ అమర్చబడింది. ఇచటి ఫర్ని చరు గూడ పిల్లలకు అనువైన రీతిలో తయారుచేయించ బడింది. ఇచట వివిధ భాషలలో, వివిధ విషయాలపై పిల్లల పుస్తకాలు పత్రికలతో బాటు, వారు ఆటలద్వారా తమ విజ్ఞానపరిధిని పెంచుకోడానికి వీలైన పరికరాలున్నవి. అందు కోసం ఒక ప్రత్యేకమైన గదికూడ కేటాయించబడింది. తర చుగా యీ పిల్లల సమావేశాలు జరుగుతుంటాయి. ఆటల పోటీలు నిర్వహింపబడుతుంటాయి.

అంధుల విభాగం

అంధత్వం పాపం కాదు. అదొక దురదృష్టం మాత్రమే. అంతమాత్రంచేత వారు విజ్ఞాన లోకంలోని వెలుగుబాటలకు దూరం కారాదు. మానసిక వికాసం పొందడానికి దూరం కారాదు. ఈ గ్రంథాలయంలో తూర్పువైపు ప్రవేశద్వారం వద్ద అంధుల విభాగం ఏర్పాటుచేయబడింది. బ్రెయిలి లిపిలో తయారుచేయబడిన పుస్తకాలు యిందుంచబడుతున్నాయి.

ఈ పుస్తకాలు తయారుచేయడంలో రక్షణపొందే నిమిత్తం గూడ యిద్దరు గ్రంథపాలకులకు యీ గ్రంథాలయం అవకాశం కల్పించింది. నగరంలో అనేక ప్రాంతాలనుండి వచ్చిన అంధులు యిచ్చటికి వచ్చి చదువుకుంటారు. పుస్తకాలు అరువుగా కూడా యింట్లకివ్వబడతాయి. వీటికి ఎట్టి నిబంధనలు లేవు. మానవతా దృక్పథంలో అన్నీ సవరింపబడినాయి.

*సామాజిక విద్యావిభాగం*

విజ్ఞాన సముపార్జనకు ఉపయోగించే సాధనాలలో గ్రంథాలు ఒక విభాగం మాత్రమే. అంతేగాక విజ్ఞానపిపాసి ఎల్లకాలము గ్రంథాలలోనే కాలక్షేపం చేయడం కష్టం. అందుచేత వారిని అప్పుడప్పుడు వినోద కాలక్షేపం చేసేందుకు, వినోదం ద్వారా విజ్ఞానాన్ని అందజేసేందుకు చలనచిత్ర ప్రదర్శనలు ఏర్పాటుచేయబడతాయి. అంతేగాక తరచుగా చర్చలు, సమావేశాలు ఏర్పాటుచేయబడతాయి. ఈ గ్రంథాలయంలో విశేషంగా ప్రజలను ఆకర్షించే విభాగాలలో యిది ముఖ్యమైనదిగా భావించబడుతోంది.

*మరికొన్ని విభాగాలు*

ఈ గ్రంథాలయానికి విశాలమైన భవనం ఉండటంతో అనేక విభాగాలు ఏర్పరచడానికి అవకాశం కల్గింది. కొలది కాలంక్రితం యునెస్కో సమాచార కేంద్రం యిచట ఏర్పాటు చేయబడింది. యునెస్కోకు సంబంధించిన సమాచారం ఇచట గల పత్రికలు, కరపత్రాలలో లభ్యమాతుంది. ప్రెస్ అండ్

రిజిస్ట్రేషన్ చట్టప్రకారం రాష్ట్రంలో అచ్చయిన ప్రతి పుస్తకం తాలూకు 3 ప్రతులను విధిగా రిజిష్ట్రార్ ఆఫ్ బుక్సుకు అంద జేయవలసి ఉంటుంది. ఆ విధంగా యివ్వబడిన వాటిలో ఒక పుస్తకం యీ గ్రంథాలయానికి చేరుతుంది. ఇవన్నీ యిచట ఒక ప్రత్యేక విభాగంలో ఏర్పాటుచేయబడి ఉన్నాయి. ఈ విధంగా వచ్చిన పుస్తకాలను ఒక క్రమబద్ధమైనరీతిలో అమర్చి నపుడే వీటివలన ప్రయోజనం పొందటానికి వీలుంది. ఇచట పేటెంట్ రికార్డులుగూడ జాగ్రత్తగా భద్రపరుచబడుతున్నవి.

*భవన విస్తరణ*

విశాల ప్రాతిపదికపై అత్యంతాకర్షణీయంగా నిర్మించ బడిన భవనం యీ గ్రంథాలయానికి ప్రత్యేక ఆకర్షణ ముందువైపు విభాగం అన్ని హంగులతో 1936లో నిర్మించ బడింది. అనేక శాఖలతో యీ గ్రంథాలయం అభివృద్ధి చెందుతూండగా భవనం చాలని లోపం కనుపించింది. కనుక ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దాదాపు 9 లక్షల రూపాయలు వెచ్చించి, యీ భవనాన్ని విస్తరించింది. ఈ విస్తరణ విభాగం 1960లో ప్రవేశ మహోత్సవం నాటి ముఖ్యమంత్రి, సాహిత్యాభిమాని శ్రీ సంజీవయ్య గారిచే చేయబడింది. ఈ విస్తరణ విభాగంలో గ్రంథాలయం తాలూకు కొన్ని శాఖ లతోబాటు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పౌరగ్రంథాలయ శాఖ డైరెక్టరువారి కార్యాలయమూ, ఆర్కైవ్స్ వారి వ్రాతప్రతుల విభాగము ఉన్నాయి. గ్రంథాలయాలకు సంబంధించిన అనేక కార్యక్రమాలకు యీ భాండాగారం ఒక నిలయంగా ఉంది.

ఈ మధ్యకాలంలో యీ భవనంలో కొద్ది పాటి మార్పులు చేయబడ్డాయి. ఏమైనప్పటికీ ముఖ్యంగా యీ గ్రంథాలయానికి తెలుగులో అచ్చయిన ప్రతి పుస్తకాన్ని, పత్రికా సంపుటాన్ని సేకరించి పండితులకు, పరిశోధకులకు, ప్రజానీకానికి అందించినపుడే యీ గ్రంథాలయం ఒక విజ్ఞాన కేంద్రంగా వర్ధిల్లుతుంది. దీనిపై ఖర్చుచేసే లక్షలాది ప్రజాధనం సద్వినియోగమౌతుంది.

—

# ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయం, గుంటూరు

## 16

రెండువేల సంవత్సరాలనాడే సర్వవిద్యల అధ్యయన అధ్యాపన విషయంలో దశదిశల కీర్తి చంద్రికలను వెలార్చిన విజయపురి, అమరావతి, పట్టణాలకు దీటుగా నేడు గుంటూరు మహానగరం సమస్త విద్యలకు కాణాచిగా విలసిల్లుతోంది. ఈ మహానగరంలో అందరి దృష్టిని ఆకర్షిస్తూన్న, అందరి ప్రశంసల నందుకొంటూన్న ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాన్ని గురించి జిజ్ఞాసువులందరూ తెలిసికొనవలసి ఉంది. తాను బాగుపడి యితరులను బాగుపరచాలనే పవిత్ర సంకల్పం గల గ్రంథాలయోద్యమానికి సహకరించవలసి ఉన్నది. సహాయపడివలసి ఉంది.

*గ్రంథాలయ ప్రారంభం*

చిరకాలంగా పలువురు పెద్దలు ప్రత్యేక రాష్ట్రంకోసం కృషిచేస్తూ వచ్చారు. వారి కృషి ఫలితంగానూ, తుదిదశలో పొట్టిశ్రీరాములుగారి ఆత్మత్యాగ ఫలితంగానూ మనకు 1953లో ప్రత్యేక రాష్ట్రం వచ్చింది. కర్నూలులో తాత్కాలిక రాజధాని ఏర్పడింది. ప్రతి రాష్ట్రానికి ఒక కేంద్ర గ్రంథా

లయం ఉండాలిగదా. అందుకోసం ప్రభుత్వం 1945 జనవరిలో విశాఖపట్నంలో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాన్ని స్థాపించింది. గ్రంథాలయ నిర్మాణానికి సంబంధించిన పనులు ప్రారంభమయ్యాయి. వాస్తవానికి విశాఖపట్నం మన రాష్ట్రానికి ఒక మూలగా ఉంది. కేంద్రం కాదు. అందుచేత రాష్ట్రంలో కేంద్ర ప్రాంతమూ, విద్యాసంస్థలకు కీలక స్థానమైన గుంటూరుకు యీ గ్రంథాలయాన్ని శాశ్వతంగా మార్చడానికి ప్రభుత్వం 1955 లోనే నిర్ణయించింది. కాని 1958 మే నెలలో గాని యీ పని కార్యరూపం ధరించలేదు.

ఇంతలో దేశంలో మరొక విప్లవాత్మకమైన మార్పు జరిగింది. 1956లో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడ్డాయి. తెలంగాణా ప్రాంతంలోని 9 జిల్లాలు, ఆంధ్ర ప్రాంతంలోని 11 జిల్లాలు కలుపుకొని హైదరాబాదు రాజధానిగా ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడింది. ఈ విలీనం వలన యింతకు ముందు చిర కాలంనుంచీ ఉన్న అసఫియా గ్రంథాలయం రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంగా మార్పుచేయబడింది, ఆ సందర్భంలో గుంటూరులోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాన్ని ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయంగా మార్పుచేశారు.

### సత్వరాభివృద్ధి

ఈ గ్రంథాలయం స్థాపించినప్పటినుండీ దిన దిన ప్రవర్థమానంగా పెరుగుతూ వచ్చింది. రాష్ట్రంలోని గ్రంథాలయాలకు తలమానికంగా ఉండేందుకు ప్రభుత్వం యీ గ్రంథా

లయం విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించి తగిన నిధులు సమకూర్చింది. అవి యోగ్యతగల సిబ్బందిచే సద్వినియోగ పరచబడి యీ గ్రంథాలయం అనతికాలంలోనే అపారమైన మైన కీర్తిప్రతిష్టలను సంతరించుకొన్నది. 1958 సెప్టెంబరు నుంచి ప్రజల ఉపయోగార్థం తెరువబడింది.

*గ్రంథ సంపద*

చదువరులకు అత్యంతోపయోగమైన పుస్తకాలను తెప్పించడంలో యీ గ్రంథాలయానికి పెట్టింది పేరు. ముఖ్యంగా తెలుగు, ఇంగ్లీషు భాషలలోని అనేక ఉద్గ్రంథాలు యీ గ్రంథాలయంలో చోటు చేసుకొన్నాయి. తెలుగులో లభ్యమౌతున్న ప్రతి మంచి పుస్తకమూ యీ గ్రంథాలయంలో స్థానం కల్పించుకొన్నది. వైద్యం, సాహిత్యం, సామాజిక శాస్త్రాలు మొదలైన విషయాలలోని ప్రసిద్ధ ఆంగ్ల గ్రంథాలకు యీ గ్రంథాలయం నిలయమైంది. సమాచార గ్రంథాలు తదితర సాహిత్యమూ సరేసరి మొత్తం మీద యీ సంవత్సరాంతానికి యీ గ్రంథాలయంలో సుమారు 60 వేల గ్రంథాలున్నాయి.

*పత్రికల విభాగం*

గ్రంథాలయ నిర్వహణలో పత్రికల విభాగం అత్యంత కీలకమైనది. ఈ విషయంలో కూడ యిచట ప్రత్యేక శ్రద్ధ చూపబడింది. దేశవిదేశాలలో లభించే నూరు పత్రికలు పైగా యిచట తెప్పించబడుతున్నవి. ముఖ్యమైన పత్రికలు

సంపుటాలుగా చేయబడి శాశ్వతప్రయోజనం కోసం భద్ర పరుచబడుతున్నాయి. మరొక ప్రశంసనీయమైన విషయ మేమంటే గత పదేళ్లుగా హిందూ, ఆంధ్రపత్రిక, దినపత్రికలు గూడ మాసానికొక సంపుటం చొప్పున బైండు చేయబడి భద్రపరుచబడుతున్నాయి.

## గ్రంథాలయసేవ

ఏ ప్రాంతంలోనైనా గ్రంథాలయసేవ విజయవంతం కావాలంటే ఉత్తమ చదువరులు, తగిన సిబ్బంది అనుకూల మైన వాతావరణమూ ఉండాలి. అదృష్టవశాత్తూ యీ గ్రంథాలయానికి యివన్నీ పెట్టని కోటలాగ అమరినాయి. అందుచేత యీ గ్రంథాలయం చాల హెచ్చుగా సేవ చేయ గలుగుతూంది. గ్రంథాలయంలో ఏడాదికి రెండు లక్షల మంది వరకు చదువు కొంటున్నారు. అరవయివేల పుస్తకాలు అరువివ్వ బడుతున్నాయి. వెయ్యిమందికి పైగా పుస్తకాలను యిండ్లకు తీసికొని వెళ్లే సభ్యులున్నారు. ఈ గ్రంథాలయం సాధారణంగా చదువరులకు విద్యావ్యాప్తిని పెంపొందించే వినియోగం కంటే చదువరుల ఉన్నత విద్యాభ్యాసానికి ఉదాత్త పథగమనానికి యీ గ్రంథాలయం విశేషం ఉప యోగపడుతున్నది. ఇది అభిలషించదగిన కార్యక్రమమే ఐన ప్పటికీ యీ నిర్వాహకులు ప్రజలలో విద్యావ్యాప్తికి దోహద పరచే వయోజనవిద్య మొదలైన కార్యక్రమాలు చేపట్టవలసి యుంది. అంగబలం, అర్థబలంగల యీ సంస్థకు యీ పని ఏమంత పెద్ద విషయం కాదు.

అమెరికన్ విభాగం

గత 15 సంవత్సరాలుగా గుంటూరులో నిర్వహింపబడిన అమెరికన్ సంస్కృతి కేంద్రం కారణాంతరాలవలన మూసివేయవలసి నప్పుడు అందుగల 5 వేల పుస్తకాలు, దృశ్యశ్రవ్య పరికరాలు యీ గ్రంథాలయానికి గత సంవత్సరమే ఉచితంగా యివ్వబడినవి. ఈ గ్రంథాలయా వరణలో మ్యూజియం భవనంలో యీ విభాగం ప్రత్యేకంగా ఉంచబడింది. అమెరికన్ సంస్కృతి, నాగరికతలకు ప్రతీకగా యీ గ్రంథాలయం నిర్వహింప బడుతూన్నది. ఈ మ్యూజియం భవనం స్థితి బాగా లేదు. దీనిని సత్వరం రిపేరు చేయించవలసి యున్నది.

గ్రంథాలయ భవనం

ఈ గ్రంథాలయం తొలిసారిగా పురమందిరంలో ప్రారంభించబడింది. గ్రంథాలయ నిర్వహణకు యీ భవనం అనుకూలమైనది గాదు. ఐనప్పటికీ కొద్దిపాటి సవరణలు చేసి ఉపయోగించు కుంటూ వచ్చారు. పిదప యీ భవనాన్ని ప్రభుత్వం కొనుగోలు చేసింది. ఆ తర్వాత మరికొన్ని మార్పులు చేయబడ్డాయి. గ్రంథాలయం ఏటేటా విస్తరింపబడటంతో నేడు ప్రస్తుత భవనం చాలీ చాలని స్థితిలో ఉంది. గ్రంథ విభాగం కోసం సత్వరం ప్రత్యేక భవనం నిర్మించవలసిన అవసరం ఎంతో కనిపిస్తుంది. దురదృష్టవశాత్తు గత సంవత్సరంలో వచ్చిన తుఫాను ఫలితంగా ప్రస్తుత భవనం

బాగా దెబ్బతిన్నది. జిల్లా కలెక్టరుగారి సహకారంతో మరల పునరుద్ధరింపబడింది.

*సమాజ విద్యా విభాగం*

ఈ గ్రంథాలయంలో ప్రత్యేకంగా ప్రశంసించ దగినది సమాజ విద్యా విభాగం. ఇది 1955 నుంచి నిర్వహింపబడు తున్నది. ఈ విభాగం తరఫున గోడవార్తా పత్రిక, బహిరంగ సభలు, పుస్తకప్రదర్శనలు, ప్రముఖ వ్యక్తుల జన్మదినోత్స వాలు, వ్యాసరచన పోటీలు చలనచిత్ర ప్రదర్శనలు మొదలై నవి నిర్వహింపబడుతున్నవి. ఈ విభాగానికి తగినంతగా నిధులు కేటాయిస్తే గ్రంథాలయ ప్రయోజనం తగినంతగా యినుమ డించడానికి వీలుంది.

*గ్రంధాలయ సహకారం*

ఏ గ్రంథాలయం సర్వసమగ్రం కాదు. ఎంత గ్రంథ సంచయమున్నా కొంత కొరత ఉంటూనే ఉంది. ఇతర గ్రంథాలయాల సహకారంతో యీ కొరత తీర్చుకొన వలసి ఉన్నది. అందుచేత రాష్ట్రంలో యితర గ్రంథాలయాలు కోరే పుస్తకాలను యీ గ్రంథాలయం పంపిస్తూ ఉంది. ప్రాంతీయ గ్రంథాలయంయొక్క ముఖ్య ప్రయోజనం గూడ యిదే. ఈ సేవ మరింత విస్తృతపరచవలసి ఉన్నది. ఈ గ్రంథా లయంలో విషయ ప్రాధాన్యం గల గ్రంథాల పట్టికను ప్రచు రించి అన్ని గ్రంథాలయాలకు అందజేస్తే మరింత ప్రయోజన కరంగా ఉంటుంది.

*మరికొన్ని కార్యక్రమాలు*

ఈ గ్రంథాలయం తరఫున జాతీయ గ్రంథసూచి 1958, 1959 సంవత్సరాల తాలూకు తెలుగు విభాగం ముద్రణ

కార్యక్రమం నిర్వహింపబడింది. బాలసాహిత్యం అను వివరణా త్మక గ్రంథసూచి తయారు చేయబడి బాలసాహితీమాల పేరున 1963లో ప్రచురింపబడింది. ఇది బహుదా ప్రశంసింప దగిన కృషి. ఆంధ్ర దేశంలోని 21 జిల్లా కేంద్ర గ్రంథాల యాలు, మరికొన్ని ప్రసిద్ధ గ్రంథాలయాలలో లభించే గ్రంథా లకు సమీకృతసూచీ (యూనియన్ కేటలాగ్) తయారుచేయ బడింది. ఇంతటి బృహత్ప్రయత్నం తొలిసారిగా భారత దేశంలో మన రాష్ట్రంలోనే చేయబడిందనుకుంటాను. ఈ సూచీ ఇప్పటికి ముద్రణ జరగలేదు. దీని ముద్రణ పూర్తయి నప్పుడు గ్రంథాలయ సహకారానికి మరింత ప్రయోజనకరంగా ఉంటుందనడంలో సందేహం లేదు.

సిబ్బంది

గ్రంథాలయ నిర్వహణ ప్రజోపయోగంగా ఉండవలె నంటే అందుకు సిబ్బంది బాధ్యత ఎంతో ఉంటుంది. అదృష్టవశాత్తు యీ గ్రంథాలయం ప్రారంభించినప్పటి నుండీ గ్రంథాలయ సేవ యందాసక్తి గల పలువురు నిరంతరం కృషి చేయబట్టి నేడీ ఉన్నత స్థితికి వచ్చింది. అందు ముఖ్యంగా శ్రీయుతులు కె బాపయ్య, వి పి నారాయణరెడ్డి, జి సత్యం గార్ల కృషి ప్రత్యేకంగా ప్రశంసింపదగినది. ప్రస్తుత గ్రంథ పాలకుడు శ్రీ టి వి రమణయ్యగారు గూడ పై వారి అడుగు జాడలలోనే గ్రంథాలయాభివృద్ధికి కృషి చేస్తున్నారు. వారికి అండదండలుగా వుంటున్న సహాయిక సిబ్బంది పాత్ర కూడ తక్కువది గాదు.

# రామమోహన గ్రంథాలయం

## 17

గత నూరేళ్ల కాలంలో వెలసిన దాదాపు అన్ని ఉద్యమాలకు గ్రంథాలయోద్యమం ఎంతో అండదండగా నిలచింది. ఒక చైతన్య ప్రవంతిగా యీ ఉద్యమం భావవ్యాప్తికి తోడ్పడింది. ఈ విషయం యింతకు ముందు వ్యాసాలలో గమనించాం. ముఖ్యంగా స్వాతంత్ర్యోద్యమానికి గ్రంథాలయోద్యమ తోడ్పాటు ఎంతో ఉంది. బెంగాలులో వందేమాతరం ఉద్యమం ప్రారంభమై దేశం నలుమూలలా వ్యాపించింది. వ్యక్తివికాసం, స్వాతంత్ర్య భావన ఉదయిస్తున్న యీ ఉషః కాలంలో రామమోహన గ్రంథాలయం అవతరించింది. విజయవాడకే వెలుగునిచ్చే మహత్తర సంస్థగా ఒకప్పుడు పనిజేసింది. గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకటరమణయ్యగారు నడిపిన ఉద్యమాలకు ఒక ప్రయోగశాలగా పనిజేసింది.

### స్థాపన

ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం తొలిదశలో ఉన్నపుడు స్థాపించబడిన గ్రంథాలయాలలో యీ సంస్థ ఎన్నదగినది, దీని స్థాపకులు బ్రహ్మసమాజ ప్రచారకులు ఇ సుబ్బుకృష్ణయ్యగారు. కలకత్తాకు చెందిన బాబు హేమచంద్ర సర్కార్, లండన్ నగరంలోగల బ్రిటీషు

అండ్ ఫారిన్ యూనిటేరియన్ సంఘం ఉచితంగా యిచ్చిన 200 పుస్తకాలతో యీ గ్రంథాలయం విజయవాడలో ఆస్తిక పుస్తకభాండాగారం పేరుతో 1903లో స్థాపించ బడింది. ఈ గ్రంథాలయం ఒక మారుమూలగా ఉండుటచేత ప్రజలకు ఎక్కువగా ఉపయోగించడంలేదు. వందేమాతర ఉద్యమ ప్రేరితులైన కొందరు యువకులు యీ గ్రంథాల యాన్ని బకింగ్‌హామ్ పేటలో అందరూ వచ్చే ప్రదేశానికి 1911లో తరలించి, నాడు తన ఉపన్యాసాలతో దేశాన్ని ప్రభావితం చేసిన రాజారామమోహనరాయ్ గౌరవార్థం, రామమోహన గ్రంథాలయంగా పేరుమార్చారు. యువకుల ఉత్సాహం, దీక్ష, త్యాగం యీ గ్రంథాలయ ప్రగతికి పెట్టని కోటగా పని జేశాయి.

*భవనం*

అయితే అప్పటి కింకా భవనం ఏర్పడలేదు. పుస్త కాలు, పత్రికలు క్రమంగా చేరుతున్నాయి. గ్రంథాలయ ప్రథమ వార్షికోత్సవ సమయంలో తిరువూరు జమీందారు రాజా వెల్లంకి చిన వెంకట్రామారావు బహద్దరు జమీం దారుగారు యీ గ్రంథాలయానికి తన పూర్తి ఖర్చుతో భవనం కట్టించి యిస్తామని వాగ్దానం చేశారు. 1912లో జరి గిన యీ ఉత్సవానికి భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షత వహించారు. రాజావారిచ్చిన హామీని పురస్క రించుకొని ప్రస్తుతం బందరు రోడ్డులో గ్రంథాలయం గల స్థలాన్ని పురపాలకసంఘం వారి నుంచి వేలంలో కొన్నారు.

కాని ఆ సమయంలో సొమ్ము చెల్లించి స్థలాన్ని స్వాధీనం చేసుకోడానికి కార్యకర్తలవద్ద డబ్బు లేదు. ఆ సమయంలో అయ్యంకి వెంకటరమణయ్య, సూరి వెంకటనరసింహశాస్త్రి మొదలైన ఆనాటి యువకులు చందాలు ప్రోగుచేసి, అప్పు చేసి ఎంతో ప్రయాసకులోనై స్థలాన్ని స్వాధీనం చేసుకున్నారు. నివేశన స్థలానికయిన ఖర్చులో మునగాల రాజా నాయని వెంకట రంగారావు బహద్దరు, పాటిబండ సుబ్రహ్మణ్యం, బొడ్డపాటి వెంకటప్పయ్యగారలు తలొక ఐదువందల రూపాయలు విరాళంగా యిచ్చారు. 1913లో భవనానికి శంకుస్థాపన జరిగింది. 1916లో భవన ప్రవేశ మహోత్సవం గౌరవనీయ పింగళి వెంకట్రామిరెడ్డి గారిచే వైభవోపేతంగా జరిగింది. పిదప కౌతా సూర్యనారాయణ రావుగారు భవనానికి పై అంతస్తు నిర్మించారు. ఈ విధంగా గ్రంథాలయానికి అనువైన భవనం ఏర్పడింది.

ఇతర కార్యక్రమాలు

విజయవాడలో వెలసిన అనేక సంస్థలకు, సంఘాలకు, ఉద్యమాలకు యీ గ్రంథాలయం కార్యస్థానంగా తోడ్పడింది. ఈ గ్రంథాలయ ఆదరణ క్రింద 1914లో ప్రథమ ఆంధ్ర దేశ గ్రంథ భాండాగార ప్రతినిధుల మహాసభ జరిగినది. తత్ఫలితంగా ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘం ఏర్పడి నేటి వరకు పనిజేస్తున్నది. అదే సంవత్సరంలో అయ్యదేవర కాళేశ్వర రావు పంతులుగారు పంచములకు పాఠశాల స్థాపించి వారిలో విద్యావికాసాలు పెంపొందించడానికి తోడ్పడ్డారు. 1917లో

యీ గ్రంథాలయంలో రాయసం వెంకట శివుడుగారు బాలల విభాగాన్ని స్థాపించారు. ఈ గ్రంథాలయాన్ని కేంద్రంగా చేసుకొని అయ్యంకి వెంకటరమణయ్యగారు తమ ప్రజా జీవితాన్ని దేశానికి అంకితం చేశారు. 1917లో కృష్ణ వరద పొంగినపుడు అయ్యంకివారు "సోషల్ సర్వీస్‌లీగ్" స్థాపించి వరద బాధితులకు గ్రంథాలయంలో ఆశ్రయ మిచ్చారు. అనిబీసెంట్ ఆదేశానుసారం బాలభట ఉద్యమాన్ని 1918లో అయ్యంకివారు ప్రారంభించారు.

ఫూల్స్ క్లబ్

స్వాతంత్ర్యోద్యమ కాలంలో రహస్య పోరాటాలకు యీ గ్రంథాలయం ఒక కేంద్రంగా పనిజేసింది. నోరి వెంకటే శ్వర్లుగారు యీ గ్రంథాలయంలో "ఫూల్స్ క్లబ్బు"ను స్థాపించారు. దీని పరంగా విప్లవ బీజాలు వాడవాడలలో వెదజల్లే వారు. నాడు నిషేధింపబడిన సావర్కార్ భారత స్వాతంత్ర్య సమరం, ఐర్లండు దేశచరిత్ర, గారిబాల్డీ జీవితం మొదలైన గ్రంథాలు కొద్దికొద్ది భాగాలుగా సైక్లోస్టయిల్ తీసి యువకులకు ఇచట అందించేవారు. ఈ గ్రంథాలయంలో కార్యకర్తలు పైకి గ్రంథాలయ సేవకులుగా కనిపించినా, మరో వైపు చైతన్య జ్వాలలుగా నాడు ఆంధ్రదేశం నలుమూలలా స్వాతంత్ర్య కాంక్షను, స్వదేశీ ఉద్యమాన్ని పరివ్యాప్తం చేశారు.

ఇటీవలి పరిస్థితి

ఒకప్పుడు ఎంతో ఉన్నతంగా పనిజేసిన యీ గ్రంథాలయ నిర్వహణ స్వాతంత్ర్యం వచ్చాక కుంటుపడింది. గ్రంథా

లయోద్యమానికి కృషిచేసే కార్యకర్తలు తరిగిపోయారు. గ్రంథాలయోద్యమ వ్యాప్తికోసం ఏర్పడిన గ్రంథాలయ చట్టంలో ప్రయివేటు గ్రంథాలయాలకు స్థానం సన్నగిల్లింది. ఒకప్పుడు ప్రయివేటు గ్రంథాలయాల అభివృద్ధికి అహర్ని శలు కృషి చేసిన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం మూగ వోయింది. అనేక అపురూప గ్రంథాలు దాదాపు 10 వేలు కలిగి, చక్కని భవనం కలిగి విజయవాడ పేరులకు యీ గ్రంథాలయం కనీస సేవ నేడు చేయలేక పోతున్నది. ప్రజా సంస్థలయెడ తెలుగువారికిగల అలసత్వానికిది ప్రబల నిదర్శనం. దీని అభివృద్ధికి విజయవాడ పౌరులు, కృష్ణాజిల్లా గ్రంథాలయ సంస్థ కృషిచేయవలసింది.

ఈ సంస్థ యీ మాత్రంగానైనా నిలబడి ఉండడానికి నిర్విరామ కృషి చేస్తున్న యువకులు వి రామకృష్ణరావుగారిని యీ సందర్భంలో అభినందించక తప్పదు.

---

# ఆహుతైన అపూర్వ గ్రంథాలయం

# 18

ఆవేశాలకు కావేషాలకు లోనై గ్రంథాలను దగ్ధంచేసి కసి తీర్చుకోవడం మన దేశంలోనేగాదు - దాదాపు ప్రపంచం లోని అన్ని దేశాల్లోనూ, ఎప్పుడో ఒకప్పుడు ఉంటూనే ఉన్నది. మానవ ప్రగతికి గ్రంథాలు తోడ్పడుతూ ఉంటే పుస్తకాలను బూడిద పోగుగా చేయడానికి మానవుడు ప్రయత్నిస్తున్నాడు. కాని ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రగతి ఆగదు. భావసంచలనకు ఏ శక్తీ అడ్డురాదు. బెన్ జోసెఫ్ ఆకీబా అన్నట్లు "కాగితం తగలబడిపోతుంది, కాని మాటలు పైకెగసి పోతాయి."

## విదేశాలలో

రాజులు, మతాధికారులు, విప్లవకారులు, ప్రజానాయకులు తమకుగల ప్రాభవాన్ని ఉపయోగించి తమకు గిట్టనివారి గ్రంథాలను మటుమాయం చేయడం తరతరాలుగా జరుగుతూనే ఉంది. ఓమర్ అలెగ్జాండ్రియాను వశపరచుకున్నప్పుడు ఒక్క కురాన్ మాత్రం ఉంచి మిగతా గ్రంథాలన్నిటినీ తగలబెట్టించాడు. ఒక్క కురాన్‌లో అన్ని గ్రంథాల సారాంశం ఉందని ఓమర్ అభిప్రాయం. క్రైస్తవ మత ప్రచారకుల లోపాలను ఎత్తిచూపి మతంలో విప్లవాత్మక

మైన మార్పులు తీసుకువచ్చినందుకు క్యాతలిక్కులు 1520లో జర్మన్ ప్రవక్త మార్టిన్ లూథర్ గ్రంథాలను తగలబెట్టారు. హిట్లర్ అనుచరులు ఆ దినాలలో మార్క్స్, లెనిన్, బ్రెచల్ రచనలు, ముఖ్యంగా బైబిల్ ను బూడిదపాలు చేశారు. వోల్టేర్ జీవితచరిత్ర వ్రాసిన జోసఫ్ లూయీస్ యిలా అన్నాడు. "రచయిత పుస్తకాలను తగలబెట్టడం, వారిని ఖైదు చేయడం, ఒక విధంగా వారిని అభినందించడమే అవుతుంది. వారి భావాలకు హెచ్చు ప్రచార మివ్వడమే అవుతుంది." ఇలాంటి సాదృశ్యాలు విదేశాలలో కోకొల్లలుగా ఉన్నాయి.

### మనదేశంలో

సంస్కృతికీ, సంపదకు వేల సంవత్సరాల చరిత్ర గలదని చెప్పుకుంటున్న మన దేశంలో పుస్తకాలను తగలబెట్టిన సంఘటనలు వందల సంఖ్యలో ఉన్నాయి. జైనులు, బౌద్ధులు, హిందువులు, ముస్లింలు, శైవులు, వైష్ణవులు పరస్పరం అమూల్య గ్రంథాలెన్నిటినో అగ్నికి ఆహుతి చేశారు. ఉత్తర దేశంలో హిందీ వాదులు ఆంగ్ల గ్రంథాలను దగ్ధం చేస్తే, దక్షిణ దేశంలో హిందీ వ్యతిరేకవాదులు హిందీ గ్రంథాలను నడి రోడ్లు మీద దగ్ధం చేశారు. ఇవి రామస్వామి నాయకర్ అనుచరులు ప్రాచీన గ్రంథాలు ప్రజలను చెడుత్రోవ పట్టిస్తున్నాయనే దృష్టితో రామాయణ, భారతాలను దొరికిన ప్రతులను బుగ్గిపాలు చేశారు. ఇవిగాక యాదృచ్ఛికంగా అగ్నికి ఆహుతైన పుస్తకాలలో వేలూరి

శివరామశాస్త్రిగారి స్వంత గ్రంథాలయం అపూర్వమైనదిగా చెబుతారు. స్వంత గ్రంథాలతో బాటు శాస్త్రిగారి రచనల వ్రాత ప్రతు లనేకం ఉన్నాయట. ఈ నష్టాన్ని కళ్ళారా చూచిన శాస్త్రిగారు అవ్యక్త బాధాహృదయులై మరల కొన్ని సంవత్సరాలదాకా రచనలు చేయలేక పోయారట.

అన్నిటికంటే - ఈ మధ్య కాలంలో ఉక్కు ఫ్యాక్టరీ ఆందోళనకారులు 1966 నవంబరు 1వ తేదీన గుంటూరులో భస్మీపటలం చేసిన పురపాలక సంఘ గ్రంథాలయం మననుంచి దూరమైన రత్నఖచిత రమణీయ భండారం. ఈ సందర్భంలో ఆంధ్రజ్యోతి ప్రత్యేక విలేఖరి వ్రాసిన (5-11-1966) చిన్న వ్యాసాన్ని యీ దిగువ పొందుపరుస్తున్నాం.

మునిసిపల్ లైబ్రరీ

"విద్యకు, విజ్ఞానానికి విలువనిచ్చే ప్రతి వ్యక్తికి, సంస్కృతినీ, సభ్యతను తులలేనివిగా భావించే ప్రతి వ్యక్తికి కంటనీరు తెప్పించగల శోచనీయ సంఘటన గుంటూరు మునిసిపల్ లైబ్రరీ బూడిదైపోగు కావడం! ఉక్కు ఫ్యాక్టరీ ఉద్యమం సందర్భంలో జరిగిన - జరుగుతున్న - ఉద్రిక్త చర్యల మంచి చెడ్డలను నేను చర్చించ బోవడం లేదు. కాని, మునిసిపల్ లైబ్రరీకి నిప్పుపెట్టిన వారు తమ చర్యలవల్ల తమ పట్టణం ఎంతటి మహత్తర సంపదను కోల్పోగలదో ఒక క్షణంపాటు ఆలోచించి వుంటే ఆపని చేయడానికి వారికి బహుశా చేతులు వచ్చేవి కావు.

ఈ మునిసిపల్ లైబ్రరీ ఏమంత పెద్దది కాకపోవచ్చు. తెలుగు, సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు పుస్తకాలన్నింటిని కలుపుకొని దీనిలో నాలుగైదు వేలకు మించి లేకపోవచ్చు. అయినా వీటిలో కనీసం ఒక వెయ్యి పుస్తకాలు ఈనాడు అచ్చులో లేనట్టివి, ఎంత ధరకైనా లభించనట్టివి; మద్రాసు లోని ఏ కన్నెమరా లైబ్రరీలోనో, కలకత్తాలోని నేషనల్ లైబ్రరీలోనో తప్ప చదువుకోడానికి దొరకనట్టివి; మన చరిత్రపట్ల, సంస్కృతిపట్ల భక్తి శ్రద్ధలున్నవారు కన్నులకు అద్దుకో దగినట్టివి.

ఈ లైబ్రరీపై దాడిచేసి, దీనికి నిప్పు పెట్టిన వారు ఇ బి హావెల్, ఆనంద కుమారస్వామి పేర్లను విని వుండక పోవచ్చు. భారతీయ చిత్ర, శిల్పకళల సౌందర్యాన్ని, సందే శాన్ని వారు లోకానికి చాటి చెప్పారు. వారు చెప్పకపూర్వం మన కళల అందాన్ని, వాటి అర్థాన్ని, వాటి అమూల్య సందేశాన్ని గుర్తించలేని స్థితిలో మనమే వున్నాము. అయి నప్పుడు పాశ్చాత్యులు వాటి విషయమై ఇంతకంటె అజ్ఞాన స్థితిని ప్రదర్శించడం ఆశ్చర్యకర విషయం కాదుగదా? ఇట్టి స్థితిలో మన కళలకు పూజారులై, వాటి సేవకే జీవితాన్ని అంకితం చేసి వాటిపట్ల సమస్త ప్రపంచానికి భక్తిగౌరవాలను కల్పించిన ప్రముఖులే హావెల్ ఆనంద కుమార స్వాములు. అచ్చులోలేని వారి రచనలు కనీసం పది, పదిహేను మొన్నటి సంఘటనలో బూదిపాలైనాయి.

శ్రీ బెనర్జీ – శాస్త్రి సంస్కృతంలో మహాపండితుడు. పాట్నా విశ్వవిద్యాలయ సంస్కృత పీఠానికి ఆయన కొంత

కాలంపాటు ప్రధానాచార్యులు. వేదవేదాంగాలలో, ప్రత్యేకించి ఋగ్వేదంలోను, శతపథ బ్రాహ్మణంలోను - ఎంత వరకు ప్రాచీన భారత చరిత్రకు సంబంధించిన చారిత్రకాంశాలున్నవో నిర్ణయించడానికై ఆయన ప్రత్యేక పరిశోధనలు చేశారు. తమ కృషి ఫలితంగా ఆయన కొన్ని విషయాలను వెలుగులోకి తెచ్చి, కొన్ని కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదించారు కూడా. వేదకాలంనాటి సంఘర్షణలలో ఆర్యులు, దస్యులు మాత్రమే కాక, మరొక జాతివారు కూడా పాల్గొన్నారని ఆయన చేసిన ఒక ప్రధాన సిద్ధాంతం. ఆ మూడవది అసురజాతి అని నిరూపణ చేయడానికి శ్రీ బెనర్జీ - శాస్త్రి యత్నించారు. ఈ అసురులు దస్యులకు భిన్నులని, వీరు అసిరియా నుంచి మన దేశానికి వచ్చినవారని, నౌకాయానంలో, నౌకా వాణిజ్యంలో వీరు ప్రవీణులని, ఆర్యులకంటె నాగరికులని ఆయన వాదం. ఈ విషయాలన్నింటిని పొందుపరుస్తూ "అసుర ఇండియా" అనే పరిశోధక గ్రంథాన్ని ఆయన దాదాపు అర్థశతాబ్ది క్రితం ప్రచురించారు. ఈనాడు మన దేశం మొత్తంపై ఒక యాభై గ్రంథాలయాలలో నైనా దీని ప్రతి లభిస్తుందో, లేదో అనుమానమే. మునిసిపల్ లైబ్రరీ బూదిపోగులో ఈ అమూల్య గ్రంథం ప్రస్తుతం ఒక గుప్పెడు బూడిద!

మన దేశంలో కొనసాగుతున్న విప్లవోద్యమాలను గురించి విచారించడానికై 1917లో బ్రిటీషు ప్రభుత్వం సర్ సిడ్నిరౌలట్ అధ్యక్షుడుగా ఒక కమిటీని నియమించింది. ఈ

కమిటీ నివేదిక సూచనల ప్రకారం జరిగింది కనుకనే 1919లో అమలు జరిగిన నిరంకుశ శాసనాన్ని రౌలట్ చట్టం అన్నారు. రౌలట్ కమిటీని తామే నియమించినా అది తమకు సమర్పిం చిన నివేదికను తమ ముద్రణాలయంలో తామే స్వయంగా ముద్రించిన అది విప్లవోద్యమ చరిత్రను, విప్లవ పద్ధతులను సమగ్రంగా వివరిస్తుందని ఆ కారణంగా విప్లవకారులకు ఒక పాఠ్యగ్రంథంగా వినియోగిస్తున్నదని బ్రిటీషువారు తమ కమిటీ నివేదిక ప్రచారం కాకుండా తామే చర్య తీసుకొన్నారు. ఈ రౌలట్ కమిటి నివేదిక - దీన్ని "సెడిసన్ కమిటీ నివేదిక" అని కూడా పేర్కొనడం కద్దు. చాలా చెదురుగా తప్ప ఇప్పుడు దొరకదు. మునిసిపల్ లైబ్రరీ బూడిదిపోగులో ఈ నివేదిక ప్రతి సయితం ఈ నాడు ఒక గుప్పెడు బూడిద!

మచ్చుతునకలుగా ఈ మూడు గ్రంధాలను గురించి మాత్రమే నేను వ్రాశాను. అచ్చులో లేని ఇట్టి పుస్తకాలు - అమూల్యమైన ఇట్టి గ్రంధాలు - మరెన్నో మునిసిపల్ లైబ్రరీ బూడిద పోగులో నేడు గుప్పెడేసి బూడిదగా వున్నాయి. మనకు గౌరవనీయులైన, మనకు పూజనీయులైన దాదా భాయ్ నౌరోజీ, ఫిరోజ్‌షా మెహతా, సురేంద్ర నాథ్ బెనర్జీ, మదన మోహన్ మాలవ్యా, బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణగోఖలే, బిపిన్ చంద్రపాల్, లాలాలజపతి రాయ్, అరవిందఘోష్, అనిబిసెంట్, మోహన్‌దాస్ కరంచంద్ గాంధి, చిత్తరంజన్‌దాస్, జవహర్‌లాల్ నెహ్రూ, సుభాసు చంద్రబోసు ప్రభృతుల రచనలు ఆ బూడిదిపోగులో

కొంత కొంత బూడిదగా మిగిలి వున్నాయి. వారి రచనలలో అనేకం ఈ నాడు కష్టసాధ్యంగాగాని లభించడం లేదు.

వివరాలలోనికి పోకుండా మన మతం, మన సాహిత్యం, మన కళలు, మన విజ్ఞానం, మన సంస్కృతి, మన చరిత్ర, మన సంప్రదాయాలు – అన్నీ ఆ బూదిపోగులో కలసివున్నాయంటే సరిపోతుంది.

పునరుద్ధరణ

పోయిన గ్రంథాలయం పోగా దానిని మరల పునరుద్ధరించాలని గుంటూరుజిల్లా గ్రంథాలయ సంఘం తరపున త్రిపురమల్లు లక్ష్మయ్యగుప్త, గుడివాడ పుల్లారావు, రాచపూడి లక్ష్మీనరసింహారావు, గరికపాటి రామారావు, అనఘా గురుసుబ్బరాజు ప్రభృతులు తీవ్రమైన కృషిచేశారు. ఇల్లిల్లూ తిరిగి వందల సంఖ్యలో పుస్తకాలు ప్రోగుచేసి పురపాలక సంఘానికి అప్పగించారు. మరల గాంధీ పార్కులో గ్రంథాలయం వెలిసింది. నామ మాత్రంగా పనిజేస్తున్నది. అపూర్వ గ్రంథసంచయంతో వెలసిల్లిన వెనుకటి వైభవాన్ని, ప్రభావాన్ని – యిప్పుడు గల స్థితిని బేరీజు వేస్తే – ఫలపుష్ప భరితమైన మహావృక్షానికి మోడువారిన నిస్సార తరువుకు గల అంతరం అంతరంగం గల వారందరికీ గోచరిస్తుంది!

—

# చారిత్రక సూచి
# 19

## *1800*

ఇంగ్లీషు చదువులు, ప్రాథమిక విద్య, గ్రంథాలముద్రణ, రాజకీయమైన మార్పులతో దేశంలో నవయుగానికి నాంది జరిగింది.

## *1801*

లండన్‌లో ప్రాచ్య గ్రంథాలయ ప్రారంభం - ఇదే ఇండియా ఆఫీస్ గ్రంథాలయానికి ప్రాతిపదిక అయింది.

(పుట 43)

## *1812*

బొంబాయిలోని ఏసియాటిక్ సొసైటీ పరంగా వారి సభ్యులకోసం ఏర్పాటు చేసుకున్న గ్రంథాలయం పౌరులందరి ఉపయోగార్థం తెరువబడింది. (పుట 33)

## *1835*

కంపెనీ ఉద్యోగులకోసం పరిమితమైన కలకత్తా పౌర గ్రంథాలయం పౌరులందరికోసం తెరువబడింది. పిదప యిది ఇంపీరియల్ గ్రంథాలయంగా జాతీయ గ్రంథాలయంగా రూపొందింది. (పుట 43)

*1860*

మద్రాసులో అప్పటి వరకు మద్రాసు మ్యూజియానికి అనుబంధంగా ఉన్న చిన్న విభాగం - విదేశీ ఉద్యోగుల ఉదాత్తచర్య వలన కన్నెమరా పౌరగ్రంథాలయంగా మార్చబడింది. (పుట 19)

*1867*

ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ ఆఫ్ బుక్స్ ఆక్టు అమలులోకి వచ్చింది. దీని వలన ప్రతి ముద్రాపకుడు అచ్చయిన ప్రతి పుస్తకం తాలూకు 3 ప్రతులను పుస్తకాల రిజిస్ట్రారుకు పంప వలసి ఉంది.

*1891*

పాట్నాలో ఖుదాబక్షి ప్రాచ్య గ్రంథాలయ స్థాపన.
(పుట 66)

*1898*

రాజమండ్రిలో గౌతమీ గ్రంథాలయం స్థాపన.
(పుట 112)

*1901*

హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయ స్థాపన. (పుట 103)

*1907*

నెల్లూరులో వర్ధమాన సమాజ పరంగా పఠన మందిరం ప్రారంభం.

### *1911*

వేటపాలెంలో జార్జి కారనేషన్ రీడింగ్‌రూమ్ స్థాపన. తర్వాత యిది సారస్వత నికేతనంగా రూపొందింది
(పుట 138)

అదే సంవత్సరం విజయవాడలో రామమోహన ఫ్రీ రీడింగ్‌రూం అండ్ లైబ్రరీ స్థాపన (పుట 167)

### *1914*

విజయవాడలో ప్రథమ ఆంధ్ర దేశ గ్రంథ భాండాగారుల మహాసభల నిర్వహణ, సంఘస్థాపన (పుట 170)

### *1936*

అనకాపల్లిలో శారదా గ్రంథాలయ స్థాపన (పుట 130)

### *1939*

బొంబాయి రాష్ట్రానికి గ్రంథాలయ విధానాన్ని సూచించేందుకు ప్రభుత్వం పైజీకమిటీ నియామకం (పుట 38)

### *1948*

మద్రాసు పౌర గ్రంథాలయ చట్టం ఆమోదం

### *1953*

భారత ప్రభుత్వం, యునెస్కో, ఆధ్వర్యంలో ఢిల్లీ పౌర గ్రంథాలయ స్థాపన (పుట 79)

*1954*

డెలివరీ ఆఫ్ బుక్స్ అండ్ న్యూస్ పేపర్స్ చట్టం ఆమోదింపబడింది. దీనివలన భారతదేశంలో అచ్చయిన ప్రతి పుస్తకం ఒక్కొక్క ప్రతిని ప్రచురణకర్తలు జాతీయ స్థాయిలో గుర్తించబడిన 3 గ్రంథాలయాలకు పంపించవలసి ఉంది

*1955*

హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టం ఆమోదం

*1957*

భారతదేశంలో గ్రంథాలయోద్యమాన్ని పరిశీలించి ఒక విధానాన్ని సూచించేందుకు సిన్హా కమిటీని భారత ప్రభుత్వం నియమించింది

* * *

అహమ్మదాబాదులో లాల్భాయి దల్పత్భాయి భారతీయ సంస్కృత విద్యామందిర స్థాపన (పుట 74)

*1958*

విశాఖపట్నంలో ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయ స్థాపన. తర్వాత దీనిని గుంటూరుకు తరలించారు. (పుట 160)

* * *

జాతీయ గ్రంథసూచి ప్రచురణ ప్రారంభం

*1960*

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయచట్టం ఆమోదం

*1965*

మైసూరు పౌర గ్రంథాలయ చట్టం ఆమోదం

*1667*

మహారాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టం ఆమోదం

*1976*

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్ట పరంగా జరుగుతున్న కృషిని పరిశీలించి ఉద్యమాభి వృద్ధికి సూచనలు చేయడానికి ప్రభుత్వం గోపాలరావు ఎక్బోటేగారి ఆధ్వర్యంలో సంఘాన్ని నియమించింది.

—

# ప్రజా సేవకుడు
# పోతిని వెంకన్న చౌదరి
# 20

సిరులు పండిన బంగారు మాగాణం కారంచేడు (ప్రకాశంజిల్లా) గ్రామంలో జన్మించిన వెంకన్న చౌదరిగారు ఒక సామాన్య వ్యక్తి. కాని అసామాన్య శక్తిమంతులు. సామాన్య విద్యావంతులు. కాని అసామాన్య సంస్కారశీలి. జీవిత పరిచయం వ్రాయదగిన వ్యక్తి కాదు. కాని చరిత్ర రచనకు సరంజామా అందించిన కార్యశీలి. బలమేగాని దౌర్బల్యం లేని సేవాపరాయణుడు. అందుచేతనే వారి సేవా భావాన్ని గురించి కొన్ని విషయాలు తెలుసుకోవడం సముచితం.

*కుటుంబం*

చౌదరిగారు 1909లో జన్మించారు. తండ్రి లక్ష్మయ్య, తల్లి సుబ్బమ్మ. ప్రాథమిక విద్యాభ్యాసం కారంచేడులోనే ముగించారు. 1929లో యార్లగడ్డ సుబ్బారాయుడుగారి కుమార్తె రత్నమ్మగారితో వివాహం జరిగింది. శ్రీయుతులు రామచంద్రరావు, లక్ష్మీనారాయణ, సుబ్బారావు వారి పుత్రులు. శ్రీమతులు లక్ష్మీకన్యాకుమారి, రమాదేవి, వెంకటరత్నకుమారి వారి పుత్రికలు. చౌదరిగారి ప్రజాకార్యక్రమాలన్నిటికీ వారి కుటుంబ సభ్యుల అండదండలు సంపూర్తిగా ఉంటాయి.

### సేవారంగంతో పరిచయం

ఒక సర్వోదయ కార్యకర్తగా చౌదరిగారు జీవితాన్ని ప్రారంభించారు. ప్రముఖ సర్వోదయ నాయకులు డాక్టరు వెంపటి సూర్యనారాయణగారి సాహచర్యం వారిని ప్రజా సేవానురక్తునిగా చేసింది. వారి మంచితనం, ఒక కార్యకర్తగా వారు సాధించిన ప్రగతికి ప్రతిఫలంగా 1956 లో గ్రామ సర్పంచిగా ఎన్నికై గ్రామాభివృద్ధికి అనేక అభివృద్ధికరమైన కార్యకలాపాలు నిర్వహించారు.

### గ్రంథాలయోద్యమం

అన్నిటికంటే వారికిష్టమైనది గ్రంథాలయోద్యమం. గత మూడు, నాలుగు దశాబ్దాలుగా గ్రంథాలయ సంఘంలో సభ్యులు. గ్రామీణ ప్రజానీకంలో విద్యావికాసాలు పెంపొందడానికి గ్రంథాలయం అవసరమని భావించి గ్రామ పెద్దల, యువకుల సహాయంతో 1950లో కవిరాజ గ్రంథాలయాన్ని స్థాపించారు. దీన్ని రైతు బాంధవుడు ఆచార్య రంగా ప్రారంభించారు. దాదాపు పదిహేనేళ్లు విజయవంతంగా నిర్వహించాక, యీ గ్రంథాలయం క్రమాభివృద్ధి చెందడానికి వీలుగా దీనిని జిల్లా గ్రంథాలయ సంస్థకు అప్పగించారు.

అనివార్య పరిస్థితులలో యీ గ్రంథాలయం మూతపడింది. చాల సంవత్సరాలుగా గ్రామపెద్దలు పెంచి, ప్రోది చేసిన అపూర్వ గ్రంథసంచయం క్రమంగా చదలుకు ఆహుతి కాజొచ్చింది. ఈ సమస్యను పరిష్కరించడానికి గ్రామస్థు

లెవరూ పట్టించుకోలేదు. పరిస్థితిని చూచి చౌదరిగారు బాధా పరితప్త హృదయులైనారు. ఒక అపూర్వమైన త్యాగంచేసి, ఎంతటి తీవ్ర పరిణామానికైనా ఎదుర్కొవడానికి సిద్ధమై, గురుతరమైన బాధ్యతను తనపై వేసుకొని గ్రంథాలయాన్ని తెరిపించారు. యావన్మంది ప్రశంసలను అందుకున్నారు. మంచిని పెంచుకున్నారు.

ఒక గ్రంథాలయ పునరుద్ధరణకు వారు చేసిన అసామాన్య త్యాగానికి, దీక్షకు కృతజ్ఞతగా, వారి సేవా భావానికి ప్రతిఫలంగా యీ రచన సమర్పించ బడింది. అనతికాలంలోనే ఆ గ్రంథాలయం చక్కగా పనిజేసి పూర్వ ప్రతిష్ఠను సంతరించుకున్నది. దాని ఫలితంగా అపూర్వమైన భవనాన్ని గ్రామస్థుల సహకారంతో సంతరించుకున్నది. ప్రసిద్ధ గ్రంథాలయాలలో ఒకటిగా రూపొందబోతోంది. ఈ ప్రజాబలమే ఆంధ్ర గ్రంథాలయోద్యమానికి మూలకందం. చౌదరిగారివంటి కార్యకర్తలే మూల విరాట్టులు.

కారంచేడు గ్రంథాలయం ఉన్నంత కాలం చౌదరిగారి సేవా చంద్రికలు పరిమళిస్తూనే ఉంటాయి. ఇది చారిత్రక సత్యం.

—

గ్రంథాలయశాస్త్రంలో

# వెలగా వెంకటప్పయ్యగారి

## స్వయంశోధక రచనలు

1 గ్రంథాలయ విజ్ఞానం
2 సమాచార విజ్ఞానం
3 గ్రంథాలయ వర్గీకరణ – ప్రయోగ దీపిక
4 గ్రంథాలయ సూచీకరణ – ప్రయోగ దీపిక
5 గ్రంథసూచికలు (బిబ్లియోగ్రఫీస్)
6 ఇంటింటా గ్రంథాలయం
7 పుస్తకాల భద్రత
8 ప్రసిద్ధ గ్రంథాలయాలు
9 గ్రంథాలయ చట్టం
10 గ్రంథకర్త గుర్తులు
11 వర్గీకరణ నియమాలు
12 అమెరికన్ గ్రంథాలయాలు
13 ఆంధ్ర తెలంగాణ గ్రంథాలయ ప్రగతి
14 గ్రంథాలయ పరిభాష
15 గ్రంథాలయ నిర్వహణ
16 బాలల గ్రంథాలయాలు
17 గ్రామీణ గ్రంథాలయాలు
18 విద్యాలయ గ్రంథాలయ నిర్వహణ

సంపాదిత గ్రంథాలు

1 గ్రంథాలయదర్శిని 1958-63
2 భారత గ్రంథాలయోద్యమం
3 గ్రంథాలయ జ్యోతి
4 ప్రాచీన గ్రంథాలయ చరిత్రము
5 గ్రంథాలయ వేదం
6 పౌరగ్రంథాలయ సదస్సు

గ్రంథ సూచికలు.

1 ఆంధ్ర వాఙ్మయ సంగ్రహ సూచిక
2 శాస్త్రీయ వాఙ్మయ సూచిక
3 ఆంధ్ర గ్రంథ సూచిక
4 రవీంద్ర సాహిత్యం
5 గాంధీజీ శతజయంతి సూచి
6 బాల సాహిత్య సూచి

జీవిత చరిత్రలు

1 శరణు రామస్వామి చౌదరి
2 అయ్యంకి వెంకటరమణయ్య
3 డాక్టరు రంగనాథన్
4 మెల్విల్ డ్యూయీ
5 పాతూరి నాగభూషణం
6 మన గ్రంథాలయ సేవకులు